# భారతి

సెప్టెంబరు 1968





వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

---

వెల ఒక రూపాయి

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



సెప్టెంబరు 1968





సంపుటము: 45 : సంచిక : 9 :

విడిప్రతిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1968



---

# ప్రస్తుతగీతము

శ్రీ మిరియాల రామకృష్ణ

గత సమస్యలఁగూర్చి పేచీ
వర్తమానము గుండె ఖడ్గము!
గతము చూపే గగనమార్గము
భావి బంగరుబాట కడ్డము!

గతము నిద్రగ మఱచి, తెలివిగ
బ్రతికెదను ఈ కాలమందే!
నేటి యుదయము నాకు మెలకువ!
నిన్న రాతిరి నాకు తలగడ!

వాయులీనవలాహకమ్మున
సోయగముగా నడచు అచ్చర
చిత్రచైతన్యమును చూపును
స్మృతిపథమ్మున వర్తమానము!

వర్తమానపు మంచుతెఱలను
వాదకరవాలమున చీల్చిన
కాలగళమున కాకలీధ్వని!
కవుల పెదవుల షడ్జమధురిమ!

గతము—వింతగ సాగిపోయిన
కథగ మాత్రము కనుల గట్టును!
వర్తమానము—కనుల ముందే
వర్తనము నొనరించు సత్యము!

వర్తమానపు శిఖరములపై
భావికాల పతాక మెత్తగ
పారిజాతము లట్లు ఆశలు
పరిమళించును మానసంబున!

వదనమున ముస్తాబు లేకయె
        వర్తమానము ముందు కేగిన
మూతిముడుచుచు భావికాలము
        మూగవోవుచు కూరుచుండును!

వర్తమానము గుర్తువట్టని
        వాని కలమున మషిరసమే
కాని కవితారసము జారదు!
        కానుపించదు నవ్యతాసుధ!
అందు జీవనగీతి సాగదు!

వర్తమానము కోరి దాల్చెడి
        పసిడినగిషీ నగల మెఱుపుల
చలువ జలతారంచు వలువలు
        చలనజీవన చేతనతలే!

విడదలోపలి ముసలితనమును
        ఎదుట పెట్టును వర్తమానము!
భావమందు నిరాశయుండిన
        పట్టిచూపును వర్తమానము!
పలితకేశము నల్లగా ద
        ర్పణములోపల కానబడునా!
మాసిపోయిన మోముచిత్రపు
        మూసలో స్నిగ్ధతను గనునా!

2

గతమునకు ఆదేశమోయన
        అతుకుకొనగా వర్తమానము
గతమునే ఆమ్రేడితముగా
        కలుపవలె ననుకొనెడివారే
కూలబడుదురు జీవితమ్మున
        త్రేలబడుదురు గతము బూజాల!

## ప్రస్తుత గీతము

గతము వైయాకరణి వోలిక
కాలలక్షణ బోధ చేయును!
వర్తమానము కవుల రచనల
వలెనె స్వేచ్ఛగ సాగిపోవును!
వర్తమానము కవితవలెనే
ప్రజల ముందుకు నడపుచుండును!

గ్రంథముల అవలోడనములో
అందుకొను కించిత్తు ప్రతిభ
గత మహంభావమున కొక ప
ర్వతము జత సంధించి విడుచును!

బాధబోధకు అక్షరమ్ముల
పలికినట్లులు వర్తమానము
ఒక స్వతంత్రాలోచనాత్మకు
ఒరవడుల నందించుచుండును!

గతము నెఱుగరు చిన్నపిల్లలు
గగనమందలి శక్రువిల్లులు!
గంధఫలు లానందవల్లులు
గతము నెఱుగరు చిన్నపిల్లలు!

గతము తలపరు పెండ్లికూతులు
అతులమందస్మేరదాతలు!
కామరాజ్యపు శాంతిదూతలు!
గతము తలవరు పెండ్లికూతులు!

గతము నెఱుగనివారి నవ్వుల
కానుపించును మల్లెపువ్వులు!
గతము తలపనివారి చూపుల
కానుపించును మధులిహమ్ములు!

గతములోపల తిన్న గాయాల్
స్మృతికి గాని వ్యర్థపు లేపమవ్వల
వెతలుచేసే ఆలుమగలకు
రజని యిచ్చునర మ్మశాంతియె!

గతము కట్టిన బూజువందిరి
కాంచి నీడనుగోరు మానిసి
కాలపురుషుడు చేయు వేళా
కోశములకే కందిపోవును!

3

ప్రాకు చీమకు, ఎగురు పిచుకకు
పల్లవించే తీగ కున్నటు
ఇంటిధూళికి గూటికాళికి
ఎచట నున్నది వర్తమానము!

ఎదుట లక్ష్యములేని యప్పుడు
ఎగిరి కాలపువలను చిక్కును!
కలము కదుపగలేని రచయిత
కనులు గప్పి గతించిపోవును!
చలన మెఱుగని గమన మెఱుగని
చక్కచూడక తొలగిపోవును!
మౌనమందున మూర్ఛపోవును!
దీనదశలో వణకిపోవును!
కునికిపాటున కుమిలిపోవును!
వర్తమానము తత్త్వ మిది యని
గుర్తెఱుంగనివారు రసికులె!

మెలగి ముచ్చటలాడి కులుకక
కులికి పరియాచకము లాడక
ఆడిపాడుచు నవ్వుకొనకే
మ్రోడువారే పడుచుజంటల
మధ్య పాపము వర్తమానము
మాడి ఆకలి కీసురోమను!

గడచిపోయిన జీవితములో
కానబడు ఫేనముల కన్నా

## ప్రస్తుత గీతము

గడచు జీవితమందు కనబడు
కడలి కల్లోలములె వింతలు!

వర్తమానతరంగ రవభా
వముల అల్లల్లాడి ప్రాణులు
భావికాలపు మృదుల లాస్యము
పట్ల కోరిక పెంచుకొందురు!

రాత్రివంటిది గతము; సూర్యుని
రాకముందరి ప్రకృతివంటిది
వర్తమానము! దానిలోనికె
వచ్చుచుండును భావికాంతులు!

ప్రొద్దు బారెడు సాగిపోగా
నిద్దురను వదిలించుకొను వా
డెలుగజాలడు వర్తమానపు
టరుణరాగ సుగంధఘుమఘుమ!
అతడు తృష్ణకు దూరబంధువు!
అతడు నిర్వేదంపు సింధువు!

అరుణ రాకకు పిదపగూడా
ఆర్పివేయని దీపముట్టలు
మందబుద్ధికి గతమె మహదా
నందకరమగుచుండు నెప్పుడు!

వర్తమానము క్రాంతి చూచిన
వాడె గణ్యుడు! వాడె పుణ్యుడు!
ప్రాగ్దిశాకుంకుమము చూచిన
వాడె ధన్యుడు! వాడె మాన్యుడు!

కాలమందున వర్తమానమె కానబడు రహదారి!
వర్తమానములోనె మనిషికి గుర్తుగలదొక భావి!

———

# భారతీయ రసతత్వం

శ్రీ కొండిపర్తి శేషగిరిరావు

ఆధ్యాత్మిక చింతనలో పరాకాష్ఠ నందుకొన్న దేశాలలో మన భారతదేశం ఒకటి. ఈ దేశంలోని ఆధ్యాత్మికత వివిధ తత్వాలనూ తనలో కలుపుకొని పురోగమించింది. అలా తనలో కలుపుకొన్న తత్వాలలో రసతత్వం కూడా ఒకటి.

ఈ ఆధ్యాత్మిక రసతత్వాలకు గల సంబంధ బాంధవ్యాలను కనుక పరిశీలిస్తే; రసతత్వములేని ఆధ్యాత్మికతా, ఆధ్యాత్మికతలేని రసతత్వమూ మన భారతదేశంలో లేవేమో! అన్నంత పటిష్ఠంగా అవి పెనవేసుకొని ఉన్నాయి.

ఇలా అవి ఒకదాన్ని మరొకటి పెనవేసుకోవటంవల్ల; ఆధ్యాత్మికత సుందరంగానూ, రసతత్వం వస్తుగతాతీతంగాను ఐనాయి.

అందుకే భారతీయ రసతత్వంలో వస్తుతత్వాన్ని ప్రేరేపించే లక్షణాలకన్నా సౌందర్యాన్ని ప్రేరేపించే లక్షణాలే అధికంగా కనబడుతూఉంటాయి. కనుకనే భారతీయ రసతత్వంలో ప్రకృతి అనుకరణ కన్నా; భావాధిక్యమూ, దానితోబాటు ఆధ్యాత్మికతా పొందుపరుపబడింది. అందుకే ఇక్కడి రసతత్వాన్ని ఆస్వాదించే ప్రజలలో వారికి తెలీకుండనే వారిలో కళాకోణం ఏర్పడిపోయింది. కాబట్టి మన ప్రాచీన రసతత్వాన్ని ఈనాటికీ ఎవరూ భౌతిక ప్రేరణల దృష్టితో చూడలేక భావాలలో విహరిస్తూ ప్రకృతికి కాస్త దూరమౌతున్నారు.

పోతే పాశ్చాత్య రసతత్వంలో ఈ లక్షణం అంతగా లేదు. అందుకు అక్కడి రసతత్వంలో భౌతికానుకరణ ఎక్కువగా ఉండటమే కారణం. ఐనా వారూ భావుకులే కానీ వారి భావన ప్రకృతిని ఎక్కువగా గాఢాలింగనం చేసుకొంది. అందుకే వారి రసతత్వంలో భౌతికవుపాలు కొంచెం అధికం. కనుకే ఆ రసతత్వానికి ఎదురుగానున్న రసద్రష్టలకు కళాకోణం కావలసి వచ్చింది. కాబట్టి, కళాకోణాన్ని అలవరచుకోటానికి రసతత్వాన్ని అర్థం చేసుకోవాలనీ; రసతత్వాన్ని అవగతం చేసుకోటానికి కళాకోణాన్ని ఆకళించుకోవాలనీ అంటారు వారు.

భారతదేశంలో అలాకాదు. ఇక్కడి రసతత్వంలో ఆధ్యాత్మిక భావుకత పరోక్షంగా ఉండటం వలన, ప్రతిద్రష్ట రసతత్వాన్ని భౌతిక దృష్టితో చూడక భావాత్మకంగా చూస్తుంటాడు. ఇంకా వీలుంటే దానికికూడా అతీతమైన దృష్టితో రసతత్వాన్ని అవలోకించటానికి ప్రయత్నిస్తాడు.

అలా అని భారతదేశంలోని రసతత్వం అంతా ఆధ్యాత్మిక భావుకతే అని అనటానికి వీలులేదు. ఎందుకంటే భారతదేశంలోని ఆధ్యాత్మికత ప్రాలికంగా వస్తుతత్వాన్ని మానవునికి దూరం చేయటానికి ప్రయత్నం చేస్తూ ఉంటుంది. కాబట్టే ఈ ఆధ్యాత్మికత రసతత్వాన్ని కొంతవరకు మాత్రమే తనలో కలుపుకొంది.

ఈ దశయందలి ఆధ్యాత్మికత రసభావ రూపంలో పురోగమించి భావాతీతత్వాన్ని పొందుతోంది. అలా ఆధ్యాత్మిక రసతత్వాలు భావాతీతత్వాన్ని పొందిన దశయందు, రసతత్వము వస్తుజనితమూ వస్తుప్రేరితమూ అనే భావనను కలిగించి, రసతత్వాన్ని రమణీయత అనే చోట వదిలేసి పరాకాష్ఠనందుకోటానికి ముందడుగు వేస్తోంది భారతీయ ఆధ్యాత్మికత.

అలా ముందడుగు వస్తుతున్నకొద్దీ రసతత్వం

భౌతికజీవనంలోకి జారిపోతూ, ఆధ్యాత్మికత భావాతీతమైన అభావస్థితిలోనికి ప్రవేశిస్తూ ఉంటుంది.

కనుకనే ఆధ్యాత్మికత నిరంజనత్వం కలిగిందైతే, రసతత్వం రంజనత్వం కలిగింది ఔతోంది.

*       *       *

మరో దృష్టిలో భారతదేశంలోని ఆధ్యాత్మిక రసతత్వాలకుగల సంబంధబాంధవ్యాలను పరిశీలిస్తే చాలా ఆశ్చర్యమే కలుగుతుంది.

ఎందుకంటే భారతీయ రసతత్వము ఆధ్యాత్మికతలోని రెండు విభిన్నమార్గాల వైరుధ్యంవల్ల జనించింది.

ఐతే ఆ రెండు మార్గాలూ ఆధ్యాత్మికతకు విభిన్నమైనవీ, దూరమైనవీమాత్రంకాక ఆధ్యాత్మికతను చేరే రెండు మార్గాలుగామాత్రం ఉన్నాయి.

ఆ రెండు మార్గాలే ఆధ్యాత్మికతలోని సాకారోపాసన, నిరాకారోపాసన.

అసలు భారతదేశంలోని ఆధ్యాత్మికత మొదటలో నిరాకారోపాసన మార్గంలోనే ఉండేది.

ఐతే కాలప్రవాహంలో ఓ చిన్నమార్పు వచ్చింది.

నిరాకారోపాసనలో సాధకుడు అత్యున్నతమైన స్థాయినిచేరి చేరినతరువాత తనలోని ఆధ్యాత్మిక తాదాత్మ్యతనంతనూ ఓ చోట క్రుమ్మరించాలనే ఓ ఆకాంక్ష అతనిలో బయలుదేరింది. దీనివలన అతని సాధనకు పురోభివృద్ధిమార్గం కూడా దొరుకుతుంది అని భావించాడు.

ఆ దశయందు అతను తన నైరూప్యమైన భావుకతకు ప్రతీకగా ఓ శబ్దాన్నీ, ఓ ఆకారాన్నీ సృష్టించుకున్నాడు. దానివలన ఓ భావఉద్వేగ ప్రయోజనం కూడా ఉంది అని భావించాడు.

అలా ఆ ఆధ్యాత్మిక ప్రతీకలవలన తాను గతంలో పొందిన నిరాకారోపాసనలోని అత్యున్నతమైన తదాత్మ్యస్థాయిని, తాను ఈ శబ్దరూపాత్మకములైన ప్రతీకలవలన అతిత్వరలో చేరవచ్చు నని అనుకొన్నాడు.

పైగా తాను పొందిన ఈ ఆధ్యాత్మిక తదాత్మ్యయువుస్థాయి నిరాకారోపాసనవలన కాలప్రవాహంలో కలిసిపోతూ ఉండేది. తిరిగి ఆ స్థాయిని అందుకోటానికి కొంత కాలవ్యవధికూడా పడుతూ ఉండేది. కనుక అలాంటి కాలవ్యవధిని అధిగమించటానికి పరాకాష్ఠచెందిన తన ఈ ఆధ్యాత్మిక తదాత్మ్యయతను ఓ శబ్దంలోనూ, ఓ సాకారంలోనూ మలిస్తే ఆ తాదాత్మ్యయువు స్థాయి అందులోనే ఇమిడిపోయి కొంత శాశ్వతత్వాన్ని కూడా పొందుతుంది అని భావించాడు ఆధ్యాత్మిక సాధకుడు. తిరిగి ఆ తదాత్మ్యయువు స్థాయిని చేరాలంటే తాను మలచిన ఈ శబ్దరూపాత్మకములైన ప్రతీకలను ఓ సారి ఉచ్చరిస్తే, దర్శిస్తే ఆ స్థాయిని అతిత్వరలో చేరవచ్చు అనే భావపరిణామంకూడా వచ్చింది సాధకునిలో. ఇలా పరిణామం చెందిననిరాకారోపాసి సాకారోపాసి ఐనాడు.

ఇలా ఆధ్యాత్మిక తదాత్మ్యయ స్థాయీభావన కొంత పూర్ణంగా రూపొంది, కొన్ని ప్రతీకల సృష్టికి సాధకుని ప్రేరేపిస్తే; తిరిగి ఆ ప్రతీకలే నిరాకారమైన తాదాత్మ్యయ స్థాయిని పొందటానికి అతణ్ణే ప్రేరేపిస్తున్నని.

అలా ఆధ్యాత్మిక సాధకుడు భౌతిక స్థితినుండి అభౌతిక స్థితిలోనికీ, అక్కడనుండి అభావాతీత చేతన స్థితిలోనికిపోయి; అక్కడినుండి తిరిగి అభౌతిక స్థితిలోనికీ, భౌతికస్థితిలోనికీ ప్రయాణించటానికీ ఈ ప్రతీకల ఉపాసన చాలా బాగా ఉపయోగపడింది.

ఇలాంటి స్థితిలోనే 'ఓం'న్నూ 'శివలింగానిర్మాణమున్నూ' జరిగింది. ఇవి ప్రతీకలే ఐనా, వీని నిర్మాణం పూర్తిగా నిశ్శబ్దమూ, నిరాకారమూ ఐంది. కాకపోతే ఇవి ఆధ్యాత్మికభావాలను బాగా ఉద్వేగింపజేయటానికి తోడ్పడే సాధనలు మాత్రమే ఐనాయి. అందుకే వీని నిర్మాణంలోని శబ్దమూ రూపమూ నామమాత్రంగానే గోచరిస్తాయి.

నిజంగా రూపజగత్తులో శివలింగాన్ని పరిశీలిస్తే, ఏనాడో మన ఆధ్యాత్మికులు నైరూప్యమైన శిల్పాన్ని సృష్టించారా! అని అనిపిస్తుంది. ఈ రోజున జగద్విఖ్యాతంగా పేరొందిన నైరూప్య కళలోని వౌలికసూత్రాన్ని శివలింగంలో ఇమిడ్చి భిగించేశారు. కాకపోతే ఇది కొన్నిరూపాల సమ్మిశ్రిత సమష్టి సామరస్య స్వరూపం కావచ్చు. ఐనా ఆ రూపాలు ఇందులో అస్పష్టం. కనుక ఇది నైరూప్యమే ఔతోంది రూపజగత్తులో.

ఐనా విచిత్ర మేమంటే మన ఆధ్యాత్మికత ఎంతగా రసతత్వాన్ని తనలో ఇముడ్చుకున్నా, తన మూలసిద్ధాంతాన్నిమటుకు పెంచుకుంటూనేపోయింది. అంతేకాకుండా రసతత్వాన్ని తనకు అనుగుణంగా కూడా మార్చుకొంది, మలచుకొంది.

ఐతే రసతత్వాన్ని ఆధ్యాత్మికత తనలో కలుపుకోటానికి ఓ ముఖ్యకారణం కూడా ఉంది.

సామాన్యుడు రసతత్వంద్వారా ఆకర్షింపబడి ఆధ్యాత్మికతకు దగ్గరగా రావాలి, ఆ తరువాత అతను పూర్తి ఆధ్యాత్మికుడుగా రూపొందాలి అనే ధ్యేయంతోనే, రసతత్వాన్ని ఆధ్యాత్మికత తనలో కలుపుకొంది.

ఇలాంటి ధ్యేయంతోనే భారతదేశంలోని రసతత్వం ఆధ్యాత్మికతతో సంయోగం చెందింది. అలా సంయోగం చెందటంవలన చంచలమైన సామాన్యుని దృష్టి వికలం కాక, కళను భక్తిభావంతో అర్చించే స్థితిలోకివచ్చి, వానిలోని రసజ్ఞత ఓ చోట కేంద్రీకరింపబడుతుంది. ఆ తరువాత అతని దృష్టి ఆధ్యాత్మికత వైపు మళ్లింపబడి అతణ్ణి ఆధ్యాత్మిక సాధకునిగా చేస్తోంది.

అంతేకాదు, రసతత్వాన్ని పోషించే బాధ్యతను కూడా ఈ ఆధ్యాత్మికత వహించింది. దానివలన ఆధ్యాత్మికత విశ్రుతమూ విస్తృతమూ ఐంది.

అందువల్ల ఆధ్యాత్మికతలేని రసతత్వమూ, రసతత్వములేని ఆధ్యాత్మికతా స్వయంపోషకాలు కాలేక అవి పరస్పరాశ్రితాలయ్యాయి. అందుకేనేమో; రసతత్వం ఆధ్యాత్మికానువర్తిగానూ, ఆధ్యాత్మికత రసాంతర్వర్తిగానూ కనిపిస్తూ ఉంటాయి మన భారతదేశంలో.

అసలు ప్రాథమిక మాధ్యమిక స్థాయిలవరకే ఆధ్యాత్మికత రసతత్వాన్ని తనలో ఇముడ్చుకొంది. ఆ తరువాత ఆధ్యాత్మికత సాకారాన్నీ రసతత్వాన్నీ వదిలేసి నిరాకారాన్ని ఆశ్రయించి, స్థూల సూక్ష్మ స్థితులనూ భావాలనూ దాటి, అభావాతీత చేతనస్థాయిలో ప్రవేశిస్తోంది.

కనుకనే ఆధ్యాత్మికానందము శాశ్వతికనిర్గుణత్వము కలిగిందైతే; రసానందము శాశ్వతిక సగుణత్వము కలిగింది ఔతోంది. పైగా ఆధ్యాత్మికానందమునకు ఆపాదింపబడిన అశాశ్వతిక సగుణత్వము రసతత్వానికి ఉండదు. కాన ఆ గుణాలతో రసానందము నిర్గుణత్వమైంది ఔతోంది. కాకపోతే వస్తుత్వాతీత లక్షణంలో ఇవి రెండూ కొంత దూరం ప్రయాణించి ఆ తరువాత విడిపోతున్నాయి.

* * *

సర్వసాధారణంగా జీవుడు వేరూ, బ్రహ్మస్వరూపం వేరూ, అని భావిస్తూ ఉంటుంది ఆధ్యాత్మికత. కనుకనే రసానందాన్ని, ఇంద్రియ ప్రభావితమైన జీవి మాత్రమే అనుభవిస్తూ ఉంటుంది. అందుకనే ఈ రసానందం జీవుని వరకే పరిమితమైంది ఆధ్యాత్మిక జగత్తులో. ఆ తరువాత తనలోని జీవునికన్నా, ఇంద్రియాతీతమైనదానికన్నా, ఉత్కృష్టమైనదానితో మాత్రమే బ్రహ్మతత్వాన్ని దర్శించగలడు ఆధ్యాత్మిక సాధకుడు. కనుక జీవుడు రసానందపు లోతులను చూడగలిగితే; మానవునిలోని జీవాతీతమైన మరో తత్వం (ఆత్మ) బ్రహ్మతత్వాన్ని చూడగలుగుతోంది.

కాకపోతే ఆధ్యాత్మికోపాసిలో కనుక సౌందర్య తత్వం కొంచెం అధికంగాఉంటే తాను దర్శించిన ఆ బ్రహ్మతత్వాన్ని సుందరస్వరూపంతో పోలుస్తాడు. దాన్నే ఆధ్యాత్మికతలోని రసతత్వం అని అనవచ్చు. కానీ అదియే కేవల ఆధ్యాత్మికత్వమూ, రస

తత్వమూ మాత్రం కాదు. అలా రసతత్వాన్ని బ్రహ్మ తత్వంగానూ, రసానందాన్ని బ్రహ్మానందంగానూ పోల్చడం వాని అసలు స్థితులను భ్రమింపజేయటమే ఔతోంది కేవల ఆధ్యాత్మిక దృష్టిలో.

అందుకే ఆధ్యాత్మికజగత్తులో బ్రహ్మానందము ప్రమ ఐ, రసానందము భ్రమ ఐతే; రమణీయ జగత్తులో రసానందము ప్రమ ఐ, బ్రహ్మానందము భ్రమ ఔతోంది!

వస్తుతః ఆధ్యాత్మికుడు స్థూల సూక్ష్మ తత్వాలనూ, వాటిని ఆవరించిన వాని నన్నిటినీ త్రోసి వేసి ముందుకు పోతున్నాడు అలా అతనితో త్రోసి వేయబడినవాటిలో రసతత్వముకూడా ఒకటి ఔతోంది.

కనుక అలాంటి స్థితిలోని ఆధ్యాత్మికుడు రస తత్వానికిగానీ రమణీయతకుగానీ ద్రవీకరించువాడూ, రసోద్వేగి కాలేడు. అందుకు అతనిలోని నిర్వీర్యత నైరాశ్యతలే అడ్డొస్తుంటాయి. ఆ స్థితిలో అతను రసతత్వానికి దూరమౌతున్నాడు.

కాన ఆధ్యాత్మిక పరిధిలో ఇంద్రియ ప్రభావిత మైన జీవుడూ, ఇంద్రియాతీతమైన ఆత్మా ఎలా వేరు వేరో, అలానే రసతత్వమూ, బ్రహ్మతత్వమూ వేరు వేరు ఔతున్నాయి.

ఎందుకంటే జీవుడు సూక్ష్మ పాంచ భౌతిక లక్షణాల ప్రభావాలను అంటిపెట్టుకున్నట్లుగానే రసతత్వమూ రసానందమూ పాంచభౌతికమైన రమ ణీయతలను అంటిపెట్టుకొని ఉంది. అంతేకాదు. ఆత్మ వస్తువిగతమైన భావాతీతత్వాన్ని అంటిపెట్టు కొన్నట్లుగానే, బ్రహ్మతత్వము భావాతీత అభావాతీత చేతనత్వాన్ని అంటిపెట్టుకొని ఉంది.

కనుక జీవుడూ ఆత్మా కొంతలేదాతో వేరైనట్లుగానే, రసానందమూ బ్రహ్మానందమూ వేరు వేరౌతున్నాయి అసలైన సిసలైన ఆధ్యాత్మికదృష్టిలో.

కాకపోతే జీవుడూ ఆత్మా వ్యాపకత్వ నిత్యత్వ లక్షణాలనుబట్టి వానికి ఏకత్వము ఎలా ఆపాదింప బడిందో, అలానే బ్రహ్మానంద రసానందములలోగల వస్తుత్వాతీత లక్షణాల్నిబట్టి ఏకత్వం స్థూల దృష్టితో మాత్రం ఆపాదింపబడింది. కానీ సూక్ష్మ దృష్టిలో ఆ వస్తుత్వాతీత లక్షణాలతో చూస్తేనే రంజనత్వ నిరంజనత్వముల వలన అవి రెండూ విభిన్న త్వాన్ని పొందుతున్నాయి.

అందుకే-

రసజగత్తు స్థూలమూ, ఆధ్యాత్మిక జగత్తు సూక్ష్మమూ! రసానందము వస్తుగతమూ, బ్రహ్మానందము వస్తువిగతమూ! బ్రహ్మానందము ప్రమ, రసానందము భ్రమ ఔతోంది,

—ఆధ్యాత్మిక దృష్టిలో.



# కాటయవేముడు-అతని సంతానము: ఒక పరామర్శ

శ్రీ తురగా కృష్ణమూర్తి

భారతిలో శ్రీ కొల్లూరి పార్శ్వపర్వనశర్మగారు ప్రచురించిన కాటయవేముని అన్నవర దానశాసనము, శ్రీ మునుమూరి సాంబశివరామమూర్తిగారు ప్రచురించిన అల్లాడవేమభూపవర (పినపళ్ల) తామ్రశాసనములలోని విషయములను చర్చించుచూ నేను వ్రాసిన విమర్శనావ్యాసములను పరికించినమీదట శ్రీ అప్పారావుగారు తమకు కొన్నిఊహలు స్ఫురించినవనియు, వాటిని వ్యాసరూపమున వెలువరించుట చారిత్రక పరిశోధకులకు, చరిత్రప్రియులకు యుపయుక్తములుగా నుండునని తమ ఆశయముగా నుట్టంకించి యొక యమూల్యవ్యాసము 1968 వ సం॥ జూన్‌నెల 'భారతి' (సంపుటము 45 సంచిక 6) లోఁ బ్రచురించియున్నారు. అందు వారు ప్రధానముగా కాటయవేముని సంతతినిగూర్చియు, భార్యలను గూర్చియు తమ ప్రస్తావనను పరిమితము చేసుకొని యొక నూత్న విషయమును వెలువరించుచూ, నిశ్చితార్థమైన వేరొక విషయమును వివాదగ్రస్త మొనరించి విడిచినారు!

అల్లాడవేమవర శాసనమునం దుదాహృతమైన 'ప్రాతీం కాటయవేమ క్షితిపతేః పుత్రీంచ కాటప్రభోః' యను శ్లోక పాదమును బార్నెటుదొరవారు యన్వయించి యిచ్చిన సక్రమపాఠమును కాదని ప్రభాకర శాస్త్రిగారు తమ స్వంత సవరణ నొకదాని నుపపాదించి, విషయమును క్లిష్టమొనర్చి, చరిత్రగతినే మార్చి, పరిశోధకుల నపమార్గమున త్రోసి తల పట్లు పట్టించిన హరిహరరాయల దౌహిత్రి 'హరిహరాంబ' మాతాపితరులు కాటయ, విజయలక్ష్ములుగా నిర్ణయించి, తన్నిర్ణయమున కుపోద్బలకముగా ప్రకర్ణ కదంబరాజుల శాసనములలో నొకదానిని గొనుత్తించి శ్రీ అప్పారావుగారు విషయనిర్ణయ మొనర్చినారు. కాటయవేమునకుఁ గాటయయను నొక కొమరుడున్నట్లు, నాతడే హరిహరరాయల కూతును విజయలక్ష్మి నుద్వాహమై యామెయందు 'హరిహరాంబ' యను కూతుం గాంచెననియు, నా హరిహరాంబనే అల్లాడవేమారెడ్డి పరిణయమై కాటయకు యల్లుడునుఁ గాటయవేమునకు మనుమరాలు భర్తయు నైనట్లు విస్పష్ట మొనర్చినారు.

కాటయవేమునకుఁ గాటయయను నొక కుమారుడున్నట్లు రూపించుచు నేను 'భారతి' పత్రికలో ప్రచురించిన వ్యాసములలోని యుపపత్తులనే శ్రీ అప్పారావుగారు అనుసరించుచు తమ రచన సాగించి, గోకర్ణ కదంబరాజుల సంస్కృతభాషా శాసన ప్రచురణలో నా విషయమునకు మరింత బలము చేకూర్చి, సందేహముల నన్నింటినీ దూరీకృత మొనర్చినారు! ఇందులకు వారికి చారిత్రక పరిశోధకులు కృతజ్ఞులై యుండక తప్పదు. ఈ విధముగా వారొక నూత్న విషయమును వెలువరించి, యింతవరకు వివాదగ్రస్తముగానున్న యొక విషయమైగల అపోహల వెల్ల తొలగించి నిశ్చితార్థము చేసినారు.

ఇట్లొనరించుచునే వారీవరకే నిశ్చితార్థమై నిలిచియున్న మరొక విషయమును వివాదగ్రస్త మొనరించినారు! అదేమన—దొడ్డాంబిక కాటయవేముని భార్య కాదనుట!

శ్రీ అప్పారావుగారి నిర్ణయమునుబట్టి కాటయవేమునకు అన్నమ, మల్లమ, తల్లమలే భార్యలనియు, అన్నమ కుమారగిరి సోదరి, కాటయవేముని దేవేరి, అనితల్లి తల్లియనియు, మల్లమకే కాటయ యుద్భవించెననియు, తల్లమకు కొమరగిరి ప్రభవించెననియు, ఈ విధిని కాటయవేమునకు ముప్వురు

భార్యలు ఇరువురుకొమరుల నొకకొమరిత యనియు స్పష్టపడుచున్నది. ఈ నిర్ణయించుటలో కాటయవేమునకు 'దొడ్డాంబిక'యను భార్య లేదనియు, దొడ్డాంబిక అనితల్లి తల్లియని చెప్ప 'కలువచేరు శాసనము'లోని 'యస్యావేమనృపాలోజనకో దొడ్డాంబికాతు జనయిత్రీ, సాధీవ్యత్యనితల్లీ సమూర్తిరివ దేవభూమిదేవశ్రీ' యను శ్లోకపాదములకు నింతవరకు చెప్పబడుచున్న యర్థము సరికాదని, యన్వయము లోపభూయిష్ఠమని అధిక్షేపించుచు, వొంక నూత్న యన్వయమును, క్రొత్త యర్థమును ప్రవచించి, 'దొడ్డాంబిక' కాటయవేముని పత్నిగాగాక మాతగా సూచింపబడినదని సాహసోపేతమగు నొక ప్రకటన గావించినారు. దానిని పురస్కరించుకొని, కాటయవేమునకు 'దొడ్డాంబిక' భార్యకాదని, అనితల్లి తల్లి అన్యమగాని 'దొడ్డాంబిక' కాదని నిర్ణయముచేయ దొరకొన్నారు. ఈ నిర్ణయమెంతవట్టు సమర్థనీయమో పరామర్శించుట కుద్దిష్టమైనదే నా యీ వ్యాసము.

'దొడ్డాంబిక' కాటయవేముని భార్యయని చూపు సందర్భంలో నేను 'కుమారగిరి సోదరీలుగా చెప్పుకొనదగు అన్యమ, దొడ్డాంబికల ప్రసక్తి ప్రస్తుత అన్నవరదాన శాసనములోను, అనితల్లి కలువచేరు శాసనములోను తప్ప యితర యే విధములగు శాసనములందుగాని, గ్రంథములందుగాని గానబడుట లేదు... కాటయవేముడు దివంగతుడైన 8 లేక 10 సంవత్సరముల తర్వాత 'అనితల్లి కలువచేరు' శాసన మీయబడినది. ఈ శాసనములోనే అనితల్లి జనని, కాటయవేముని భార్య 'దొడ్డాంబిక' ప్రసక్తి తొలిసారిగా కానవచ్చుచున్నది. ఇంతవరకట్టి సమాచార మే శాసనమునందుఁ గూడ మనకందజేయఁబడ లేదు. అందుచే కాటయవేముడు రాజమహేంద్రవరరాజ్యమునకు కుమారగిరి తనయుడు అనవోతారెడ్డికి రక్షకుడుగా, మంత్రిగా, సేనాధిపతిగా వెడలునాటికి కుమారగిరి సోదరి 'అన్యమ'నుద్వాహమై యుండి యామెతో గూడ రాజమహేంద్రవరరాజ్యమునకేగి, యట దాంపత్య జీవనము నెరపుచుండి యుండవచ్చును. ఆ తరువాతఁ గొంతకాలమునకు 'అన్యమ' గతించుటచే (పాపము శమించుగాక) కాటయవేముడు కుమారగిరి మరొక సోదరియగు 'దొడ్డాంబిక'ను పరిణయమాడి యుండవచ్చును.' అని వ్రాసి 'అన్యమ' 'దొడ్డాంబికలు' భిన్నవ్యక్తులనియు, ఇద్దరును అనవోతారెడ్డి కుమార్తెలుకాగా, సోదరీలనియు, అందు అన్యమ పెద్దదనియు, దొడ్డాంబిక చిన్నదనియుచూపి, వారిద్దరు నొకరి వెనుక నొకరు కాటయవేముని వివాహమాడిరని' నిరూపించుచు వ్రాసిన వ్రాతలు భ్రమ, ప్రమాద జనితములనియు, అనవోతారెడ్డికి 'దొడ్డాంబిక'యను కూతురే లేదనియు, నామె కాటయవేమునిఁ బెండ్లియాడనే లేదనియు, 'అనితల్లి' కామె జననియే కాదనియు శ్రీ అప్పారావుగారు నిర్ణయింపదొరకొని, ఆ నిర్ణయమునకు వచ్చుటకు ముఖ్యముగా మూడు కారణములను పేర్కొన్నారు. ఆ కారణము లెంతవరకు సమంజసములో, సమర్థనీయములో పరిశీలింతము.

'వెనుకటి శతాబ్దములలో రాజుల భార్యలు తమ పేరిట అగ్రహారదానములుజేసి, శాసనములు వ్రాయించుకొను పరిపాటి, స్వతంత్రత గలదు. అట్టి వాటి కెన్నో ఉదాహరణలు చూపవచ్చును. కాటయవేముడు, అతని భార్యలుగూడ ఆ పద్ధతిలోనే గ్రామదానములుజేసి శాసనములు వ్రాయించిరి. అట్టి వన్నియు నొకచో చేర్చి 'కొమరగిరి మండల'మను పేరుతో కాటయవేముడు శ. స. 1332 (క్రీ॥ శ॥ 1410) నాటి 'అహోబల శాసనము'లో చూపినాడు. ఈ శాసనములోని 47 గ్రామములలోగాని, అతడు, అతని దేవేరులు విడివిడిగా ధారవోసి ఇచ్చిన 9 గ్రామములలోగాని 'దొడ్డాంబిక' ఇచ్చిన గ్రామముగాని, 'హరిహరాంబ' ఇచ్చిన గ్రామముగాని పేర్కొనబడలేదు. అందువల్ల వీరిద్దరు (దొడ్డాంబిక, హరిహరాంబ) కాటయవేముని భార్యలు కారని నిర్ధారణగా చెప్పవచ్చును' అని శ్రీ అప్పారావుగారు తమ వాదనకనుకూలముగా మొదటి కారణము నుట్టంకించినారు.

వారు తెలిపినట్లు వెనుకటి శతాబ్దములలో రాజుల భార్యలు తమ పేరిట అగ్రహారములు దానముజేసి, శాసనములు వ్రాయించుకొనుసాంప్రదాయము, స్వతంత్రత యున్నమాట కాదన వీలులేదు. అట్టి శాసనములు బయల్పడలేదుగాన యా వ్యక్తులే లేరని నిర్ధారింపబూనుట కొంత సాహస మనిపించుకొనునేమో! శ్రీ అప్పారావుగా రుదహరించిన అహోబల శాసనములో కాటయవేమారెడ్డి భార్యయు, కుమారగిరి సోదరియు నగు 'అన్యమ' క్రీ॥ శ॥ 1385 వ సం॥లో

యిచ్చిన అన్యమావర గ్రామదాన విషయము ప్రస్తావింపబడియుండలేదు! అందుచే 'అన్యమ' కాటయ వేముని భార్యయే కాదని యనగలమా? అహోబల శాసనము అన్యమావర దానశాసనము తరువాత 8 యేండ్లకు పుట్టబడినది. అందుచే నందు తద్గ్రామ దాన ప్రశంస తప్పక యుండియుండవలెనుగదా! అట్లు ప్రస్తావింపబడక విడువబడుట కేమైన కారణము శ్రీ అప్పారావుగారు చెప్పగలరా? అహోబల శాసనములో కాటయవేమారెడ్డి, అతని భార్యలు 9 గ్రామములు దానము చేసినట్లును, కాటయ వేముడు కొమరగిరిపురం అను పేర 47 గ్రామములు దానము జేసినట్లును యున్నది. కాటయవేముని భార్యలు అన్యమ, మల్లమ, తల్లమలని శ్రీ అప్పారావుగారు వ్రాకుచ్చియున్నారు. మల్లమ, తల్లమలు యిచ్చిన దానములే అహోబల శాసనములో ప్రస్తావింపబడినవి. కాని—'అన్యమ' గ్రామదాన విషయుమం దుట్టంకింపబడలేదు. ఆమె పేరుగూడ నం దుదహరింపబడియుండలేదు. అందులకు కారణము?

ఈ అహోబల శాసనస్థ విషయములపై వ్యాఖ్యానించుచు శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు 'అహోబల శాసనములోని' మూలంగూరంమ కొమరగిరిపురం' అనునది యొకటి యుండవలయును. అది యెచ్చటిదో యింతవరకు తెలియరాలేదు. రాజమహేంద్రవరమునకు ప్రాగుత్తర సీమలో రెడ్డిరాజుల కిలవేల్పయిన మూలగూరశక్తి యుండినటుల కాశీఖండ, శివలీలావిలాసాదులనుబట్టి తెలియవచ్చుచున్నది. ఆ మూలగూరశక్తిని రాజమహేంద్రవరమున స్థాపించినవాడు కాటయవేముడే. దాని తరువాత బేర్కొనబడిన 'అనవేంవరము' కాటయవేముని అన్నవరదానశాసనములో బేర్కొనబడిన అన్యమాపురము, వేమవరము కావలయుననిపించుచున్నది. కాటయవేముని భార్య, కుమారగిరిసోదరి యగు అన్యమాంబ తన సోదరుడిచ్చిన పులువర్తియను గ్రామమున కన్యమాపురమను పేరుపెట్టి శా. శ 1307 (క్రీ. శ. 1385) లో బ్రాహ్మణులకు దానము చేసెను. బహుశః వేమవరముకూడ నీ సమయముననే యగ్రహారముగ నీయబడియుండును' అని వ్రాసియున్నారు. కావున అహోబల శాసనములో 'శింగాయ పండితుల...[త్త] మా పండితులవారి అనవేంవరము' అనునదే కాటయవేమారెడ్డి యిచ్చిన వేమవర గ్రామమై యుండవలెను. అయిన 'అన్యమాపుర' గ్రామదాన ప్రసక్తి యెటనున్నట్లు?

'అనవేంవరము' అను పదములోనే అనవరము (అన్నవరము) వేమవరము అను రెండు గ్రామములిమిడియున్నవని వాదించినను, అనవరము లేక అన్యమావరము యిచ్చిన అన్యమ ప్రసక్తి యందుండవలెను గదా! అహోబల శాసనములో తల్లమ, మల్లమలిచ్చిన గ్రామదాన విషయ ప్రస్తావనలం జూచిన, అన్యమ గ్రామదాన విషయ ప్రస్తావన లోపించుట కేదియో బలవత్తర కారణముండవలెనని తోచుచున్నది! వెలుచూరి తల్లవర గ్రామదానమును వివరించుపట్ల అహోబల శాసనము ఈ క్రింది విధముగా వర్ణించుచున్నది. 'కాటమరెడ్డి వేమారెడ్డింగారి అర్ధాంగలక్ష్మి (అ) ౯ ఆ కొవరగిరియ్యంగారే ౯ కొమరగిరిరయ్యంగారై అవతరించ్చిన ౯ [కొమ] మరగిరయ్యంగార్కి తల్లింగారైన తల్లసానమ్మంగారు ౯ కొమరగిరయ్యంగారికి [న్ని] కాటమరెడ్డి వేమారెడ్డింగార్కిన్ని సుకృతముగాను శ్రీ గౌతమీ తీరమందును వేదాద్రి శ్రీ నరసింహ్వ దేవరకును ఆచంద్రార్కము ప్రతిసంవత్సర తిరునాళ్ల మహోత్సవానకు ధారవోసి సమర్పణ చేసిన వెలుచూరి తల్లవరము' ఇట్లనే మల్లమ దానము చేసిన మల్లవర గ్రామ విషయమైన వర్ణనమిట్లున్నది. 'కాటమరెడ్డి వేమారెడ్డింగారి అర్ధాంగలక్ష్మి అయిన మల్లసానమంగారు కాటమరెడ్డి వేమారెడ్డింగార్కిన్ని స్వామి అయిన కొమరగిరయ్యంగార్కిన్ని వారిదేవులైన అనుంగారులకున్ను అక్షయ సుకృత మగు అట్లుగాను మకర సంక్రమాణ పుణ్యకాలమందు రాజమహేంద్రవరాన శ్రీ గౌతమీ తీరమందు మార్కండేశ్వరదేవరకు సహింది గుడి కట్టించి మార్కండేశ్వరదేవరకు నిత్యఅవసరానకు నిచ్చిన మల్లవరము.'

కాటయవేముని భార్యలగు తల్లమ, మల్లమల గ్రామదాన ప్రశంస నింత విపరముగా ప్రస్తావించిన శాసనము కాటయవేముని దేవెరి, కుమారగిరి సోదరియునైన 'అన్యమ' యిచ్చిన 'అన్యమాపుర' గ్రామదాన ప్రశంసజేయక విడచుట యేల సంభవించినది? కాటయవేమున కన్యమకంటె ప్రీతిపాత్రురాలును,

సన్నిహితురాలును, యైశ్వర్య ప్రదాయినియునైన యామె వేరొకతె యున్నదా? అదియుగాక అన్నమాపుర గ్రామదాన కాలముగూర్చిగూడ నొక విశేష మున్నది. కుమారగిరి తన కుమారుడు అనవోతునకు రాజమహేంద్రవరరాజ్యము నొసగి, తన ప్రతినిధిగా నందు నిలిపి, అనవోతునకు మంత్రిగా, రక్షకుడుగా, సేనాధిపతిగా కాటయవేముని నియోగించి పంపిన కాలము క్రీ॥ శ॥ 1385 వ సంవత్సరమే! ఆ సంవత్సరముననే కాటయవేముడు తూర్పుదేశ దండ యాత్ర తలపెట్టి, యుద్ధభేరి మ్రోగించి, జైత్ర యాత్రకు బయలుదేరెను. అట్లు బయలుదేరుటకు ముందుగా దేవబ్రాహ్మణ ఆశీర్వాదములం బడయ నెంచి తన దేవేరియగు అన్నమచే 'అన్నమాపుర ము'ను, తాను 'వేమవరము'ను బ్రాహ్మణుల కగ్ర హారములుగా ప్రసాదించి, పిదప రాజమహేంద్రవర మున కేగి యచట ప్రాకారాంతరభూషితుడు, శుక బ్రహ్మ ప్రతిష్ఠితుడైన గోపాలదేవునకు నమస్కరించి, తూర్పునాటి విజయమును సాధించిపెట్టినచో నా దేవు నకు మంచి గ్రామ మొకటి దానము చేసెదనని మ్రొక్కుకొనినాడు. దీనినిబట్టి క్రీ॥ శ॥ 1385 సంవత్సరము కాటయవేముని జీవిత చరిత్రములో నత్యధికప్రాధాన్యము గలదని స్పష్టము. అట్టి ప్రాధాన్యత కలిగి, తనకు ప్రియతమమైన అర్ధాంగ లక్ష్మి అన్నమ తన జైత్రయాత్రా ప్రారంభ శుభ వేళ తొలిసారిగా దాన మొసంగిన యగ్రహార ప్రదాన ప్రశంస నుట్టంకింపక కాటయవేము డూరకుండు టకుగల కారణమేమని యూహింపవలయును? కావున అహోబల శాసనములో కాటయవేమారెడ్డి భార్యలుగా పేర్కొనక, వారి గ్రామదాన ప్రశంసలులేకపోయి నంతమాత్రమున నితర యాధారములచే సమన్వ యించి, నిర్ణయింపదగు విషయములను హేలామాత్ర ముగా గొట్టివేయదగదని విన్నవించుచున్నాడను.

'అనితల్లి' కలువచేరు శాసనములోని

> యస్యావేమనృపాలో జనకో
> దొడ్డాంబికాతు జననీ శ్రీ
> సాదీవ్యత్యనితల్లి సమూర్తిరివ
> దే: భూమిదే: శ్రీ॥

అను శ్లోకమునుబట్టి రెడ్డిరాజుల చరిత్రకారులు, శాసన విమర్శకులు కాటయవేమునకు దొడ్డాంబిక యను భార్య కలదని గ్రంథస్థము చేసినారు. పై శ్లోకమునకు వారు చెప్పిన అర్థము 'ఎవతెకు వేమనృపాలుడు తండ్రియో, దొడ్డాంబిక తల్లియో ఆ అనితల్లి ఆకృతిదాల్చిన దేవభూదేవలక్ష్మివలె తేజరిల్లుచున్నది.' కాని కొంత నిదానముగా ఆలో చించిన ఇది సరియైన అర్థము కాదని నా దృఢ విశ్వాసము. నా అభిప్రాయములో దాని అర్థ మిట్లుండవలెను. 'ఎవతెకు దొడ్డాంబిక తల్లియో యట్టి కాటయవేముడు జనకుడుగాగల యనితల్లి, ఆకృతి దాల్చిన దేవభూదేవలక్ష్మివలె తేజరిల్లు చున్నది. ఆ శాసన రచయిత అభిప్రాయముకూడ నదేయని నా తలంపు' అని శ్రీ అప్పారావుగారు తమ వాదన కనుకూలముగా రెండవ కారణమునుట్టం కించినారు.

ఈ శాసనములోని పై శ్లోకమునకు యింత వరకు అర్థము చెప్పిన పండితప్రకాండులు, పరిశోధ కులు, భాషావేత్తలు 'ఎవతెకు వేమనృపాలుడు తండ్రియో, దొడ్డాంబిక తల్లియో ఆ అనితల్లి ఆకృతి దాల్చిన దేవభూదేవలక్ష్మివలె తేజరిల్లు చున్నద'నునదే పిండితార్థమని నొక్కివక్కాణించి యున్నారు. అందులకు భిన్నముగా నేటికి శ్రీ అప్పా రావుగారు ద్రావిడ ప్రాణాయామముగా నా శ్లోక మునకు విపరీతార్థము స్ఫురింపజేసి, వారి వాదనా సౌలభ్యముకొరకు యేమేమో సూత్రార్థముల సాధింప జూచుచున్నారు! క్లిష్టాన్వయముచే వింతయర్థము నంటగట్టనెంచుచున్నారు! లేకున్న సుగమమును సద్యో స్ఫురణము నగు నీ శ్లోకమునకు అన్వయకాఠిన్య ముతో వింతయర్థమును గూర్చి శ్రమింపవలసిన యవ సరమేల వారికి కల్గినది?

ఈ శాసనములోని 'యస్యావేమనృపాలో జనకో దొడ్డాంబికాతు జననీ శ్రీ' యను శ్లోక పాదమునకింత వరకు యర్థము చెప్పిన వారందరును అనితల్లి తండ్రి కాటయవేముడు, తల్లి దొడ్డాంబిక యనియే నిష్పష్టార్థము చెప్పియున్నారు: కాని యిందు కాటయ వేముని తల్లి దొడ్డాంబిక ప్రసక్తియున్నదనిచెప్పిన వారొక్కరును లేరు! అప్పారావుగారి యర్థసాధనకు, యే యే వ్యాకరణ సూత్రముల నవలంబనముగాకొని,

యే యే విషయంబులుల సాహాయ్య మపేక్షించి కృతి కృత్యులు కాగలరో తెలియకున్నది! శ్రీ అప్పారావుగారు సూచించిన యర్థమ్మరణమిందు లేదుగదా, యందు లకు భిన్నముగానున్నదను విషయమునువారు గుర్తింప కుండుట చాల శోచనీయము! కార్యార్థి ముందు వెనుక లారయుడు యను సూక్తి యీ యెడ సార్థకమగు చున్నది! శ్రీ అప్పారావుగారు తావీ శ్లోకపాదమున కిచ్చిన అర్థసామర్థ్యముపై నమ్మకముంచి దొడ్డాం బిక 'అవితల్లి' తల్లిగాదని చెప్పసాహసించిరిగాని యీ యర్థమందు పొసగదని యెరిగిననాడు తమ వాదనను వదలుకొని పూర్వ మార్గమునే యవలం బింపవలతురనుట నిశ్చయము! ఏ విధిని చూచినను శ్రీ అప్పారావుగారి యర్థమీ శ్లోకమున కన్వయింప దని ఘంటాపథముగ చెప్పవలెను. అట్టియెడ శ్రీ అప్పారావుగారు సూచించిన యర్థము నిరర్థకమై, సమర్థనీయము గాకుండ పోవుననుట నిస్సంశయము!

'మంొక కారణమును గూడజూపి శ్రీ అప్పా రావుగా రనవోతారెడ్డికి దొడ్డాంబికయను కూతురు లేదనియు, కాటయవేముని భార్యలలో నామె యొకతె కాదనియు, దొడ్డాంబికయను నామె కాటయవేముని భార్యగా దలంచినయెడల అన్యమ, దొడ్డాంబికలు యేకవ్యక్తులేగాని భిన్నవ్యక్తు లెన్నటికి కారనియు వారి నిశ్చయమును తెలిపియున్నారు. తన్నిర్ణ యమునకు వచ్చుటకు వారు గైకొన్న వాదనాసరళి యిది.

అన్నవరదాన శాసనములో చూపినట్లు కుమార గిరిరెడ్డి, అన్యమాంబలు కవలలు గదా! అందువల్ల వారు సమవయస్కులుగదా! అనవోతారెడ్డి మరణ కాలమునాటికి కుమారగిరిరెడ్డి పిన్నవయస్కు డగుట వలన అనవోతారెడ్డి తర్వాత అతని తమ్ముడు అనవేమారెడ్డి రాజ్యమునకు వచ్చెను. కాబట్టి అనవోతా రెడ్డి మరణమునాటికి కుమారగిరిరెడ్డికి 15 సంవత్స రములు వయస్సని తలంచిన అతని మరణకాలము నాటికి అనగా క్రీ॥ శ॥ 1402 నాటికి అతడు దాదాపు 55 సంవత్సరముల వయస్సు వాడగును. కాబట్టి అప్పటికి అన్యమ గూడ 55 సంవత్సరముల వయస్సుగలదై యుండును అనవోతారెడ్డి క్రీ॥ శ॥ 1364 లో మరణించెను. అప్పటికి ఏ నాలుగు సంవత్సరములకు పూర్వమో దొడ్డాంబిక పుట్టెన దనుకొన్నను క్రీ॥ శ॥ 1402 నాటికే 42 సంవత్స రముల వయస్సుగలదై, అప్పటివరకు వివాహము గాకుండ బ్రహ్మచారిణిగానుండి క్రీ॥ శ॥ 1402 తర్వాత కాటయవేముని వివాహమాడినదనుట ఎంత ప్రయత్నించినను నమ్ముటకు వీలులేని విషయము. అందులోను ఆమె రాజకుటుంబములో పుట్టి 42 సంవత్సరములు అవివాహితగా నుండుట అసంభవము. కాబట్టి అనవోతారెడ్డికి 'దొడ్డాంబిక' యను కూతురే లేదు!

శ్రీ అప్పారావుగారీ హేతువాదన చేయుటలో భ్రమప్రమాదములకు లోనై అపమార్గమునుబట్టి పోయినారు! వారు అన్యమ, క్రీ॥ శ॥ 1402 వరకు అనగా కుమారగిరి మరణమువరకు జీవించియుండి, అతనితో సమముగా మరణించియుండెనని యూహిం చుటలోనే పొరబాటు చేసినారు! అన్యమ, కుమార గిరులు కవలలై యేకకాలమున జనించియుండుట సత్యమే! అయితే యేకకాలమందే మరణించినారని చెప్పుటకు శ్రీ అప్పారావుగారి కెట్టి యాధారమున్నది? ఒకవేళ కాటయవేముని అన్నవరదాన శాసనమును బట్టి యట్టిది సంభవించినదని శ్రీ అప్పారావుగా రూహించియున్న యదితప్పు! ఏలనన- క్రీ॥ శ॥ 1385 లో అన్యమ తనకు తన సోదరు డంతకు మున్ను యిచ్చిన పులుపర్తి గ్రామమును అన్యమా పురమను నామముతో బ్రాహ్మణుల కగ్రహారము చేసియిచ్చెనని అన్నవర శాసనము చెప్పుచున్నది. దాని కనుబంధముగా కాటయవేము డొసంగిన శాసనములో క్రీ॥ శ॥ 1402 సంవత్సరములో (అనగా మొదట దానమిచ్చినతరువాత 17 సంవత్సరములకు) కాటయ వేముడు అన్నవర, వేమవర గ్రామములలో వెనుక అన్యమయు తామను దానమీయగా మిగిలిన భాగము లను అన్నవర, వేమవర ద్విజుల సంప్రార్థనమున వారి యిష్టసిద్ధికై యొసంగెనని యున్నది. ఈ సందర్భమున అన్యమ ప్రసక్తి మంతయు నీ శాసన ములో లేదు. అనగా అన్యమ అన్యమావర గ్రామదాన మును క్రీ॥ శ॥ 1385 వ సంవత్సరములో చేయుగా నప్పుడు దానశాసనము వ్రాయబడక, తిరిగి కుమారగిరి మరణానంతరము కాటయవేముడు తద్గ్రామశేష భాగ ముల దాన మొసంగినపుడీ శాసనము వ్రాయబడెనని

ధృవీకరింపబడుచున్నది. అందుచే అన్యమ క్రీ. శ. 1385 వరకు సజీవయై యున్నటుల మాత్రమే యీ శాసనమువలన తెలియునుగాని అనుబంధ శాసనము నాటి కామె జీవించియున్నట్లుగాని, మరణించినట్లుగాని తెల్పుటకు యాస్కారమేదియు లేదు!

క్రీ. శ. 1385 వ సంవత్సరము తర్వాత 'అన్యమ' విషయము శిలాశాసనములలోను గూడ గానవచ్చుట లేదు. శ్రీ అప్పారావుగారు సూచించిన అహోబిల శాసనములోనైన నీమె ప్రశంస కానుపించదు! అందుచే క్రీ. శ. 1402 నాటికెంతయో కాలము ముందే యీమె చనిపోయి యుండవలెనని (పాపము శమించుగాక) నేను నా తొలి వ్యాసములందు సూచించియున్నాను. అట్టి మరణము క్రీ శ. 1386—87 వ సంవత్సరములలోనే సంభవించియుండిన నుండవచ్చును. అయిన అన్యమ చనిపోవునాటికి శ్రీ అప్పారావుగారి అంచనా ప్రకారము 38 సంవత్సరముల వయస్సు గలదై యుండియుండవలెను. దొడ్డాంబిక అనవోతారెడ్డి మరణించునాటికి నాలుగు వత్సరముల ప్రాయముదని మన మూహించినచో (శ్రీ అప్పారావుగారి ఊహ కూడనదియే!) అన్యమ చనిపోవునాటికామెకు 25 లేక 26 సంవత్సరముల వయసు గలిగియుండి, వివాహయోగ్యమైన యుక్తవయస్కురాలుగా యుండి యుండవచ్చును. కావున దొడ్డాంబిక అవివాహితగా 42 సంవత్సరముల కాలముండిపోయెనని, ఇది అసంగత విషయమని, అందుచే దొడ్డాంబిక అనవోతారెడ్డి కూతురేగాదని శ్రీ అప్పారావుగారు వ్రాసిన వ్రాతలు సమంజసములుగావు.

ఇట నింకొక విషయమును గూర్చి ముచ్చటింతును. శ్రీ అప్పారావుగారి వాదన ప్రకారము అనవోతారెడ్డి చనిపోవునాటికి అనగా క్రీ. శ. 1364 నాటికి కుమారగిరికి 15 సంవత్సరముల ప్రాయముండియుండుననుకొన్న కుమారగిరి క్రీ. శ. 1349 లో జన్మించి యుండవలెను. అన్యమయు కుమారగిరియుఁ గవలలుగాన అన్యమ గూడ క్రీ. శ. 1349 లో జన్మించియుండవలెను. నేననినట్లు అన్యమ క్రీ. శ. 1386 87 లలో గాక శ్రీ అప్పారావుగారి యూహల ప్రకారము క్రీ. శ. 1402 లో మరణించుటయే సంభవించియున్నట్లయిన నామెకప్పటికి, 54, 55 సంవత్సరముల వయస్సుండవలెను.

అనితల్లి కలువచేరు శాసనము క్రీ. శ. 1423 లో వేయబడినది. అప్పటికి అనితల్లి 24 లేక 25 యేండ్ల వయసు గలిగి యుండెనని యనుకొన్నచో నామె క్రీ. శ. 1398—99 లో జన్మించి యుండవలెను. శ్రీ అప్పారావుగారి వాదన ననుసరించి అన్యమ అనితల్లి తల్లియైనచో నవితల్లి జన్మించునాటికి "అన్యమ'కు 50 లేక 51 సంవత్సరముల ప్రాయముండి యుండవలెను. ఇది సామాన్యమైన విషయముగాదు! స్త్రీ తన యవ్వనమంతను కోలుపోయి అయిదుపదులు దాటియున్న కాలమున గర్భవతియై, సంతానమును గనెనన్న యదియెంతటి అసంగత విషయమో చెప్పబనిలేదు! అట్లు సాధారణముగా జరుగుట సంభవింపదు. కావున అన్యమయొట్టి సంతానమును పొందకనే మరణించగా నామె సోదరి 'దొడ్డాంబిక'ను కాటయవేము డుద్వాహమై కుమారగిరి తోడి బాంధవ్యబంధము సడలిపోకుండ నిలుపుకొనెనని మన మనుకొనుటలో విప్రతిపత్తి యేమియు లేదు! అన్యమ వివాహ మనవోతారెడ్డి జరుపగా, దొడ్డాంబిక వివాహము కుమారగిరి నిర్వహించినాడు. అదియునుగాక రాజమహేంద్రవర రాజ్యమును కుమారగిరి తన సోదరి (కాటయవేముని భార్య) కరణముగా నిచ్చెనను జనశ్రుతి కూడ కలదుగాన యీ విధిని యదిగూడ యదార్థమని యనుటకుకూడ నొక యాధారము కన్పట్టుచున్నది.

'అనితల్లి జనని యెవ్వరు?' అను శీర్షిక క్రింద శ్రీ చాగంటి శేషయ్యగారు తమ 'ఆంధ్ర కవి తరంగిణి'లో యిట్లు వ్రాసియున్నారు. 'కుమారగిరి సోదరికి మేనత్త పేరుంచిరని తలంచుట యొక విధముగా సమంజసముగుటను అనితల్లికి సవతితల్లి పుట్టింటి యాస్తి వచ్చినదని చెప్పుటకంటెఁ దల్లి యాస్తి వచ్చినదని చెప్పుటయే యుత్తమముగుటచేతను, కలువచేరు శాసనములోఁ గుమారరెడ్డి కాటయవేమునకు స్యాలకుడనియు నాతని భార్య దొడ్డాంబిక యనియు నామెయే తనకు తల్లియనియు స్పష్టముగాఁ జెప్పియుండుటచేతను, అనితల్లి జనని దొడ్డాంబయనియు నామె కుమారగిరిరెడ్డికి సోదరి యనియు నిశ్చయించుటయే సముచితము. అనితల్లి

కలువచేరు శాసనమున 'దొడ్డాంబిక' అని వ్రాయుట లేఖకుని పొరబాటనియు, శాసనములోఁ గాటయవేముని తల్లి 'దొడ్డాంబిక' యుండుటచేఁ బొరబాటున నా నామమే యనితల్లి తల్లికిఁగూడ నుపయోగించినాడనియు, నిజమట మల్లాంబికయని యుండవలయు ననియు నొకరనిరి. కాని తగినంత సాక్ష్యము లభింపనిదే, శాసనాక్షరములను మార్పు చేయరాదు' యని ఘంటాపథముగ 'దొడ్డాంబిక' కాటయవేముని భార్య, అనితల్లి తల్లి, కుమారగిరి సోదరి యని వక్కాణించియున్నారు.

ఈ పై కారణములవలన 'దొడ్డాంబిక' కుమారగిరి సోదరియుఁ గాటయవేముని భార్యయు, అనితల్లి జననియునై యున్నదనుట కెట్టి సంశయమునుఁ జెంద నవసరములేదు! అన్యమ, దొడ్డాంబికలు ఏక వ్యక్తులన్న వాదముకూడ నిరాధారమని పై వ్రాతల బట్టి తెలియనగుచున్నది.

ఇంతతోఁబోక శ్రీ అప్పారావుగారు మరొక వింత వాదన మొనర్చినారు! 'శాసనాధారములవలన తెలిసినంతవరకు కాటయవేముల అన్యమాంబల వివాహము పిన్నవయస్సులో జరిగినదే! కాటయవేమారెడ్డి కుమారుడగు కాటయ, హరిహరరాయల కూతురగు విజయలక్ష్మల వివాహము పిన్నవయస్సులో జరిగినదే! అనవోతారెడ్డి కుమారుడగు కుమారగిరిరెడ్డి వివాహము పిన్నవయస్సులో జరిగినదే! కాటయవేముని ఇంకొక కుమారుడగు కుమారగిరిరెడ్డి వివాహము (జరిగినట్లయితే) పిన్నవయస్సులో జరిగినదే! ఇన్ని వివాహములు పిన్నవయస్సులో జరిగినట్లు తెలియుచుండ ఒక్క 'దొడ్డాంబిక' 42 సంవత్సరముల వయస్సువరకు వివాహము చేసుకొనకుండుట ఏవిధముగను నమ్ముటకు వీలులేనిది. కాబట్టి అనితల్లి కలువచేరు శాసనములో చెప్పిన 'దొడ్డాంబిక' కాటయవేముని భార్యగాక తల్లియై యుండుననుట నిర్వివాదాంశము.'

శ్రీ అప్పారావుగారెంత అమాయకులో యీ వాదననుబట్టి యూహించుకొనవచ్చును! ఏ శాసనములోను యీ వివాహ ప్రశంసలు వధూవరుల వయఃపరిమితులతోను, వత్సరాది నిర్వచనములతోను నిర్దుష్టముగా, నిర్ద్వంద్వముగా నిర్వచింపబడియుండలేదు. అంతవరకు పోనక్కర లేదు. కాటయవేముడు అనవోతుకూతు రన్యమాంబ నేసంవత్సరములో నుద్వాహమాడెనో, అప్పటికి వారల వయఃపరిమాణము లేమియో యే శాసనములోను లభింపలేదు ఈ వివరములతోఁగల శాసన మొకటున్నదని శ్రీ అప్పారావుగారు చెప్పగలరా? పోనిండు. కాటయ, హరిహరరాయల కూతురు విజయలక్ష్మల వివాహ సంవత్సరమేదియో, ఆ సంవత్సరము నాటికి వధూవరుల వయఃపరిమితు లేమియో, అవ్వి యే శాసన మూలముగా మన మెరుంగవచ్చునో శ్రీ అప్పారావుగారు విశదీకరించగలరా? కాటయవేముని ఇంకొక కుమారుడగు కుమారగిరిరెడ్డి వివాహము జరిగినదో, లేదో తెలియని శ్రీ అప్పారావుగారు అతని వివాహము పిన్నవయస్సుననే జరిగియుండెనని నిశ్చయించుట కేమి యాధారముఁ జూపగలరు? ఇవి యన్నియు యూహల పైనను, శాసనములలోని విషయ సమన్వయముల పైనను ఆధారపడియుండ శ్రీ అప్పారావుగారీ వివాహ ప్రశంసలు వయఃపరిమితులతో, వత్సరాది నిర్ణయములతో శాసనములందు నిక్షిప్తములై యుండి యున్నట్లు పలుకబూనుట నిజముగా సాహసమని నెంచుకొనుము! రాజవంశములలో బాంధవ్యములు రాజకీయావసరముఁబట్టియు, సమయాసమయముల బట్టియు జరుగుచుండును. అందులకొక నిర్ణీత సూత్రావళిని బంధింపబడి యుండదు. ఒక రాజవంశమున పిన్నవయస్సులోనే వివాహములు ప్రవర్తించి యుండవలెనను నిబంధనగాని, దానికి భిన్నముగా ప్రవర్తించుట జరుగరాదను విధినిషేధములు గాని యుండవు అందువలననే రాజులలో బహుభార్యాత్వము నిషేధముగాదు వర్ణభేదము ఆటంకమును గాదు. వయఃపరిమితి పరిగణనలోనికి వచ్చునదిగాదు అట్టియెడ పిన్నవయస్సులో వివాహములు జరుగు సాంప్రదాయమున్న కుటుంబములో నా వయసు దాటిపోయి, బ్రహ్మచారిణిగా నొకామె యున్నదనిన ఆమె యా కుటుంబములోన జన్మించియే యుండలేదని సిద్ధాంతీకరించువారితో నేమనవలెను? అన్యమ వివాహకాలమునకు, దొడ్డమ వివాహకాలమునకు యున్న రాజకీయపరిస్థితుల సింహావలోకనము చేసినచో నీ సందియమునకు తావే యుండదు! ఈ పసలేని వాదన

కాస్కారమే యుండదు. ఈ విపరీత నిర్ణయమున కాధారమే యుండదు !

దొడ్డమ యుద్భవించునాటి కనవోతారెడ్డి రాజ్యపాలనము తుది ఘట్టమునకుఁ జేరుకొన్నది. ఆమె పుట్టిన నాల్గు సంవత్సరములకే అనవోతారెడ్డి మరణించినాడు. దొడ్డమ పినతండ్రి అనవేముడు రాజ్యభారము వహించినాడు. అప్పటికి కుమారగిరిరెడ్డి కా రాజ్యము సంక్రమించవలసియున్నది. కుమారగిరికిఁ గాటయవేముని బాసటయున్నది. ప్రజలు కూడ వారివి యెడ సమరక్తులై యుండిరనిగూడ మన మూహింపవచ్చును. అతడు పిన్నవయస్కుడగుట వలన శత్రురాజుల యౌద్ధత్యము నడంచు శక్తిమంతుడు సింహాసన మాక్రమింపవలయు కాల మదిగాన శౌర్యధనుడైన అనవేముని రాజుగా స్వీకరించుట జరిగినది. అనవేముడు తన కాలమును యెక్కువగా శత్రురాజనిబర్హణమునందును రాజ్య విస్తరణాదికమునందును, రాజ్యసుస్థిరతయందును వినియోగింపవలసిన యవసరము గల్గినది. ఆ కారణము చేత పిన్నవయస్కురాలైన 'దొడ్డాంబిక' వివాహభార మాతడు వహింపక, యుపేక్ష చేసియుండవచ్చును. అన్నమ వివాహ మనవోతుని కాలమునందే జరిగియున్నందున, అనవోతునిసంతాన వివాహ భార మనవేమునిపై బడలేదు. అనవేముని వెనుక సింహాసనాధిష్ఠితుడైన కుమారగిరి తన సోదరి 'దొడ్డాంబిక' వివాహభారము వహించినాడు. అప్పటికే దొడ్డాంబికకు కొంత వయఃపరిమితి మించినది: అన్నమ అకాలమరణమువలన కాటయవేమునితోఁ గుమారగిరిరెడ్డికిగల బాంధవ్యబంధము తెగిపోకుండ కుమారగిరి తన సోదరి 'దొడ్డాంబిక'ను కాటయవేమున కిచ్చి పరిణయము జరిపించియుండవచ్చును. పిన్నవయసులో వివాహములు జరుగు సాంప్రదాయమున్న కుటుంబములో తద్భిన్నముగా కొంచెము వయసు ముదిరిన జవ్వనిగా నిల్చినదిగాన 'దొడ్డాంబిక' యా కుటుంబములోనే జన్మించియుండలేదని సిద్ధాంతీకరింప బూనుట యెంత హేతుబద్ధమో విజ్ఞులకు తెలియనిది గాదు !

ఈ పై కారణములనుబట్టి దొడ్డాంబిక, అన్నమలు సోదరీలును భిన్నవ్యక్తులును అనియు కుమారగిరి తోడబుట్టువులనియు, కాటయవేముని భార్యలనియు, దొడ్డాంబిక అనితల్లి జనని యనియు స్పష్టపడుచున్నది. ఇందులకు భిన్నములగు నిర్ణయము లెంతమాత్రమును సమర్థనీయములు గావని మనవిచేయుచు నీ వ్యాసమును ముగించుచున్నాను.



# పిచ్చి...

శ్రీమతి ఆర్. వసుంధర

బరువుతో బుజాన్ని దిగలాగుతున్న పుస్తకాలసంచీని తీసి అలమార్లో పెట్టాడు వెంకట్రమణ. వెనక దొడ్లో నాలుగు రోజులనాడు పుట్టిన తువ్వాయి గంతులేస్తూ కన్పించింది. పెద్దనల్లటి కళ్లతో తెల్లగా ముద్దుగావున్న తువ్వాయిని చూడగానే వుత్సాహంగా లోపలికి వెళ్లబోయాడు. వంట గదిలో నుండి మాటలు వినవచ్చాయి. సుందరమ్మమ్మతో పాప మ్మత్త మాట్లాడుతున్నది. రెండు మాటలు చెవిని పడగానే ముందుకు వెళ్లబోతున్న వాడు కాస్త ఆగి గోడ దగ్గరకు వెళ్లాడు.

'ఇప్పుడు కాస్త నయంగానే వున్నట్లుంది' పిల్లాడు బాగున్నాడా అనడిగింది. కాసేపు బాగానే మాట్లాడింది. తరువాత 'నా నగలు పోయాయి' అంటూ ఏడిచింది. మామూలేగా...అయినా ఆ తిట్లూ అవీ లేవులే యిప్పుడు...పిల్లాణ్ణి చూపిస్తే కాస్త మనుషుల్లో పడుతుందేమో... పాపమ్మత్త అంటోంది.

'ఏమి నయమో! పదేళ్లనాటి పిచ్చి యిప్పుడు ఒదుల్తుందన్న ఆశ నాకు లేదు పాపమ్మా...ఏం పాపం చేసుకున్నామోగాని శుభమా అంటూ వున్న ఒక్కడికీ పెళ్లిచేస్తే కర్మకొద్దీ ఆ రాక్షసి ముండ దొరికింది. ఎట్లాగో దానిపీడ ఒదిలిపోయిందనుకో. ఈ దమ యంతిని తెచ్చిచేస్తే దీని సంగతి యిట్లా అయి పోయింది. ఇదంతా కర్మకాకపోతే ఏమిటంటావు! బాలెంతలకి పథ్యమూ పాడూ కుదరక పైత్యంచేస్తే మాత్రం తిరుగులేని పిచ్చిపట్టి పోవాలని వుందా... అన్నది సుందరమ్మమ్మ.

'అయిపోయిన దానికి ఏం చేస్తాం కాని యిప్పటి మాటా ఆలోచించు...పిల్లాణ్ణిచూపిస్తే కాస్త గుణ మిస్తుందేమో. అది బాగుపడి యింటికొచ్చే వుపాయం చూడాలిగాని రెండు పెళ్లిళ్లు యిట్లా కుమ్మరాం లయిపోయినాక మూడో పెళ్లి చెయ్యలేవు గదా. యిప్ప టికి అంతా బాగానే జరిగిపోతూ వుందనుకో. ఎప్పటి కెట్లా వుంటుందో. ఒక్కదానివీ ఎన్నాళ్లని తిప్పలు పడతావూ?...' పాపమ్మత్త వాదిస్తోంది.

వెంకట్రమణ యిహ వినటం మానేసి తిరిగి ముందు హాల్లోకివెళ్లి కుర్చీలో కూర్చున్నాడు. అవా లోచితంగా చిన్నబల్లమీదున్న పెన్నుని రెండువేళ్లతో గిరగిరా తిప్పటం ప్రారంభించాడు. గుండ్రంగా ఆకర్ష ణీయంగావున్న మొహమ్మీదికి పడుతోంది చిందర వందరగా రేగిన జుట్టు. విశాలమైన నల్లటి కళ్లు నిరాసక్తంగా పెన్నును చూస్తున్నాయి. ఇట్లాంటి పనుల్నే 'చేతులూరుకోని నాశనప్పనులు' అంటుంది సుందరమ్మమ్మ.

కాస్సేపున్నాక పాపమ్మని పంపించటానికి ముందుగదిలోకి వచ్చింది సుందరమ్మ, రమణని చూసి 'ఎప్పుడొచ్చావురా. పిలవక పొయ్యావా...వుండు, పాలు పిండి కాచితెస్తాను...ఆ పెన్నెందుకురా అట్లా తిప్పు తావూ. కిందపడితే పాడవదూ' అంటూ వుండగానే పెన్ను గచ్చుమీద పడింది. రమణ దాన్నితీసి యథా స్థానంలో పెట్టాడు. 'చెబుతావుండుగానే పడేస్తివి గదరా...ఒక్క నాశనపు పనులు మీనాన్నొస్తే చావ గొడతాడు...ఆ పుస్తకాలుతీసి చదవనన్నా చదువు' అంటూ పెన్ను తీసుకొని లోపలికి వెళ్లిందామె.

వెంకట్రమణ కాళ్ళు చిన్న బల్లమీదపెట్టి వూపుకుంటూ కూర్చున్నాడు. సుందరమ్మ వూరికే అట్లా అంటుందిగాని తండ్రి రామయ్య తనను నావ గొట్టడని రమణకి తెలుసు. అంతేగాకుండా యివాళ

చదవ బుద్ధివెయ్యటంలేదు. బడినుంచీ రాగానే మళ్లీ చదువేమిటి?

'మెడ్రాసు పిచ్చాసుపత్రికి నన్ను తీసుకుపోయి చూపిస్తారా! పిచ్చాసుపత్రినిండా పిచ్చాళ్లుంటారు కాబోలు' అనుకున్నాడు వెంకటరమణ. వాడికి వెళ్లాలనిగాని వెళ్లకూడదనిగాని ఏ అభిప్రాయమూ లేదు. ఆవిడ—అమ్మ—ఆమనిషి ఎట్లావుంటుందో, జుట్టంతా జడలుకట్టిపోయి చింపిరిగుడ్డలు వేసుకొని వుంటుందేమో అనుకున్నడు రమణికి భయమూ అసహ్యమూ కలిగాయి. 'ఎవరో ఆ పిచ్చిది! నాకేమి సంబంధం! నే నెప్పుడూ చూడనుకూడా లేదు' అనుకున్నాడు.

బళ్లో చేరిన కొత్తల్లో పాపమ్మత్త కొడుకు నారాయుడు క్లాసుపిల్లల్తో 'వీళ్లమ్మ పిచ్చిది' అని చెప్పాడు. పిల్లలందరూ నవ్వారు. రమణకి చాలా నామోషీ అనిపించింది. 'కాదు...' అని అరిచాడు కోపంగా. 'వీా అమ్మ మెడ్రాసు పిచ్చాసుపత్రిలోవుంది' అన్నాడు వాడు. 'మా అమ్మ సుందరమ్మమ్మ, పిచ్చిది కాదు' అంటూ వాణ్ణి చెంపమీద యీడ్చికొట్టాడు. వాడికి నోట్లోంచీ రక్తం కారింది. వాడు రక్తం తుడుచుకొంటూ ఏడుస్తూనే 'సుందరమ్మ మీ అవ్వలే, లేకపోతే అమ్మా అనకుండా సుందరమ్మమ్మా అంటావెందుకు? మా అమ్మతో చెప్తానుండు' అంటూ వెళ్లిపోయాడు. తరువాత సంగతి విని సుందరమ్మమ్మ రమణని ఎత్తుకొని ముద్దాడి 'వాడి మొహం. ఆ నారాయుడి కేమీ తెలీదులే' అన్నది. అప్పటినుండి పిచ్చివాళ్లమీద రమణకి ద్వేషం కలిగింది. ఒకనాడు బడినుంచీ వస్తూ చెట్టుక్రిందవుండే పిచ్చిదానిమీద రాయివేశాడు కూడా... ఇదంతా ఒకటోక్లాసులో వున్నప్పటి సంగతి. ఇప్పుడు తనతల్లి పిచ్చాసుపత్రిలో వున్నదని రమణకి తెలుసు. ఆవిణ్ణి ఎప్పుడూ చూడలేదు. ఆవిణ్ణి గురించిన ఆలోచనలుకూడా రావు. ఇవాళ పాపమ్మత్త మాటలు విన్నాక '—ఎట్లా వుంటుందో' అనుకున్నాడు. ఆవిణ్ణి 'అమ్మ' అని ఎప్పుడూ అనుకోడు రమణ. 'ఆ మనిషి' అనుకోడానికి వీల్లేకుండా వుంది. ఎప్పుడైనా ఆవిణ్ణి గురించి అనుకున్నప్పుడు ఆ స్థానం ఖాళీగా వదిలేస్తాడు.

'ఆవిడ'ంటే సదభిప్రాయం మాత్రం లేదు రమణకి. వుంటే కొంచెం కోపం, జుగుప్స వుండాలి.

ఒకసారి 'ఆవిడ'నాన్న—సుబ్బయ్య తాత—వచ్చాడు. మెడ్రాసువెళ్లి వచ్చాడట. సన్నగా ముసలిగా వంగిపోయి వున్నాడు. జుట్టు సగం నలుపూ సగం తెలుపూగా దారాల్లా వున్నది. మాటకిముందు పళ్లు చూపిస్తాడు. కోతి యికిలించినట్లుగా. అట్లా యికిలిస్తే ఎదుటి వాళ్లు సంతోషిస్తారనుకుంటాడేమో. అడుక్కునే వాడిలాగా వున్నాడు. ఆ మాట చెప్పడానికి వచ్చినవాడు మధ్యాహ్నం అన్నం తిని సాయంత్రం కాఫీత్రాగి రాత్రి అన్నంతిని మరీ వెళ్లాడు. తండ్రి రామయ్య అతనితో అసలు మాట్లాడలేదు. సుందరమ్మమ్మ మర్యాదకి కాసేపు వూకొట్టి వెళ్లిపోయింది. వూరికే కూర్చుండి ఏమీ తోచక రమణని పలకరించాడు. 'పిప్పరమెంటు బిళ్లలు కొనుక్కొని తింటావా?' అన్నాడు. రమణకు అర్థం కాలేదు. 'రెండు పైసలిస్తాను, కొనుక్కుంటావా' అనో 'వీళ్లు నీకు అట్లాంటివి కొనిస్తారా' అనో 'వుంటే నాకూ రెండుపెట్టు' అనో ఏమిటో తెలియలేదు. ఆపలకరింపు అసహ్యంకలిగించి సమాధానం చెప్పకుండా లేచి వెళ్లిపోయాడు. ఈ సుబ్బయ్య తాత పెళ్లాం—'ఆవిడ'తల్లి కాదు; రెండో పెళ్లాం—వూరందరికీ తెలుసు. 'నల్లచ్చమ్మ' అంటారు. బడికి వెళ్తుంటే ఎప్పుడన్నా కనబడుతుంది. బొగ్గు నలుపులో సన్నగా ఎండుకుపోయి వుంటుంది. జుట్టు నల్లగా మెరుస్తూ వుంటుంది. దాన్ని నిమ్మకాయ ప్రమాణంలో తమాషా ముడివేస్తుంది. ఎప్పుడు చూసినా రోడ్డుమధ్యన నిలబడి వూరంతటికీ వినబడేట్లు ఎవరితోనైనా యుద్ధం చేస్తూ వుంటుంది. మధ్యలో జుట్టుముడివూడదీసి విదిలించి మళ్లీ గట్టిగా నిమ్మకాయఆకారంలో వేస్తూ అరుస్తూ వుంటుంది. బడిపిల్లలందరితోపాటు రమణకూడా 'నల్లచ్చమ్మ' అని చెప్పి నవ్వుతాడు. తాను పిచ్చిదవటమే కాకుండా యిట్లాంటి యింటికి చెందివుండటం కూడా 'ఆవిడ'గురించిన రమణ అసంతృప్తికి కారణమైంది. వాళ్లంతా ఒక పిచ్చి పాడు గుంపు! అనుకున్నాడు.

ఎవరైనా వూళ్ళోవాళ్ళు మెద్రాసు వెళ్లినప్పుడు చదివిన కాలేజి, జూ, లైట్ హౌస్, యల్ఐసీ బిల్డింగులతో పాటుగా పిచ్చాసుపత్రిలో 'దమయంతి'ని కూడా చూసివస్తారు. అప్పటి సంభాషణల్లో రమణకు కొన్ని కొన్ని విషయాలు వినబడలై. తన తండ్రికి మొదటి భార్య పురిపోసుకు చచ్చిందట. అప్పుడు యీమెనిచ్చి చేశారట. నల్లచ్చమ్మదగ్గర తిట్లూ దెబ్బలూ తింటూ గొడ్డు చాకిరీ చేసేదట. 'కొంప ఎట్లాంటిదై తేనేం? తామర పువ్వు బురదలో పుట్టదా? పిల్ల పనీ చేస్తుంది. అణకువా వున్నది' అని సుందరమ్మమ్మ ఆలోచించి యీ పెళ్లిచేసిందట. మొదట్లో చెప్పినపని చేసుకుపోతూ తిరుగు చెప్పకుండా బాగానే వుండేదట. పిల్లాడు పుట్టవిచ్చి బుద్ధి మారిపోయిందట. 'కాన్పుకు తీసుకువెళ్లినవాళ్లు బాలెంతకు అపథ్యం చేసి, పైత్యం ఎక్కిపోయింది' అన్నది సుందరమ్మమ్మ.

'నెలదాటకుండానే తీసుకొచ్చాము, అప్పటికే పైత్యం ఎక్కుతూవుంది గావాలు, నాకేం తెలుసు! పిల్లాణ్ణి దించకుండా ఎప్పుడూ కోతికరుచుకున్నట్టు కరుచుకొని వుండేది. పత్యం సరిగా చెయ్యకుండా ఆదీయిదీ తినేవాళ్ళు పాలిస్తే పిల్లాడు ఎక్కిరాడు, అవుపాలు పోద్దాంలే అన్నాను. అంతలోనే పిల్లాడికి విరేచనాలు రావొచ్చినై. ఇక యిది మాటవినదూ అని అలవాటు తప్పించటానికి పిల్లాణ్ణి రెండు రోజులు కిష్టాయి యింటికి పంపించేశాను. అప్పటికే పైత్యం ఎక్కింది, రెండురోజులపాటు మునగదీసుకు పడుకుంది. ఒకటేఏడుపు, ఒక్కపనీ ముట్టుకోలేదు. తిండీ తినలేదు. పోనీలే అని వూరుకున్నాను. తిండిలేక పైత్యం మరీ ఎక్కువైపోయింది. మూడోనాడులేచి 'నాపిల్లలందర్నీ నువ్వే చంపేశావు దొంగముండా' అంటూ నన్ను గట్టిగావట్టేసింది. నలుగురూపొగై పట్టువిడిపించి దాన్ని తాళ్లతో కట్టేసేసరికి తల ప్రాణం తోకకొచ్చింది. అప్పుడే ఒంటిమీద నగలుకూడా తీసేశారు. ఆ, ఏంనగలులే...బొట్టుగొలుసూ, రెండు గాజులూను. అంతే, పిల్లల సంగతి ఒదిలేసి నగలో అని పట్టుకుంది. ఒక్కతిట్టుకాదులే. నానాతిట్లూ మొదలెట్టింది...అంత అణకువగావుండేది. యిట్లా తిరిగిపోయిందంటే...ఆ పిచ్చి పిచ్చి యిహ అంతే అయిపోయింది. మంత్రాలూ నాటుమందులూ అన్నీమాసి యిహ లాభంలేదని మెద్రాసులో వేశాము...' ఒకసారి మూడోకాల్లను టీచరమ్మతో యీ కథంతా చెప్పింది సుందరమ్మమ్మ.

'పాలు యివ్వనీయలేదనే యింత గొడవా జరిగిందా? పోనీ పిల్లణ్ణి వెనక్కితెచ్చి చూపారా?' టీచరమ్మ అడిగింది.

'అయ్యో రాత! పిల్లాణ్ణి గొంతుపిసికేస్తే ఏంగాను! వెలబిక్కాయెను' అన్నది సుందరమ్మమ్మ.

'అవున్లెండి. అదీ నిజమే' అన్నది టీచరమ్మ.

తనని గురించి వాళ్ళు యిలా మాట్లాడుకోవడం రమణకు నచ్చలేదు. 'నాన్న పొలం వెళ్లాలని నిన్ను తొందరగా రమ్మన్నాడుగా సుందరమ్మమ్మా' అన్నాడు.

'ఇదిగో వెళ్తున్నా' అంటూనే 'ఈకాలంలో పిల్లలికి పాలు ఎవరిస్తున్నారమ్మా, మరీ లేనివాళ్ళు తప్ప అందం పోతుంది, ఆరోగ్యం పోతుందిఅంటూ అందరూ డబ్బాపాలే పోస్తున్నారుగా. పిచ్చికాకపోతే దానికోసం ఎవరన్నా ఏడుస్తారా! పిల్లాడు తాగటం లేదుకదా, పాలు గోడమీదికి పిండేసియ్యవే అన్నాను. అదేమి ఏడుపోగాని ఒకటే కుమిలి కుమిలి ఏడవటం! అందరూ సినిమాలుచూసి చేస్తుకుంటున్నారమ్మా యీ ఏడుపులూ నవ్వులూ డాన్సులూ పాటలూను. అదే సర్దుకుంటుందిలే అనుకున్నాను. అంతలోనే పైత్యం ముంచుకొచ్చింది...' ఏమిటేమిటో చెప్పుకొచ్చింది సుందరమ్మమ్మ.

సాధారణంగా యీ విషయాలన్నీ తనముందు మాట్లాడదు ఆమె. ఇవన్నీ అప్పుడప్పుడుగా రమణ విన్న విషయాలు. అర్థంకాకపోయినా మనసు అనే స్టోరుగదిలో నిలిచిపోయిన విషయాలు..............

ఎగ్జిబిషన్‌చూసి, మర్నాడు పిచ్చాసుపత్రికి వెళ్లారు సుందరమ్మ రామయ్య రమణా. మెద్రాసు ప్రయాణం మొదలుపెట్టిన దగ్గర్నుండి రమణ

ఆలోచనలు వుండుండి ఆవిడమీదికే వెళ్ళేవి. ఇన్నాళ్ళా పిచ్చిదిగా సంబంధంలేని మనిషిగావున్న ఆవిడ ఆలోచనల్లో దగ్గరికివచ్చి ఏదో అస్పష్టమైన సంబంధం వెలికి రాసాగింది. చెట్టుకింద పిచ్చిది జ్ఞాపకంవచ్చి భయం కలిగింది. ఆత్రుతలో 'అట్లా వుండకూడదు' అనుకున్నాడు.

దమయంతి శుభ్రంగానే వున్నది. తల దువ్వుకొన్నది. చీరమాసినా చిరుగులు లేవు. సుందరమ్మమ్మని చూడగానే కోపంగా 'ఒచ్చావా...నా నగలన్నీ తెచ్చావా లేదా పిశాచీ' అన్నది.

రమణ సుందరమ్మమ్మ వెనకాతల నిల్చుని ఆసక్తితో చూస్తున్నాడు. దమయంతి రమణనిచూసింది. నుదురు చిట్లించి ఆలోచిస్తూ 'ఈ పిల్లాడెవరూ' అన్నది. ఎవరూ మాట్లాడలేదు. 'ఇట్లారా అబ్బాయ్' అన్నది. రమణ వెళ్ళకుండా చెయ్యి పట్టుకు ఆపింది సుందరమ్మమ్మ. 'నీ పేరు వెంకటరమణ కాదూ! పాపమ్మ చెప్పిందిలే. నీవు నా కొడుకువేరా... ఒరే, పిలిస్తే రావూ! నేను నీ అమ్మనిరా...ఒరే ఒక్క మాట చెబుతా, గుర్తుపెట్టుకో. లోకం నిండా ఆడవాళ్ళున్నా, ఎవరుపెంచినా, ఎట్లా చూసినా నేనేరా నీ అమ్మని! నిజంగా నీవు నా కడుపులోనే పెరిగావురా. అప్పుడు నా కడుపుమీద చెయ్యిపెట్టుకు చూసుకుంటే కడుపులో నీవుచేసిన గోలంతా ఆ చేతికి తెలిసిందిరా. కడుపుని చూస్తుంటే నీవు యీ ప్రక్కనించీ ఆ ప్రక్కకి తిరగటం కనుపించిందిరా...నిజంగా...సత్యప్రమాణంగా! ...అందుకే నేను చెప్పేది ఏమంటే నీవు మీ అమ్మ ఋణం తీర్చుకోవాలి. ఆ పిశాచి దగ్గర నా నగలున్నై ఎప్పటికైనా తెచ్చియివ్వాలి. తెలిసిందా...' ఆత్రుతగా అన్నది. ఆశగా చూసింది.

ఆమాటలు వింటుంటే రమణకి భయం వేసింది. భయంలోనే మనసు 'అమ్మ' అన్న పదం పలికింది. సుందరమ్మమ్మ యిహ పోదాం అని తొందర పెట్టింది. వస్తూవుంటే వెనకనుంచి దమయంతి అరుస్తూవేవున్నది 'నా నగలన్నీ తెచ్చివ్వాలిరా... నేనేరా నీ అమ్మని' అంటూ'

బయటికొచ్చాక రమణ మెల్లగా అడిగాడు 'సుందరమ్మమ్మా, అమ్మకి పిచ్చి నయమౌతుందా?' అని.

సుందరమ్మ వినగానే కోపంగా 'అమ్మనవ్రా, నాబొంద! ఆ పాపమ్మ మాటలునమ్మి తీసుకొచ్చాను గాని దీనికి పిచ్చి తగ్గేదికాదు. ఆ వరసన పిచ్చికేకలు పెడుతుంటే యింకేం తగ్గుతుంది!...హవ్వ! చిన్న పిల్లాడి ముందర ఏం మాటలు!' అన్నది.

'ఆనగలు యీ సుందరమ్మమ్మ యివ్వనే యివ్వదు...పాపం!' అనుకున్నాడు రమణ.

---



# డా. పి. వి. రాజమన్నారు

## శ్రీ డి. రామలింగం

కళాశీలి అన్న పేరుపొంది, కొంతకాలం పత్రికా సంపాదకుడుగా తెలుగు సాహిత్యానికీ లలితకళలకూ దోహదముచేసి, రచయితగా సాంఘిక నాటకాలకు చక్కని ప్రాతిపదికవేసి, ఆంధ్రాంగ్లభాషలలో కవిత్వము వ్రాసి కవి అని కూడా సాహితీపరుల మెప్పు పొంది, కథలు వ్రాసి చెప్పుకోదగ్గ కథకుడు అని కూడా ఖ్యాతి తెచ్చుకొని, న్యాయవాదవృత్తిలో పేరు ప్రఖ్యాతులు పొంది, మద్రాసు హైకోర్టుకు ప్రప్రథమ భారతీయప్రధానన్యాయమూర్తిగా నియమితులై ఆ పదవిలో ప్రతిభాశాలి అన్న యశస్సు నార్జించి, అనేక ఉన్నత పదవు లధిష్ఠించి వాటికి గౌరవము, ఆకర్షణ, మన్నన ఆపాదింపజేసి, గౌరవాలూ, పదవులూ, కీర్తిప్రతిష్ఠలూ తనను వెతుక్కుంటూ వచ్చేటంత అసమాన, అద్వితీయ వ్యక్తిత్వాన్ని సంపాదించుకొని, సంగీతంలోనూ, సాహిత్యంలోనూ, నాట్యశాస్త్రంలోనూ, శిల్పంలోనూ, చిత్రకళలోనూ సమానమైన ఉత్కృష్ట సంస్కారము, సౌజన్యము, సౌహార్ద్రతగల వ్యక్తి ఈ తరంలో ఈయన ఒక్కరే అని లలితకళల ద్రష్టలచే, కళాభిమానులచే ప్రశంస లందుకున్న డా. పాకాల వెంకట రాజమన్నారు ఆంధ్రులు గర్వించదగిన మనిషి. ఈయనవల్ల భారతదేశంలో ఆంధ్రప్రజలకు కలిగిన పేరుప్రతిష్ఠలు అనన్యమైనవి. అమూల్యమైనవి. ఆంధ్రులు సగర్వంగా చెప్పుకోదగ్గ వ్యక్తులలో ఈ ఇరవయ్యో శతాబ్దిలో ఈయన ప్రముఖంగా కన్పిస్తారు, ప్రత్యేకంగా కొన్ని రంగాలలో.

శ్రీ రాజమన్నార్ తొలి తెలుగు కావ్యం వెలువడ స్థలమూ, గోదావరితీరంలోవున్న పవిత్ర పుణ్యస్థానమూ అయిన రాజమహేంద్రవరంలో 1901 మే నెల 10 వ తేదీన జన్మించారు. వీరి తండ్రిగారు శ్రీ పాకాల వెంకటరమణరావుగారు మొదట మద్రాసు హైకోర్టులో జడ్జీగా కొంతకాలం పనిచేసి ఆ తర్వాత మైసూరు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తియై పదవీ విరమణ చేసినట్టి వారు. చిన్నప్పటినుంచీ రాజమన్నారుగారికి సాహిత్యం, సంగీతం అంటే అభిరుచి. వీరి నాయనమ్మగారు పండితురాలు. వీరికి 5 వ యేట అక్షరాభ్యాసం చేశారు. పలకా బలపంతో వీధిబడికి వెళ్ళారు. బడి నచ్చలేదు. పంతులుగారు పరధ్యాన్నంగా వున్నప్పుడు ఇంటికి పరుగెత్తి వచ్చేసేవారు. వీరి నాయనమ్మ భారత, భాగవత, రామాయణాదుల కథలు చెప్పేది. పది పన్నెండేండ్లకే దాశరథీ శతకం మొదలైనవి కంఠతా వచ్చాయి. ఆరవ ఫారంలో ప్రవేశించేటప్పటికి వీరికి 13 ఏండ్లు కూడా నిండలేదు. యస్. యస్. యల్. సి. పరీక్షకు 15 ఏండ్లు నిండితేగాని వీలులేదు. అందుచేత మూడేండ్లు ఆరవఫారం క్లాసులోనే వ్యర్థంగా గడిపారు. స్కూలులో చదువుకునేటప్పుడే శతకాలు గురించి వ్యాసంవ్రాసి బహుమతి పొందారు. ప్రతి క్లాసులో ఏదో బహుమతివస్తూ వుండేది. తెలుగు పండితులవద్ద రఘువంశం, మేఘదూతము ఇత్యాది సంస్కృత కావ్యాలు పఠించారు. రససిద్ధాంతాలు నేర్చుకున్నారు. పద్యాలు వ్రాసేవారు. వీరి పద్యాలు, గీతాలు, కథలు పత్రికలలో ప్రచురింపబడుతూవుంటే ప్రోత్సాహము, ఉత్సాహమూ కలిగి 'వాసంతి' అనే లిఖిత పత్రికకు ఆధిపత్యం వహించారు. ఇంగ్లీషులో తాము వ్రాసిన చిన్న చిన్న కవితలను డా. కజిన్సుకు చూపారు, వారు మాతృభాషలోనే వ్రాయమని సలహా ఇచ్చారు. వీరు రచించిన ఒక ఆంగ్లకావ్య ఖండిక ఇంగ్లండునుంచి వెలువడే Book Man లో ప్రచురింపబడింది 'సుధాకరుడు' అనే పేరులో కృష్ణాపత్రికలో, ఆంధ్రపత్రికలో కవితలు వెలయించారు. సంగీతంపై వీరికిగల అభిలాషకు వీరి మేనమామ దోహదం చేశారు. మద్రాసులోని పచ్చయప్ప హైస్కూలులో యస్. యస్. యల్. సి.

చదివారు. విద్యార్థి దశలో ఉన్నంతకాలమూ మెరిట్ స్కాలర్‌షిప్పులు సంపాదించి చదివారు. ప్రతి తరగతిలో ఏవో బహుమతులు వచ్చేవి. మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో చదివి బి. ఏ. పరీక్షలో ఆంగ్లభాష, తత్త్వశాస్త్రములలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై మద్రాసు ప్రెసిడెన్సీ మొత్తంలో ప్రథములుగా వచ్చారు. కార్డ్యూ, మిల్లర్ ప్రైజులు పొందారు. మొత్తం తొమ్మిది బంగారు పతకాలు గెలుచుకున్నారు. బైబిల్ సబ్జెక్టులో వరుసగా నాలుగేళ్ళా ఫస్టు వచ్చి బంగారుమెడలు పొందారు. కాబట్టే వీరికిగల బైబిలు పరిజ్ఞానం అసాధారణమైనది. ఆ తరువాత మద్రాసు లాకాలేజీలో చేరి జూరిస్ ప్రూడెన్సులో ఫస్టువచ్చి ప్రైజు సంపాదించారు. తెలంగాణాను మేల్కొల్పిన వైతాళికులలో ఒకరైన శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు లాకాలేజీలో వీరికి సహపాఠి.

## పత్రికా సంపాదకత్వం

1922లో మద్రాసు లాకాలేజీలో చదువుతూ వుండగానే 'కళ' అనే తెలుగు మాసపత్రికకు సంపాదకులై సాహిత్యానికీ లలితకళలకూ విద్యావంతులలో మంచి అభిరుచి కలిగించాలనే ఉద్దేశంతో ఆ పత్రికను చేతితోచేసిన కాగితంతో, కార్డుబోర్డు పైని ఆర్టుప్లేట్లతో సర్వాంగసుందరంగా ప్రచురింప నారంభించారు. కాలినడకను వెళ్లి పండితులను, కవులను, కథకులను కలుసుకొని పత్రికకు రచనలు ఆర్జించేవారు. స్వయంగా కెమెరాతో ఫోటోలు తీసి పత్రికలో అచ్చువేసేవారు. సాహిత్యం, లలితకళలకు అంకితమైన ఈ పత్రిక సంవత్సర చందా నాలుగు రూపాయలు! అప్పుడు వారి వయస్సు 20 సంవత్సరాలు. తమ పత్రికలో మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి, దువ్వూరి రామిరెడ్డి, బసవరాజు అప్పారావు, భమిడిపాటి కామేశ్వరరావు, శివశంకరశాస్త్రి వంటి ప్రముఖులచేత రచనలు చేయించి ప్రచురించేవారు. 'హృదయేశ్వరి' కావ్యంపై రాజమన్నారుగారే ఆ పత్రికలో సమీక్ష వ్రాశారు. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు మునగాల సంస్థానానికి దివాన్‌గావుంటూ మద్రాసువచ్చి 'వేదవిలాస్'లో బసచేస్తే వీరు వారిని దర్శించి 'లలిత కళలు' గూర్చి వారిచేత వ్యాసం వ్రాయించి పత్రికలో ప్రచురించారు. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు దువ్వూరి రామిరెడ్డిగారినిగూర్చి రాజమన్నార్‌గారితో, వీరినిగూర్చి దువ్వూరితో చెప్పారుట. అప్పటినుంచి దువ్వూరి వీరికి ప్రియమిత్రుడైనాడు. దువ్వూరి ఖండకావ్యాలు అనేకం 'కళ'లోనే తొలుత ప్రచురితమైనవి. దువ్వూరి మద్రాసు వచ్చినప్పుడు వీరి ఇంట్లోనే బసచేసేవాడు. ఇద్దరూ భోజనానికి కూర్చుంటే వీరి తల్లిగారు వడ్డించేదట. వీరిపైగల ప్రేమాభిమానాలతో దువ్వూరి రామిరెడ్డిగారు ఈ క్రింది పద్యం వ్రాశారు.

దారిని బోవుచుండ నొక తట్టున
  రత్నమయాచితంబు చే
కూరిన రీతి నా యెడదకున్ సరిదాకిన
  మిత్రుడున్, మనోహారి
కళాతపస్వి, సరసాత్ముడు
  మోమున ప్రేమ మాధురీ
సారము చిప్పిలం బరుల స్వాంతము
  లాగెడి యింద్రజాలికుండై
రమణీయభావ కవితాంచితుడై
  వెలువారు రాజమన్నారు
సఖుండుగా దొరకె నాకు
  దదాప్తత కానవాలుగన్
కోరి యొసంగితిన్ గృతిని గూరిమి
  నెచ్చెలి కంకితంబుగన్

అంటూ 'కడపటి వీడ్కోలు' అనే కావ్యం వీరికి అంకిత మిచ్చారు. ఇట్టి సన్నిహిత మైత్రి వల్లనే, పరస్పర అవగాహనవల్లనే రాజమన్నారు దువ్వూరి రచనా ప్రతిభను శ్లాఘిస్తూ 'ఆంధ్రభాష ప్రపంచంలో ఉన్నంతవరకు రామిరెడ్డిగారికి మృతి లేదు' అని ఒక లేఖలో వ్రాశారు. ఈ మాట అక్షరాలా యథార్థమని రెడ్డిగారి 'పానశాల' కావ్యం రుజువుచేసింది. చేస్తూవున్నది. మునుముందు చేయగలదు.

ఏలూరు నాటక సమాజంవారు మద్రాసులో

నాటకాలు ప్రదర్శిస్తే రాజమన్నారు ప్రముఖపండితులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచేత ఆ నాటక ప్రదర్శనాలనుగూర్చి విమర్శకవ్యాసాలు వ్రాయించి 'కళ'లో ప్రచురించారు. ఇటువంటి కొత్తరకపు నాటకప్రదర్శన విమర్శకులకు ఆ మాసపత్రిక దారి చూపింది. భమిడిపాటి కామేశ్వరరావు, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారికి వచ్చిన కొందరు రచయితలు. ప్రసిద్ధ ఆంధ్ర చిత్రకారుడు శ్రీ దామెర్ల రామారావు రచించిన 'అర్జునుడు–ఊర్వశి' చిత్రాన్ని ప్రత్యేక వర్ణంలో బ్లాకు చేయించి 'కళ' అట్టమీద ముద్రించారు. అలా ముద్రించడం తెలుగు పత్రికలలో అదే మొదటిసారు. రాజమన్నార్ రచించిన కొన్ని కథలు 'కళ'లో ప్రచురితమైనవి. అవి అన్నీ కలిపి ఒక కథల సంపుటిగావస్తే బాగుండేది. 'డిన్నర్‌కోటు', 'తీర్పు'వంటి ఇతర కథలు ఇతర పత్రికలలో ప్రచురితమైనవి. ఒక జడ్జిమాత్రమే 'తీర్పు'వంటి కథ వ్రాయగలడు.

## నాటకకర్త

ఆధునిక తెలుగు సాహిత్యంలో రాజమన్నారుగారి స్థానమేమిటన్న ప్రశ్న ఉదయిస్తే ముఖ్యంగా ఆయన నాటకకర్త అని చెప్పాలి. బాల్యంనుంచీ వీరికి నాటకాలంటే ఆసక్తి వుండేది. చిన్నతనంలో ఇంగ్లీషులో ఒక నాటిక రచించి తోటిపిల్లలచేత ప్రదర్శింపజేశారు. ఆ ప్రదర్శనకు చీరెలను తెరలుగా వాడారట. మొదటినుంచీ ఏకాంకికలపై ఆసక్తి ఎక్కువ పధ్నాలుగవ సంవత్సరం వయస్సునుంచే నాటికలు వ్రాయాలని ఆకాంక్ష. జడ్జి పదవిని స్వీకరించిందికూడా ఏకాంకలు వ్రాయడానికే. మొత్తం 25 నాటికలవరకు వ్రాశారు. 'దయ్యాల లంక' అనే వీరి నాటికను గూడవల్లి రామబ్రహ్మంగారు మద్రాసులో తాను ప్రొడ్యూసర్‌గావుండి ప్రదర్శింపజేశారు. ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రము ప్రసారం చేసిన మొట్టమొదటి సాంఘిక నాటకం వీరి 'దయ్యాల లంక'. అప్పటికి శ్రీ రాజమన్నారు వృద్ధిలోకి వస్తూన్న యువవకీలు మాత్రమే. అయితే అప్పటికే నాటకరంగంలో సాహిత్యలోకంలో మంచిపేరు సంపాదించుకున్నారు. ఈ నాటిక ప్రసారమైనప్పుడు అది సాహితీపరులను విశేషంగా ఆకర్షించిందని దానికి ప్రయోక్తయై నిర్వహించిన శ్రీ ఆచంట జానకిరామ్ తమ పుస్తకం 'సాగుతున్న యాత్ర' రెండవభాగంలో వ్రాశారు. గోదావరిలంక దయ్యాల లంక కాని ఈ పేరుకు విశాలమైన అర్థమున్నది రచయిత దృష్టిలో—ఈ నాటికలో బాలవితంతువు సుధ 'వూరిలో అందరూ దయ్యాలు. ఈ దెయ్యాల లంకే నాకు ఆనందంగా వుంది' అని అంటుంది. మంచిచెడ్డలనుగూర్చి విచారించక, మూఢవిశ్వాసాలకు లోనైన సంఘమే నిజమైన దయ్యాలలంక అని వీరి ఈ నాటిక ఉద్ఘాటించింది. రాజమన్నారుగారి నాటికలలో రసికులనూ, సహృదయులనూ మిక్కిలిగా ఆకర్షించింది 'పరకీయ'అన్న నాటిక. చాలా ఏండ్లక్రితం 'భారతి'లో ప్రచురితంగా నేను ఈ నాటిక చదివాను. కాని ఈనాటికీ దానిలోని కథ, ఆ పాత్రలు ఎందుకో నాకు జ్ఞాపకం వస్తుంటాయి. ఉన్నత ప్రమాణాలుగల నాటిక. శిల్పం రీత్యా గొప్పదీ, అనుభవదృష్ట్యా మిక్కిలి బాధాకరమైనదీ ఈ నాటిక అని విమర్శకు లన్నారు. కాని వీటన్నిటినీ మించి నాటికలో రచయిత నాయికను సృష్టించిన తీరు, చూపిన ఆమె ప్రవర్తన, చివరకి తెచ్చిన పర్యవసానం అనన్యమైనవని నా మనసులో వుండిపోయిన భావముద్ర చెబుతుంది. స్వకీయ, పరకీయ, సామాన్య అని మన నాయికా భేదాలు. వాటిల్లోనుంచి పరకీయను తీసుకొని దానికి ఒక సాహిత్య ప్రక్రియద్వారా కళారూపమిచ్చిన తీరు ఎంతో సింపుల్‌గావున్నా పాఠకులపై దాని ప్రభావం అమోఘము, అసదృశము అని చెప్పాలి. పరమ పతివ్రతగా పరిగణింపబడుతూవున్న ప్రభావతి ఒక సన్నివేశంలో వివాహానికి పూర్వం తను మనసారా ప్రేమించిన ప్రియుని కలుసుకొని అతనికి సేవ చేయవలసివస్తుంది. తన పరువు ప్రతిష్ఠలను లెక్క చేయక అతనితో వెళ్ళిపోవాలనీ, అతనిని తాను దక్కించుకోవాలనీ సంకల్పిస్తుంది. కాని అతను ఆమె త్యాగానికి అంగీకరించక అక్కడినుంచి నిష్క్రమిస్తాడు. ఆమె అలా పరకీయగానేవుండి పోతుంది. ఈ నాటకంలోని సంభాషణలు ఉద్రేకమూ, పటుత్వమూ కలవి. ప్రభ మొదటల్లో అంటుంది. 'దుర్మా

ర్మంగా వుండాలంటే మాత్రం అందరికీ సాధ్యమవుతుందటండీ.' కొన్ని విసుర్లు కూడా వున్నాయి. 'స్త్రీలు మాస్టర్ల భార్యల్ని ప్రతిదినమూ వర్ణిస్తూ వుంటారటండీ'. రచయిత ఒక జీవిత సత్యాన్ని తమ సందేశంగా చెబుతూ 'మోహం తాత్కాలికం. ప్రేమ శాశ్వతం. ప్రేమానుభవం నిష్కామ కర్మ. ప్రేమకూ భక్తికీ తృప్తి లేదు' అన్నారు. ఆలోచకులు మననం చేసుకోవలసిన డైలాగులు ఈ నాటికలో వున్నాయి.

సాహిత్య అకాడమీ వారు శ్రీ ముద్దుకృష్ణచే సంకలనం చేయించి ప్రచురించిన తెలుగు 'నాటికలు' సంపుటిలో మొట్టమొదటి నాటిక రాజమన్నారు రచన 'ఏమి మగవాళ్ళు'. ఇది ఎన్నో ఏండ్ల క్రితం వ్రాసినప్పుడు ఎంత నవనవోన్మేషంగా వుండేదో ఈ నాటికీ అంతే నవ్యతతో పాఠకుల్ని అధికంగా ఆకర్షిస్తుంది. గురజాడ వారి 'కన్యాశుల్కం'వలె ఈ నాటికకూడా శాశ్వతమైన మూల్యం కలదని నా విశ్వాసం. సంప్రదాయాలనుగూర్చి గొప్పగా చెప్పుకుంటూ వేశ్యలను తూలనాడే పెద్దమనుషులు ఆ వేశ్యపిల్లతో ఏకాంతంలోవుండే అవకాశం కలిగేసరికి 'బ్రహ్మకైన బుట్టురిమ్మ తెగులు' అన్నట్లు ప్రవర్తిస్తారని ఈ నాటిక చూపింది. చివరికి కట్టుకున్న భర్తకూడా ఆమెను అనుమానించేసరికి మంగళసూత్రం తెంపి పారవేసి 'ఛీఛీ, ఏమి మగవాళ్ళు!' అని నిష్క్రమిస్తుంది. నిజానికి వేశ్యపిల్ల తప్పేమీ లేదు. 'మగవాళ్ల నైజమే అంత?' అన్న ప్రశ్న రేకెత్తించే నాటిక ఇది. ఇందులో ప్రతి పాత్ర మాట్లాడే మాటలు ఒక్కటీ అనావశ్యకమైనవిగా కన్పించవు. పైగా ఒక్కవాక్యం తీస్తే ఏదో లోటు అనిపించవచ్చు.

'వైకుంఠాచార్యులు' అన్న నాటికలో దొంగ ఆచార్యుల బ్రతుకులను బట్టబయలు చేశారు. వచ్చిన ఆపదను తప్పించుకున్న ఆచార్యులవారు 'గండం గడిచింది. ఈ వూళ్లో ఇక వుండడం తగదు. ఇంకో మజిలీలో మకాం వెయ్యాలి' అని చల్లగా జారుకుంటారు. సాంఘిక వాస్తవికత, హాస్యం రెండూ మిళితమై వున్న నాటిక ఇది.

రాజమన్నార్ వ్రాసినవి హెచ్చుగా సాంఘిక నాటకాలు. ఏదో ఒక ప్రయోజనం లేనిదే, చెప్పడానికో సందేశంలేనిదే వీరు నాటిక వ్రాయరు. అలా వ్రాసిన నాటికలలోని పాత్రలు మాట్లాడేభాష, పన్నే వ్యూహాలు, ప్రవర్తించే తీరుతోయములు, అడే నాటకాలు అంతర్నాటకాలు అన్నీ ఆ సందేశంవైపే తీసుకుపోయి రచయిత ఆశించిన లక్ష్యంలో పర్యవసానానికి వస్తాయి. నాటికా రచనలో నైపు, నాటము లెరిగిన రచయిత రాజమన్నారు.

'నాగుబాము' బౌద్ధకాలపు నాటిక. ఇందులో ఆంధ్రరాజతనయ నాయిక. బౌద్ధ ధర్మోపాసకుడూ, శిల్పి నాయకుడు. ఈ నాటికలో రచయితకు గల నాట్యశాస్త్ర పరిజ్ఞానం ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. ఇది ఆలిండియా రేడియో నేషనల్ ప్రోగ్రాములో ప్రసారమైంది. తెలుగుతోపాటు అన్ని భాషలలోనూ ఏకకాలంలో ఈ నాటిక ప్రసారమైంది.

'నందిని' అన్న నాటికలో మతవైరాలతో మానవజాతి జ్ఞానంలేని శైశవదశలో వుందనీ, లోకాన్ని ప్రేమ జయించగలకాలం రాలేదనీ రచయిత చెప్పారు. ఇట్లా చెప్పాలంటే వీరివి అనేక నాటికలు ఎంతో వైవిధ్యము కలవి వున్నాయి. 'తప్పెవరిది' అన్న వీరి నాటిక మద్రాసు మ్యూజియం థియేటర్‌లో 1930 లో ప్రదర్శించినప్పుడు అందులో బళ్ళారి రాఘవాచారిగారు నటించారు. వీరి 'తెగని సమస్య'లో కూడా రాఘవాచారిగారు నటించారు. వీరి 'మనోరమ' నాటకం రేడియోనుండి ప్రసారమైనప్పుడు శ్రీమతి సావిత్రి శ్రీ గుమ్మడి మొదలగు సినిమా తారలు అందులో పాల్గొన్నారు. వీరు రచించిన 'సింహగిరి' 'సర్దార్ పాపడు' అనే రేడియో నాటికలు కూడా శ్రోతల మన్ననలందుకొన్నాయి. నాటకాలలో ఆడపాత్రలను ఆడవాళ్ళచేతనే వేయించాలనే పట్టుదలతో వుండేవారు బళ్ళారి రాఘవగారు. రాజమన్నార్‌గారి నాటికే ప్రప్రథమంగా ఆడపాత్రలన్నీ ఆడవాళ్ళచేత ప్రదర్శింపబడిన నాటిక.

వీరివి కొన్ని నాటికలు హిందీలోకి శ్రీ డా. భీమసేన్ నిర్మల్‌గారిచే అనువదింపబడి హైదరాబాదు హిందీప్రచారసభవారిచే 'శ్రీ పాకాల్ వేంకట రాజ

మన్నార్‌కే సాత్ ఏకాంకీ' అన్న పేరుతో ప్రచురింప బడ్డవి. హిందీ నాటకకర్తలు ఈ ఆధునిక తెలుగు నాటికలను ఎంతో మెచ్చుకున్నారు.

రాజమన్నార్ నాటికల సంపుటికి విఖ్యాత నాటక విమర్శకులు డా. శ్రీపాద గోపాలకృష్ణ మూర్తిగారు ఉపోద్ఘాతం వ్రాస్తూ 'రాజమన్నారు నాటికల సందేశాలకు వైచిత్రీ, వైలక్షణ్యమూ వుంటాయి. వీరి సందేశాలు బరువైనవి. సమాజానికి పైపైన తేలే బిందువులు కావు. ఈ సంపుటంలోని నాటికలు ఇంచుమించు అన్నీ మానవజీవితానికి తెర చాపా, చుక్కానీ అయిన ప్రేమాభిమానముల ఆనందవు టవతారాల్ని చూపేటివే. రాజమన్నారువంటి మేధావి దృష్టికి అంతరాత్మ అనేది కూడా సంఘ నియ మాలకు లోబడివున్నదే అని తెలుస్తుంది......మనము అనుకోని పాత్రల ప్రవేశములు కల్పించీ, పాత్రల అంతర్గత స్వభావాన్ని సందులలోకి పొగడీసీ, స్వభావ భేదమున్న వ్యక్తులను సన్నివేశపరచీ రాజమన్నారు గారు ఈ మూడు గుణాల్ని సాధించారు. వీరి నాటిక లలో పర్యవసానం క్లుప్తములో తేలిపోతుంది. ఒక పర్యవసానం జరిగి అంతమాత్రంతో మన మనస్సు లకు సమాధానం కానప్పుడు, ఈ పర్యవసానానికి వ్యతిరేకపు పర్యవసానం తిరి కథని పూర్తిచేయడం కూడా కనబడుతుంది. ఈ పతాక, ప్రతిపతాక దశలు సాధ్యమే. కాని సాధించినవారు మాత్రము బహుకొద్ది. వారిలో రాజమన్నారుగారు ముఖ్యు లంటాము. పాత్రపోషణలో రాజమన్నారుగారిది అందె వేసిన చేయి. ఛెకోవ్ కోరస్‌గర్ల్‌కంటె చిత్రరేఖ తెలివైనది. టాగూరు మాలీకంటె రామలక్ష్మమ్మ బుద్ధి సూక్ష్మమైనదీ, మనసు పెద్దదీమా. జయశ్రీ, బుచ్చిబాబు తిష్యరక్షితను చంపి పుట్టింది. ఆమె చండల అయితే ఈమె ఉల్క...స్త్రీమూర్తి సహ స్రాధికశీతలకిరణాలు వెదజల్లుతూ రాజమన్నారు లేఖినినుంచి ఇంకా సృష్టి కావాలి' అని ఆకాంక్షిం చారు. రాజమన్నారు నాటికలను గూర్చి శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు 'భారతి'లో కొన్ని వ్యాసాలుకూడా రచించారు.

'ప్రతాపరుద్రీయం' నాటకంలోని అన్ని పాత్ర లకూ వాటి వాటికి తగిన కంఠమిచ్చి వీరు చెప్పిన డైలాగులు ఓపు రికార్డు చేయబడ్డాయి. వాటిని వినే అవకాశం నాకు కలిగింది. విని తీరవలసిన వాచ కము వీరిది.

తెలుగు సాహిత్యం అభ్యుదయ పరంపరాభి వృద్ధిగా కొనసాగవలెనని రాజమన్నారుగారి ఆకాంక్ష. 1947 జనవరి 17, 18, 19 తేదీలలో మద్రా సులో జరిగిన ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం వార్షిక మహాసభకు రాజమన్నార్ అధ్యక్షత వహిం చారు. ఆ సందర్భంలో చేసిన అధ్యక్ష ప్రసంగంలో కవికీ, సంఘానికీ, జీవితానికీ ఎడతెగని సంబంధం కలదని ఉద్బోధించారు. మార్పులేకపోతే అభ్యుదయమే వుండదన్నారు. వ్యక్తికీ సంఘానికీ సజీవంగా వుండడ మంటేనే మారుతూ వుండడం అని చెప్పారు. 'కాల ధర్మానుగతమై జగత్ప్రవృత్తి మారునపుడు వాఙ్మ యమును మారు నిజము' అన్న రాయప్రోలు ఉవా చను ఉదహరించి, నవ్యాంధ్ర సాహిత్యంలో విష యంలో, రీతిలో, భాషలో మార్పు కన్పిస్తున్నదని ఉద్ఘాటించారు. ఆంగ్లభాషాసంపర్కంవల్ల ఆంధ్ర సాహిత్యం కొత్తమార్గాలు తొక్కనారంభించిందని వారి అభిప్రాయం. ఆధునిక తెలుగు కవిత్వపు సిద్ధాంతాలు, స్వరూప స్వభావాలు ఆంగ్లంలో నవీన కవిత్వపు రీతులవల్ల ఉద్భవించినవే. కావ్య వస్తు వులో, కావ్యరూపాలలో, శైలిలో, భావప్రకటనలో, కవి సమయాల్లో, ఆదర్శాల్లో పాశ్చాత్య ప్రభావం వుందని వీరి భావం. వీరేశలింగం పంతులుగారు 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డు' చదివివుండకపోతే 'రాజశేఖర చరిత్ర'ను వ్రాయగలిగి వుండేవారుకారనీ, చిలకమర్తి వారి నవలల్లో చార్లెస్ డికెన్స్ నవలల ప్రభావం కనపడుతుందనీ, ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాల పల్లి' నవలలో 'East Lynne' కథ కొంత వుందనీ, రాజమన్నార్ అన్నారు. అలాగే వెంకటచలం, అడవి బాపిరాజుగారల రచనల్లో కూడాను. పాను గంటివారి 'సాక్షి' 'స్పెక్టేటర్'ను పోలివుందనీ, ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు వ్రాసిన నాటకాల్లో ఆంగ్ల నాటక పద్ధతుల ప్రభావం బాగా కన్పిస్తుందనీ చెప్పారు. గుడిపాటి వెంకటచలాన్ని రాజమన్నారు మొదట కలుసుకున్నది 1931 లో. అప్పుడాయన బెజవాడలో ట్రెయినింగ్

స్కూలుకు హెడ్మాస్టరుగా వుండేవారు. చలం రచనలన్నిటినీ రాజమన్నార్‌గారు చదివారు. చలం రచనల ప్రభావం తమపై అధికంగావున్నా వారిలాగే వ్రాయాలన్న సంకల్పం తమకెప్పుడూ లేదని రాజమన్నారుగారే చెప్పుకున్నారు. చలం మొదటి నవల 'శశిరేఖ' చదివినప్పుడు తమ మనస్సులో కలిగిన కలవరం మరచిపోలేమనీ, హార్డీ నవల 'Tess' చదివినప్పుడు కూడా అటువంటి కలవరమే కలిగిందనీ అన్నారు. చలాన్నిగూర్చి రాజమన్నారుగారి అభిప్రాయం సాహితీపరులు గమనించదగింది. 'స్త్రీకి చలం ఇచ్చిన గౌరవం, ఉన్నతస్థానం ఇంకెవరూ ఇవ్వలేదు. ముఖ్యంగా స్త్రీ పురుష సంబంధం విషయంలో. చలంగారి స్త్రీలు జీవంగల వ్యక్తులు. చలం దృష్టి వేరు. మానవప్రకృతికి సహజమైన ధర్మమే నిజమైన ధర్మం. సంఘనియమాల్ని అతిక్రమించడం అవినీతి కాదు. స్త్రీని పూర్తిగా అర్థం చేసుకున్నాడు చలం. 'శశిరేఖ', 'అమీనా', 'మైదానం'వంటి కథలు వ్రాసిన చలం రమణ మహర్షి ఆశ్రమంలో చేరి ఆధ్యాత్మిక వచనాల్ని వ్రాయడం కొందరికి ఆశ్చర్యంగా వుండవచ్చు. అట్టివారు భక్తికీ, ముక్తికీ వున్న సామీప్యాన్ని గ్రహించనివారు. భోగి సులభంగా యోగి కాగలడు. కామి గాక మోక్షకామి గాడు. పురుషార్థాల్లో కామం తరువాత మోక్షం. శృంగారమూ, ఆధ్యాత్మిక మార్గమూ వేరు కావు. మొదటి మార్గ పర్యవసానమే రెండోది అని చలమే అన్నాడు. అనేక కవులకు జీవితం వేరు, రచన వేరు. చలానికి అలా కాదు. ఆయన జీవితం వేరు, రచనలు వేరు కావు. 'కేసరి కేసరి కేసరి' అన్నట్లు చలం 'చలానికేసరి' అన్నారు.

అయితే ఆధునిక కవిత్వంలో వివాదాలే కవిత్వం అంటే రాజమన్నారు ఒప్పుకోరు. మద్రాసు రేడియో కేంద్రంద్వారా ప్రసారితమైన మొదటి సాహిత్య సమీక్షకు శ్రీ రాజమన్నార్ అధ్యక్షులుగా వుండి శ్రీ శ్రీ రచనా ధోరణిని విపులంగా ప్రస్తావించి 'సింధూరం రక్తచందనం...పులి చంపిన లేడి నెత్తురూ కవితావస్తువులైనాయి. 'కదలేదీ, కదిలించేదీ, పెను నిద్దుర వదిలించేదీ, మునుముందుకు సాగించేదీ పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ' కావాలట నవ కవనానికి. కాని ఏదీ అటువంటి కవిత?' అని ప్రశ్నించారు. ఆ ప్రశ్నతోనే ముగించారు తమ సమీక్షను. అయితే కావ్య రీతులలో వైవిధ్యం, నవీనత వుండవలెనని వీరి ఆశయం. ఇటీవల వీరు వ్రాసిన ఒక వచన కవిత పరిశీలించండి :

ఆద్యంతాలులేని అంధకారంలో
కనులు మూసుకొని తనువు మరిస్తే
ఎక్కడిదీ వెలుగు? ఎచ్చటిదీ జ్యోతి?
నాలోదేనా? అయివుండాలి.
ఇది కవిత్వం కాదంటారా?
ఎందుకనీ?
ఛందోబద్ధం కాదనా?
ఛందస్సంటే ఏమిటి?
ఛందస్సుకు ఆధారం ఏది?
లయ కాదా!
వచనంలో లయ లేదా
కావ్యం అంటే గద్యం, పద్యం కాదంటారా?

ఈ కావ్యఖండిక ఈనాడు వచన కవిత్వాన్ని ఉపాసించేవారికి చేయూతగా వుంది. కేవలం వచన కవిత్వమే వ్రాస్తూవున్న ఈ తరం యువకులు రాజమన్నారును తమ నాయకుడుగా స్వీకరిస్తారేమో!

## నవలా రచయిత

రాజమన్నార్ వ్రాసిన ఒకేఒక నవల 'శ్రుతి తప్పిన రాగం'. ఇది ఇటీవల ఎమెస్కో పాకెట్‌బుక్స్ సీరీస్‌లో ప్రచురించబడింది. ఇది కళ్యాణి అనే ఒక అభాగిని కథ. అనేక సంఘటనలవల్ల కళ్యాణి జీవన రాగం అపశ్రుతిలో పడుతుంది. అయినా తనకు తటస్థించిన అన్ని అవాంతరాలనూ ఎదుర్కొంటుంది. తన గాథ అంతా తన బిడ్డకు తెలియకూడదని నిశ్చయించుకొని ఏడుకొండలవానికి కనుచూపు మేరలో ఆత్మహత్య చేసుకొంటుంది. స్త్రీ పతనం చెందకూడదు. జీవిత సంగ్రామంలో ధీరయై పోరాడి విజయం సాధించాలి అని రాజమన్నార్ సృష్టించిన కళ్యాణిపాత్ర చెబుతుంది. ఒక సమీక్షకులీపాత్రను విశ్వనాథవారి 'చెలియలికట్ట'లోని రత్నావళితో పోల్చి, రత్నావళి సమాజానికో గుణపాఠం అయితే రాజమన్నారుగారి కళ్యాణిపాత్ర ఆదర్శవంతమైనదీ, మార్గదర్శకమైనదీ అన్నారు. ఈ విధంగా వీరు

నవ్యాంధ్ర సాహిత్యలోకంలో చెరగిపోని స్థానం పొంది అనేక కవులకు, రచయితలకు మాటికి మారు పాళ్ళు సాహిత్యకుడుగా కన్పించి, వారి ఆదరాభిమానాలకూ అపేక్షకూ పాత్రులైనారు. ఎన్నో గ్రంథాలకు పీఠికలు రచించారు ఆరుద్ర వ్రాసిన 'సమగ్రాంధ్ర సాహిత్యం' సంపుటాలన్నీ రాజమన్నారుగారి ప్రవేశికతోనే వెలువడ్డవి. ఆ ప్రవేశికలో 'నన్నయకు పూర్వం ఎన్నివందలేండ్లనుంచో ఆంధ్రభాష పుట్టి పెరుగుతూ వచ్చివుండాలి' అన్నారు. మద్రాసు రేడియో కేంద్రమునుంచి తెలుగు సాహిత్యాన్ని గూర్చి వీరు చేసిన ప్రసంగములు అనేకం ఆంగ్లంలో Man of Letters అనే మాట వీరికి పూర్తిగా వర్తిస్తుంది.

## న్యాయవాది—న్యాయమూర్తి

శ్రీ రాజమన్నార్ బి. యల్. పరీక్షలో ఉత్తీర్ణులైన తర్వాత 1923 లో వారి తండ్రిగారికి అప్రెంటిస్‌గా చేరారు 1924 లో లాయరుగా పేరు నమోదు చేయించుకున్నారు. 1925 లో 'కళ' పత్రిక ప్రచురణను ఆపేశారు. అడ్వొకేటుగా వీరి తండ్రిగారికి మద్రాసు హైకోర్టులో గొప్ప ప్రాక్టీసు వుండేది. అయితే తండ్రిగారు మద్రాసు హైకోర్టు న్యాయమూర్తిగా 1935 లో నియమితు లయ్యేంత వరకూ క్లిష్టసాధ్యమైన కేసులలో స్వయంగా వాదించి నిర్వహించే అవకాశం ఈ యువ న్యాయవాదికి కలుగలేదు. తండ్రిగారు జడ్జి అయినతరువాత వారికున్న పెద్ద ప్రాక్టీసు అంతా వీరికి వచ్చేసింది. అయితే తండ్రిగారి బెంచిముందు వీరు ఏ కేసులోనూ న్యాయవాదిగా ప్రత్యక్షం కాలేదు. కారణమేమని అడిగినవారికి 'న్యాయం జరిగినంతమాత్రాన సరిపోదు. న్యాయం జరుగుతూవున్నట్లు పదుగురికీ అనిపించాలి' అన్నారు. ఇతరజడ్జీలముందు నిర్భయంగా నిల్చొని కేసులు నిర్వహించేవారు. పెద్దపెద్ద కేసులలో స్వయంగా వాదించి అడ్వొకేటుగా మంచిపేరు తెచ్చుకున్నారు. ఆ రోజులలో ఇది మామూలు విషయంకాదు. హేమాహేమీ లయిన అడ్వొకేట్లు ఎందరో రంగంలో వుండి యువకులను హడలగొట్టేటంతటి ప్రజ్ఞాప్రాభవాలు ప్రదర్శించేవారు. అయినా రాజమన్నారు చిన్నవయసు లోనే తమ కేసులను వాదించడానికి బాగా సంసిద్ధులై వచ్చి న్యాయవాదవృత్తిరంగంలో అగ్రగాములైనిలిచారు. వీరి ఆదాయం లాయర్‌గానే ఎక్కువగా వుండేది. 1944 లో అప్పటి మద్రాసు అడ్వొకేట్ జనరల్‌గావున్న సర్ అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ గారు రిటైరుకాగా రాజమన్నార్ అడ్వొకేట్ జనరల్‌గా నియమింపబడ్డారు అప్పుడు వీరి వయస్సు 43 ఏండ్లు. అడ్వొకేటు జనరల్‌గా ప్రభుత్వంవారి ఆదేశంపైన లోకప్రసిద్ధమైన లక్ష్మీకాంతం హత్యకేసును అసాధారణ సామర్థ్యంతో వీరు నిర్వహించారు. దీనివల్ల బార్‌లో వీరు హెచ్చుకాలం వుండే వీలులేకపోయింది. 1945 జూలై 25 తేదీన మద్రాసు హైకోర్టుజడ్జీగా చార్జి పుచ్చుకున్నారు. అప్పుడు సర్ లయొనల్‌లీచ్ మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా వుండేవారు. వీరి తండ్రిగారు మైసూరు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా వుండేవారు. కుమారుడు న్యాయమూర్తిగా పదవీస్వీకారం చేయడాన్ని తండ్రి చూచి ఆనందించారు. అనతికాలంలోనే-అనగా అప్పటి ప్రధాన న్యాయమూర్తి సర్ విలియం జెంటిల్ పదవీ విరమణ చేయగా 1948 లో రాజమన్నార్ మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా నియమింపబడ్డారు. ఈ విధంగా త్వరితగతిని ఒక్కొక్క మెట్టు పైకిపోయి అత్యున్నతమైన చీఫ్ జస్టిస్ పదవిలోకి రావడం భారత న్యాయశాఖ చరిత్రలోనే అపూర్వం అద్వితీయం. ఆ పదవిలో వారున్నప్పుడు వయస్సులో వారికన్న ఎంతో పెద్దవారైన శ్రీ టి. యల్. వెంకటరామఅయ్యర్, శ్రీ ఎ. విశ్వనాథశాస్త్రి వీరికి సాటి జడ్జీలుగా వుండేవారు. మద్రాసు హైకోర్టుకు మొట్టమొదటి భారతీయ ప్రధాన న్యాయమూర్తి శ్రీ రాజమన్నారుగారే కొందరు ఆంగ్లేయ జడ్జీలు కూడా వీరి ఆధిపత్యాన న్యాయమూర్తులుగా పని చేశారంటే వారికి వీరి సామర్థ్యంపైన, గుణగణాలపైన, యోగ్యతలపైన ఎంతటి పరిగణన వుండేదో విశదమవుతుంది. చీఫ్ జస్టిస్‌గా న్యాయమూర్తుల బెంచీలను ఏర్పాటుచేయడంలోనూ, వారికి కేసులను అప్పగించడంలోనూ వీరు చూపిన విచక్షణజ్ఞానం, విజ్ఞత, దూరదృష్టి న్యాయవాదవృత్తిలోవున్న ప్రముఖుల ప్రశంసలకు పాత్రమైనవి. వీరు తలచుకుంటే సుప్రీంకోర్టు న్యాయమూర్తి అయ్యేవారు. కాని

మద్రాసు చీఫ్ జస్టిస్‌గా వుండడమే వీరికి హెచ్చుగా ఇష్టమైంది. అందరినీ నవ్వించే ఒక చిన్నసంఘటన ప్రస్తావిస్తాను ఇచట

భారత ప్రధానమంత్రి శ్రీ జవహరలాలు నెహ్రూతో వీరికి ముఖాముఖి పరిచయం 1948 లోనే ఢిల్లీలో జరిగిన ప్రధానన్యాయమూర్తుల సమావేశానికి వెళ్ళారు. అప్పుడు వీరివయస్సు 47. హాజరైనవారిలో వీరే అందరికన్న చిన్న ప్రధాన న్యాయమూర్తి. పార్టీలో వీరు కొంతదూరంగా నిల్చున్నారు; నెహ్రూ వీరిని దగ్గరికిపిలిచి పక్కన కూర్చోమనిచెప్పి 'ఇంతచిన్నవాడివిగా వున్నావే, ప్రధాన న్యాయమూర్తివి ఎట్లా అయినావు?' అని అడిగారట. 'అది నా తప్పుకాదు' అని రాజమన్నారు జవాబు చెబితే నెహ్రూ పకపకా నవ్వారు. అంటే అది ప్రభుత్వంవారితప్పు అన్నప్రశ్న ఆ జవాబులోనే ఇమిడి వుంది.

న్యాయమూర్తిగా శ్రీ రాజమన్నార్ తీర్పులు చిరకాలం చెప్పుకునే ఉదాహరణలుగా నిలుస్తాయని అప్పటి పెద్దపెద్ద న్యాయవాదులే అంగీకరించారు. చక్కని వివేచన, స్పష్టత, స్వచ్ఛత ఆ తీర్పులలో ద్యోతకమయ్యేవి. ఎంతటి క్లిష్టమైన కేసు అయినా తాము ప్రశ్నలువేసి జవాబులు చెప్పించిన వైనంతో దాని అనుపానులు ఇట్టే కనిపెట్టి అందరినీ ఆశ్చర్య చకితులను గావించి గొప్పమేధావి అనిపించుకున్నారు. తరగని ఆయన సహనం అందుకు మరీ ఉపకరించేది. ముఖ్యంగా శుక్రవారాలు ఆయన ప్రతిభకు చక్కని సందర్భాలుగా వుండేవిట. శుక్రవారాలు ఆయన సివిల్ రివిజన్ పిటీషనుల విచారణ జరిపేవారు. యువకులైన జూనియర్ లాయర్లు వాదిస్తూ వుండేవారు. జూనియర్లకు ఆయన విచారణ ఎంతో విద్య గరపేది. ఎన్నో కొత్త అంశాలు గ్రహించేవారు. హైకోర్టులో ఏ సైడున విచారణ జరిపినప్పటికీ అందరికన్నా ఎక్కువ కేసులను విచారించి తీర్పులు చెప్పిన ఖ్యాతి రాజమన్నారుకే దక్కింది.

శ్రీ రాజమన్నార్ మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి అయిన కాలం భారతదేశ చరిత్రలో అత్యంత ప్రాముఖ్యము కలది. భారతదేశానికి అప్పుడే స్వాతంత్ర్యం రానున్న తరుణం. ప్రజలలో శాంతిభద్రతల నిర్వహణపట్ల విశ్వాసంవుండేదికాదు ఎన్నోఉద్యమాలూ, సత్యాగ్రహాలూ, పోరాటాలూ చూచిన ప్రజలైరి. శాంతిభద్రతలపట్ల వారిలో శ్రద్ధ ఎలా వుంటుంది? పైగా రాజ్యాంగం హైకోర్టులకు విస్తృతాధికారాల నిచ్చింది. రాజ్యాంగం అమలులోకి వచ్చిన తరువాత భారత రాజ్యాంగ శాసనానికి రాజమన్నార్ చేకూర్చిన దోహదం ప్రశంసనీయమైనదనీ, ఆయనతో కూర్చుని రాజ్యాంగ సంబంధమైన కేసుల విచారణ జరుపడమే విద్యాదాయకంగా వుండేదనీ, ఆయనవేసే ప్రశ్నల వల్ల నిజస్థితి ఇట్టే విస్పష్టమై, సమస్య సహజ రీతిలో పరిష్కారమయ్యేదనీ తోటి న్యాయమూర్తులే అని వున్నారు. న్యాయవ్యవస్థ స్వతంత్రమైనదనీ, పౌరుల హక్కులను కాపాడేదనీ వీరు నిరూపించారు. స్వాతంత్ర్యానంతరదశ—మారిన రాజ్యాంగము ననుసరించి కొత్త జూరిస్‌ప్రూడెన్సు అవతరణకూ, మారిన లక్ష్యాల అమలుకూ అవకాశ మొసగినది. అట్టి దశలో మద్రాసు రాష్ట్ర న్యాయవ్యవస్థకు శ్రీ రాజమన్నార్‌వంటి వ్యక్తి అధిపతిగా వుండడం ఆ రాష్ట్రం చేసుకున్న అదృష్టమని ప్రతిభావంతులైన న్యాయమూర్తులే అంగీకరించారు. మారినకాలంలో, మారిన పరిస్థితులలో ఆ స్థితిగతులకు అనుగుణంగా, ఆ ధ్యేయాన్ని దృష్టియందుంచుకొని చట్టాలకూ, ముఖ్యంగా రాజ్యాంగానికీ ఈయన చెప్పిన వ్యాఖ్యానాలు, తీర్పులు న్యాయమూర్తులకే మార్గదర్శకమైనవి. వీరి న్యాయవృత్తి చరిత్రలో ప్రభాకరతంపన్ కేసు, తంగవేలు ఆసరి—లక్ష్మిఅమ్మాళ్ కేసు, వసంతపాయికేసు ఉదాహరణప్రాయమైనవి. 'శాసనంక్రింద వ్యక్తి స్వాతంత్రం' అను విషయంపై జరిగిన విద్వద్గోష్ఠిని వీరు ప్రారంభిస్తూ రాజ్యాంగములోని 19 వ అధికరణానికి చేసిన వ్యాఖ్యానం చిరకాలం స్మృతిలో నిల్చేది. రాష్ట్ర న్యాయపాలనా వ్యవస్థను శ్రీ రాజమన్నార్ గౌరవ ప్రపత్తులు కలిగేవిధంగా నిర్వహించారు. పాలక వ్యవస్థనుండి న్యాయవ్యవస్థను వేరుపరిచే కార్యమును ఆయనే మద్రాసు రాష్ట్రంలో అమలు జరిపారు. ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు కర్నూలులో ఆంధ్ర గవర్నరుచే వీరే ప్రమాణస్వీకారం చేయించారు. అప్పటికింకా ఆంధ్ర హైకోర్టు ఏర్పడలేదు.

రెండు రాష్ట్రాలకూ మద్రాసు హైకోర్టే న్యాయస్థానంగా వుండేది. ఇంతటి ప్రతిభా సామర్థ్యములతో న్యాయపాలన నిర్వహించి వీరు 1961 మే 10వ తేదీన మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పదవినుండి విరమించారు. ఈ లోపల 1957 అక్టోబరునుండి దాదాపు నాలుగు మాసాలపాటు మద్రాసు గవర్నరుగా వున్నారు. గవర్నరు పదవి ఆయనకు ఇష్టంగా వుండేదికాదట. ఎందుకని నేను అడిగితే 'జి' అనే అక్షరంవద్ద సంతకం చేయడంతప్ప స్వంత ఆలోచన, పరిశీలనవంటివేవీ వుండేవికావని అన్నారు. నెహ్రూగారు కూడా ఆ ప్రశ్న వేస్తే 'కామ్ నహీ ఆరామ్ నహీ' అన్నారుట (అంటే పనిలేదు, తీరిక సుఖమూ లేవు అని అర్థం). అయితే గవర్నరుపదవి మరొకవిధంగా వారి కిష్టమైన పనులుచేసే అవకాశం ఇచ్చింది. వీరు గవర్నరుగా వుండగా నెహ్రూ వీరికి అతిథిగా వున్నారు. ప్రపంచ ప్రసిద్ధ నీగ్రో గాయనీమణి మేరియన్ ఆండర్సన్ వీరికి అతిథిగా వుంది. రాష్ట్రప్రజల తరపున ఆమెను వీరు సత్కరించారు. ఆ సందర్భంలో వీరు ప్రసంగిస్తూ 'ప్రజల తరపున, నా తరపున తమవంటి ఉత్తమ కళాభిజ్ఞులను యథోచితరీతిని సత్కరించే మహాభాగ్యముకొరకే ఈ పదవిలోవుండే సదవకాశం లభించినది, నాకు అని భావిస్తున్నాను' అన్నారు రాజమన్నారు. జెకొస్లొవేకియా ప్రధానమంత్రి సిరోకీ, టిబెట్‌నుంచి దలైలామావచ్చి వీరి ఆతిథ్యం పొందారు. రాజభవనం కళాకారులకు దర్శనీయమైన స్థలంగా వుండేది.

మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా వీరు చేసిన పదవీవిరమణకూడా ఎంతో వైభవంగా జరిగింది. హైకోర్టులో పెద్ద వీడ్కోలు సభ ఏర్పాటు చేశారు. రిటైరయ్యే ప్రధాన న్యాయమూర్తితోపాటు హైకోర్టు జడ్జీలందరూ వేదికపై ఆసీనులయ్యారు. అడ్వొకేట్ జనరల్ మొదలు పెద్దన్యాయవేత్తలు, న్యాయమూర్తులు వీరి ప్రతిభా విశేషాలకు జోహార్లు అర్పిస్తూ వుంటే వీరి తండ్రిగారు ఆ సభాసదులలో కూర్చొని కుమారునిపై కురిపింపబడుతూవున్న ప్రశంసా పరంపరలను విన్నారు. పదవినుండి విరమణ చేసేటప్పుడు రాజమన్నారు ఎటువంటి గౌరవ సద్భావాలతో ఆ స్థానంనుండి దిగిపొయ్యారో అంతటి విశేష భాగ్యం మరొక ప్రధాన న్యాయమూర్తి కెవరికీ కలుగలేదని మద్రాసు బారును ఎరిగిన ప్రముఖులన్నారు. 'ది లా వీక్లీ' పత్రిక (6 మే 1961 తేదీన) 'ది రాజమన్నార్ ఇరా' (రాజమన్నార్ శకం) అనే శీర్షికతో సంపాదకీయం వ్రాస్తూ 'మద్రాసు హైకోర్టు చరిత్రలో ఇదొక ముఖ్య ఘట్టము. ఈ హైకోర్టు చరిత్రలో ఇది మహోజ్జ్వలమైన శకము. అది వీరు 1945 లో జడ్జిగా నియమింపబడటంతో ఆరంభమైంది. వీరి కాలంలోనే రాజ్యాంగం పనిచేయడమారంభించింది. అప్పుడే హైకోర్టుకు మరొక జూరిస్‌డిక్షన్ కూడా కలిగింది. ఏమిటంటే పౌరుని ప్రాథమికస్వత్వములకూ, వాటి పరిరక్షణకూ సంబంధించిన ప్రెరోగేటివ్ రిట్లు. ఆయనను వందలాది మేధావులు ఎంతో గౌరవ ప్రపత్తులతో చూచేవారు. ఆయన సముపార్జించిన విద్యా విజ్ఞానములు, ఆయన సంస్కృతి, ఇతరులతో సౌజన్యంతో మెలగే వైనం, ఆయన వైఖరిలో కన్పించే తీయదనం, ఆకర్షణ ఆయనకుగల దేశాభిమానం, ప్రాచీన వ్యవస్థల పట్ల సంప్రదాయాలపట్ల దేశనాగరికతపట్ల ఆయనకుగల గౌరవాభిమానాలు ప్రత్యేకంగా ప్రస్తావింపదగ్గవి. కేసుల వాయిదాలను అనుమతించడంలో ఆయన ఎంతో ఉదారంగా వ్యవహరించేవారు. ఒక పార్టీతరఫు న్యాయవాది రాలేదన్న కారణంతో ఏకేసునూ డిస్మిస్ చేయడం ఎన్నడూ జరగలేదు. ఆయన ఆసీనులైవున్న న్యాయస్థానంలో ఒక మంచికేసు విఫలమై పోవడంగాని, ఒక చెడుకేసు నెగ్గడంగాని బహు అరుదుగా జరిగేవి. ఆయన పదవీ విరమణ చేయడంతో మద్రాసు హైకోర్టు అత్యంత ప్రతిభాశాలిని, సమర్థుడిని, ఒక మహాన్యాయమూర్తినీ కోల్పోయింది. మళ్ళీ అటువంటి వ్యక్తి రావడం ఎన్నటికో ఏమో! న్యాయరంగం ఆయనను గౌరవ మన్ననలతో, ప్రేమ భావంతో బహుకాలం జ్ఞాపకం పెట్టుకొంటుంది. ఆయనకు మేము సగౌరవంగా సప్రేమగా వీడ్కోలిస్తున్నాము.' అన్నది. శ్రీ టి ఆర్ వెంకట్రామ శాస్త్రియర్ అంతటి గొప్ప న్యాయవేత్త 'నేనెరిగిన ప్రధాన న్యాయమూర్తులందరిలోనూ డా. రాజమన్నార్ సర్వోత్తముడు' అన్నారు. కీ॥ శే॥ వి. వి. శ్రీనివాస అయ్యంగారికి కూడా రాజమన్నారును గూర్చి ఇటువంటి అభిప్రాయమే వుండేదట. మొట్టమొదటి

భారతీయ ప్రధాన న్యాయమూర్తి అని చెప్పి మద్రాసు హైకోర్టు ఆవరణలో వీరి బస్టుసైజు విగ్రహం ప్రతిష్ఠించారు. దీనిని డా. రాధాకృష్ణన్ ఆవిష్కరించారు. వీరి తర్వాత మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పదవిని స్వీకరించిన జస్టిస్ రామచంద్ర అయ్యర్ వీరిని గూర్చి వ్రాస్తూ 'రాజమన్నార్ గుణగణాదులను గూర్చి ఒక్కమాటలో చెప్పాలంటే సౌందర్యం—వాక్కులోను, భావనలోను, క్రియలోను అంతటా సౌందర్యమే' అని వ్రాకుచ్చారు.

## కళాప్రపంచం

కళాప్రియుడైన రాజమన్నార్ తమ న్యాయమూర్తి పదవి బెడదలనుండి తప్పించుకొని తరచు కళాప్రపంచంలో విహరిస్తూ వుండేవారు. మహాశిల్పి దేవీప్రసాదరాయచౌధురీవద్దకు వెళ్లేవారు. వీరిద్దరికీ ఒకరిపట్ల ఒకరికి అవగాహన, మైత్రీభావం కలుగడం కూడా వింతగా జరిగింది. వీరు ఆ మహాశిల్పిని కలుసుకున్నది న్యాయమూర్తి అయిన తరువాతనే. ఒక చిత్రకళాప్రదర్శనాన్ని ప్రారంభించడానికి రాజమన్నారు అంగీకరించారు. అది చౌధురిగారికి ఇష్టం లేదట. వీరు ప్రారంభోపన్యాసం ముగించాక ఇదరూ ప్రదర్శితమైన చిత్రాల్ని పరిశీలించడానికి హాలులోకి వెళ్లారు. శ్రీ రాజమన్నార్ ఒక్కొక్క చిత్రాన్ని విమర్శిస్తూ వచ్చారు. చౌధురీ విస్తుపోయి వీరిని సమీపించి క్షమాపణ కోరారట. ఎందుకో వీరికి అర్థం కాలేదు 'నేను నిన్ను అగౌరవంగా చూచాను. నీవు పెద్ద జడ్జివైతే కావచ్చుగాని కళాప్రపంచంలో నీకేమి స్థానం అని పరుషంగా అన్నాను. నేను పొరపడ్డానని ఇప్పుడు గ్రహించాను' అన్నారట చౌధురీ. అప్పటినుంచీ ఇద్దరూ ప్రతివారమూ కలిసి కళల విషయమై దీర్ఘచర్చలు సలిపేవారు. చౌధురీ హార్మోనియం వాయిస్తూ వుంటే పాడుకొనేవాళ్ళు. వీరికి ఉత్తరదేశపు హిందూస్తానీ సంగీతంపై అంత ఆసక్తి ఎలా కలిగిందా అని చౌధురీ అచ్చెరువొందేవాడు. చౌధురీ ఏదైనా శిల్పానికి తుది మెరుగులు దిద్దుతూవుంటే రాజమన్నార్ అక్కడికి వెళ్ళేవారు. చౌధురీ చిరునవ్వుతో వీరిని ఆహ్వానించి కుర్చీలో విశ్రమింపజేసి తమ పనిలో నిమగ్నులయ్యేవారు. ఇట్లా ఒకరి ఉనికిలో ఒకరు ఆనందం అనుభవిస్తూ గడియల పర్యంతమూ అలాగే వుండిపోయేవారట. చౌధురీ వీరి కాంస్యవిగ్రహాన్ని అత్యుత్తమంగా తయారు చేశారు.

కూచిపూడి నాట్యకళానిధి శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారికి మద్రాసు పురజనుల తరఫున సింహతలాటబహూకరణ జరుగగా రాజమన్నారు వారి చేతికి సింహతలాటము తొడిగి తమ పారితోషికంగా నూటపదహార్లు సమర్పించుకున్నారు. అప్పుడు వీరు ప్రధాన న్యాయమూర్తిగా వున్నారు.

రాజమన్నారుగారి జీవితంలో అనేక రచయితలతో, నటులతో, గాయకులతో చిత్రకారులతో, శిల్పులతో పరిచయం లభించింది. లలితకళల్లో వీరి వ్యామోహవ్యాసంగాలు సుప్రసిద్ధమైనవి. హావెల్, ఆనందకుమారస్వామి, విన్సెంట్ స్మిత్ గ్రంథాలు కూలంకషంగా చదివారు. ఎల్లోరా, అజంతాలు సందర్శించి 'కళ'లో సచిత్ర వ్యాసాలు వ్రాశారు. వీరి ప్రోత్సాహం పైననే మహాబలిపురంలోని ఒక్కొక్క శిల్పాన్ని ఫోటో తీయడానికి మద్రాసు లలితకళాఅకాడమీవారు పూనుకున్నారు. అజంతా చిత్రాలను, ఎల్లోరా శిల్పాలను తీర్చినవారు దేవాంశసంభూతులని వీరి నమ్మిక. రాజపుత్ర చిత్రలేఖనం కూడా వీరిని ఆకర్షించింది. మొగలాయీ చిత్రకళలోని వైశిష్ట్యాన్ని గమనించారు. రాగాలను, రాగిణులను చిత్రరూపంగా సృష్టించిన రాజపుత్ర చిత్రకారుల ప్రతిభ అత్యంత ప్రశంసనీయమనుకున్నారు. నవీన ఆంధ్రచిత్రకళారీతులను ఆకళింపు చేసుకున్నారు. వాత్స్యాయనమహర్షి 'కామశాస్త్రం' ఒక శాస్త్రగ్రంథమనీ, శాస్త్రగ్రంథం నీతిబాహ్యం ఎన్నటికీ కానేరదనీ, వాత్స్యాయన కామసూత్రాలను సెక్సు నవలల తరగతిలో చేర్చడం బుద్ధిమాలినతనమనీ వీరి అభిప్రాయం. పానంవారి నాటకాలన్నీ చూచారు. స్థానంవారి మధురవాణి పాత్ర అంటే వీరికి ఇష్టం. 1957 ఏప్రిల్ 6వ తేదీన స్థానంవారికి మద్రాసులో ఘనమైన సన్మానం జరిగితే ఆ సన్మానసభకు శ్రీ రాజమన్నార్ అధ్యక్షత వహించి సన్మానసంఘం తరఫున వారి ముంజేతికి కంకణం తొడిగి కాశ్మీరు శాలువకప్పి వెండి అశోకస్తంభం ఫలకం బహూ

కరించారు. తమకోసరం ఒక నాటకం వ్రాయమని వీరిని స్థానం వారు అడిగారట. 'కాని ఆ పనే చేయలేకపోయాన'ని నాతో కొంత అసంతృప్తితో అన్నారు.

## వీను మిగిలిన వక్త

శ్రీ రాజమన్నార్ 1960-61 లో మద్రాసు విశ్వవిద్యాలయంవారి అధ్వర్యాన జరిగిన సర్ జార్జి స్టాన్లీ ఎండోమెంటు లెక్చర్సులో 'రసవాదము' (Aesthetic Experience) ను గూర్చి మూడు ఉపన్యాసా లిచ్చారు. వాటిని ఆ విశ్వవిద్యాలయం ఒక పుస్తకంగా ప్రచురించింది. తమ కొనగబడిన విషయంపై ఎన్ని గ్రంథాలు అవలోకించి ఎంతటి పరిశీలన జరిపి ప్రాచ్యపాశ్చాత్య ఆలంకారికుల సిద్ధాంతాలను సోపపత్తికంగా చర్చించి తమ భావాలను ఏవిధంగా ప్రతిభావిశేషాలతో ఆవిష్కరించారో ఆ పుస్తకం చదివితే ఈ తరంవారికి తెలిసివస్తుంది. ఆ ఉపన్యాసాలలోని ఈ దిగువ వాక్యాలనుబట్టి వీరికి ఏ రసవాదము నచ్చిందో మనకు తెలియవస్తుంది. 'కవిత్వానికీ, నాటకానికేగాక చిత్రకళ,శిల్పము మొదలగు అన్నిరకాల కళారూపాలకూ ఏ రసవాద సిద్ధాంతం వర్తిస్తుందాఅని ఎల్లప్పుడూ నేను అన్వేషిస్తూవుండే వాడిని. ఏ కళారూపానికైనా వక్రతను గీటురాయిగా పెట్టుకోవచ్చునని గ్రహించాను. ప్రాచ్య, పాశ్చాత్య పండితులు రసవాదమునుగూర్చి, అలంకార విశేషములను గూర్చి చెప్పిన సిద్ధాంతాలనూ, వెలిబుచ్చిన అభిప్రాయాలనూగూర్చి ఆలోచిస్తూ వచ్చాను. ఈ విషయాలలో ఏదో ఒక సిద్ధాంతమును పట్టుకొని పిడివాదం చేయడం తగదు. ఒక రచయితకు లేదా ఒక కవికి ఒక సిద్ధాంతం ఇష్టమైతే, మరొకరికి వేరొక సిద్ధాంతం నచ్చవచ్చు నాకుమాత్రం కుంతకుని 'వక్రోక్తిజీవితం' అన్న సిద్ధాంతం మిక్కిలిగా నచ్చింది.'

1950 సెప్టెంబరు 2 వ తేదీన మైసూరు విశ్వవిద్యాలయం అధ్వర్యాన 'ప్రాచీన విజ్ఞానము— ఆధునిక పరిశోధన' అన్న విషయంపై వీరిచ్చిన శ్రీ కృష్ణ రాజేంద్రరజతోత్సవఉపన్యాసంలో యోగశాస్త్రమునుగూర్చి యోగాభ్యాసములనుగూర్చి సవిస్తరంగా చెబుతూ 'రామాయణ, మహాభారతముల కాలంలో విమానాలు, అటంబాంబులు వుండేవనీ, ఆ విషయాన్ని అంతా నమ్మాలని చెప్పేవారు మనలో వున్నారు ఇటువంటి వైఖరి ప్రాచీన భారత ప్రతిష్ఠకూ, నేటి తరం వారికి మేలుకన్న హెచ్చుగా కీడే చేస్తుంది. యోగమార్గం విశ్వశాంతికీ, విశ్వమానవ సౌభ్రాత్రమునకూ కారకమవుతుంది. ఆధునిక వైద్య విజ్ఞానవేత్తలు కేవలం శాస్త్రీకదృష్ట్యైనాసరే,యోగాసనములనుగూర్చి పరిశోధన జరుపడం అవసరమని భావిస్తాను. ఆధునిక పరిశోధనలను ప్రాచీనవిద్యలతో జతపరచి సత్యాన్ని కనుగొనవలెనని విజ్ఞప్తి చేస్తున్నాను', అని ప్రబోధించారు.

## అలంకరించిన పదవులు

సంగీతనాటక అకాడమీ 1953 లో నెలకొల్పబడింది. దానికి ప్రప్రథమ అధ్యక్షులు రాజమన్నారుగారు. ఆ సంస్థకు దాదాపు 8 ఏండ్లు అధ్యక్షులుగావుండి సంగీతం, నాట్యం, నాటకం, చలనచిత్రాలు—అను నాలుగు అంశములపై విద్వద్గోష్ఠులను జరిపించారు.

దక్షిణభాషాపుస్తకసంస్థకుసభ్యులుగా వున్నారు.

1964–65 లో నాల్గవ ఫైనాన్సు కమీషన్‌కు అధ్యక్షులుగా వున్నారు.

మద్రాసురాష్ట్ర లలితకళా అకాడమీకి వీరు మొదటి అధ్యక్షులుగావుండి ఆ రాష్ట్రంలో లలిత కళల అభివృద్ధికి ఎంతగానో కృషి చేశారు.

త్యాగబ్రహ్మ ఆరాధన మహోత్సవసభకు 14 ఏండ్లు అధ్యక్షులుగావుండి ఆ పిమ్మట అందులో రాజకీయాలు ప్రవేశించగా ఆ పదవికి రాజీనామా ఇచ్చారు. ఆ పదవిలో వున్నంతకాలమూ ప్రతిసంవత్సరమూ తప్పకుండా తిరువాయూరువెళ్ళి ఆ ఉత్సవాలలో పాల్గొని అవి ఘనంగా జరిగేట్టు ప్రయత్నించేవారు.

కొంతకాలం మద్రాసు విశ్వవిద్యాలయ సిండికేట్ సభ్యులుగా వున్నారు. ఆ విశ్వవిద్యాలయ శతవార్షికోత్సవములను జరిపిన కమిటీకి చైర్మన్‌గా వున్నారు.

హైదరాబాదులోని సాలర్జంగ్ మ్యూజియం ట్రస్టు బోర్డు మెంబరుగా వున్నారు. కళల విషయంలో వీరు ప్రవీణులని భారత ప్రభుత్వం వీరిని ఆ పదవికి నియమించింది.

ఆంధ్ర విశ్వవిద్యాలయం వీరికి డాక్టర్ ఆఫ్ లెటర్స్ అనే గౌరవ బిరుదమిచ్చింది. అన్నామలై విశ్వవిద్యాలయంకూడా అటువంటి గౌరవ పట్టమే వీరికిచ్చింది. మద్రాసు విశ్వవిద్యాలయం వీరికి డాక్టర్ ఆఫ్ లాస్ బిరుదమిచ్చి గౌరవించింది. హైదరాబాదువారు 'సాహిత్య ఆచార్య' బిరుదు ఇచ్చారు. వీరు మద్రాసు, అన్నామలై, ఆంధ్ర విశ్వ విద్యాలయాలలో స్నాతకోపన్యాసాలిచ్చారు.

ఇటీవల వీరు కొంతకాలం మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు నామినేటెడ్ మెంబరుగావుండి ఆ పదవికి రాజకీయాలలో నిమిత్తం వుంటుంది కాబట్టి రాజీనామా ఇచ్చేశారు. రాజకీయాలు, వాటితంతులు, తతంగాలంటే వీరికి మొదటినుంచీ ఇష్టం లేదు.

వీరికి 1952 లో భార్యా వియోగం కలిగింది. నలుగురు కుమార్తెలు. కుమారులు లేరు. వీరి తల్లిదండ్రులింకనూ భగవత్కృపచే సజీవులై ఆరోగ్యంగా వున్నారు.

ప్రస్తుతం వీరు విశ్రాంతి తీసుకొంటూనే కళింగ ఎయిర్‌లైన్స్ ఆర్గనైజేషన్ పని నిర్వహిస్తున్నారు. ఇండియన్ బ్యాంకుకు డైరెక్టర్‌గా వున్నారు. ప్రధాన న్యాయమూర్తి పదవీ విరమణచేసిన సందర్భంలో ఛలోక్తిగా 'నేను రిటైరు కాలేదు. రీ టైరు (Re tyre) చేయబడ్డాను. ఇందువల్ల ఇంకా ఉత్సాహంతో నా కప్పగింపబడిన పనులను నిర్వహించగలుగుతాను' అన్నారట. వారికి ఈనాటికీగల శక్తినీ, ఉత్సాహాన్నీ గమనిస్తే విశ్రాంతితోపాటు మనిషికి పనికూడా వుండవలెనని వారి భావమని విశదం కాగలదు.

శ్రీ రాజమన్నార్ జీవితం సుసంపన్నమైనది. జీవితంలో ఆయనకు కలిగిన అనుభవాలు వైవిధ్యమూ, వైలక్షణ్యమూ గలవి. ఇట్టి మేధావి, ప్రతిభా సంపత్తులు, కార్యదక్షతగల ఈ వ్యక్తి చరిత్రలో ఆంధ్ర మహాపురుషులలో ముఖ్యులుగా ప్రత్యేకంగా సదా స్మరింపబడతారనడంలో సందేహంలేదు. ఇరవయ్యో శతాబ్దంలో ఆంధ్రాభ్యుదయానికి కారకులైన గొప్ప వ్యక్తులలో చెప్పుకోదగ్గవారు.

---



# ఓ చెట్టూ - రెండే పువ్వులూ

శ్రీ గొల్లపూడి మారుతీ రావు

**నాటిక**

| | |
|---|---|
| రామానుజం | రాజు |
| చలపతి రావు | సత్యం |
| మాధవరావు | గీత |
| వేణు | సుగుణ |

## మొదటి రంగము

రామానుజం స్టేషను మాష్టరు. చలపతిరావు డ్రాయింగు మాష్టరు. అందువల్ల ఆ యిల్లు రైల్వే ప్లాట్‌ఫారంలా యిరుకుగా, స్కూలుగదిలాగ గజిబిజిగా వుంటుంది. ఆ యింట్లో కొందరు ఏదో పెద్ద రైలు ప్రయాణానికి సిద్ధపడ్డ ప్రయాణీకుల్లాగ, మరికొందరు రైలు తప్పిపోయిన—ప్రయాణీకుల్లాగా కనిపిస్తారు. చలపతిరావు జీవితంలో కళ లేదు. అతని కళ అంతా మనకు కనిపించే కేన్వాసులమీద రంగుల్లో యింకిపోయింది. అసలది గది కాదు. ఆ యింటిముందు నడవ. డబ్బున్న రోజుల్లో గోడలు ఎత్తుగా లేపి, విశాలంగా గది కట్టాలని వెనక నేలని ఎత్తు చేశారు. కాని తర్వాత కట్టడం పడలేదు. అందుకని మనకు కనిపించే నడవా వెనక భాగం ఎత్తుగా, ముందు భాగం పల్లంగా మిగిలిపోయింది. ఎదురుగ్గా కుడిమూలన ద్వారం. ఆ లోపలి భాగంలో చలపతిరావూ, ఆయన సంతానం వుంటున్నారు. ఎడమవేపు పెద్దవాటాలో రామానుజం నివాసం. కుడివేపు వీధిలోకి త్రోవ.

ఎత్తుగావున్న చపటావిూద గజిబిజిగా చలపతిరావు సరంజామా అంతా పడి వుంది. విరిగిపోయిన ఫ్రేములూ, ఒక బల్లమీద Pallete, బ్రష్‌లూ వున్నాయి. గోడకి ఒకటి రెండు పెయింటింగులూ, చిరిగిపోతున్న అందమయిన కేలండరూ వున్నవి. మంచి అభిరుచివుండీ, దాన్ని అమలు జరిపే శ్రద్ధా, తీరికా, స్తోమతూలేని జీవితం—ఆ చపటాలవిూద పరచబడి వుంది. అది చలపతిరావుది. ఎడమ మూలకి ఒక చిన్న బల్ల. పక్క ఈజీచైరూ, ఎడమవేపు—దిగువన గుమ్మంపక్కనే చేతులున్న కుర్చీవుంది. మధ్యన—ఎడమ వేపుకు తిప్పివున్న స్టాండుమీద ఒక కేన్వాసువుంది. తలుపులకి కర్టెన్లు లేవు. ఆ నడవకు ఎటువేపూ కిటికీలు లేవు. పూలమొక్కలూ; సోఫాసెట్లూ లేవు.

ప్రస్తుతం చలపతిరావు కేన్వాసుముందు నిలబడి అటువేపే చూస్తున్నాడు. చేతిలో బ్రష్ వుంది. వయస్సు ఏభై దాటింది. జుత్తు పండిపోయింది. అతనిలో కళాకారుడి లక్షణాలు ఏ కోశానా కనిపించవు. ముమ్మూర్తులా రిటైరైన స్కూలు టీచరులాగ వున్నాడు. పంచె, లాల్చీ—వాటివిూద శ్రద్ధలేదు. అవసరానికి కళని ఆధారం చేసుకున్నాడేకాని, కళని అవసరంగా చేసుకున్న జీవితంకాదు. నవ్వు అతని ముఖంవిూద అప్పుడప్పుడూ కనిపించి—బాధాతప్త జీవితంలో తియ్యని జ్ఞాపకంలాగు మెరుస్తుంది.

ఇప్పుడు గీత లోపలికి వచ్చింది—ఎదుటి గుమ్మంలోంచి. వయస్సు ఇరవై దాటదు. సన్నగా నాజూకుగా వుంది. పెద్దఆభరణాలూ లేవు—నిరాడంబరమైన అందంతప్ప. మనిషి ప్రశాంతంగా, నిండుగా వుంది.

లోపలికివచ్చి, కేన్వాసుముందు నిలబడ్డ తండ్రిని గమనించింది. మడత కుర్చీలోవున్న శాలువని అందుకుంటూ—

చల: రాత్రి యిక్కడే నిద్రపోయావా నాన్నా?

గీత : (చూసి) అవునమ్మా! పని పూర్తయేసరికి చాలా సేపైంది.

గీత : ఎంతవరకూ వచ్చింది?

చల : ఇదిగో, సాయంకాలానికి చెట్టు పూర్తవుతుంది.

గీత : అదేమిటో—అది వెయ్యాలనుకున్నప్పట్నుంచీ నీ మనస్సు సరిగాలేదు.

చల : (నవ్వి) కాదమ్మా. నా మనస్సు సరిగా లేనప్పుడే అది వెయ్యాలనుకున్నాను. కవిత్వంలో లాగే, చిత్రకళకీ 'బాధ' అవసరమేమో మరి.

గీత : (మనస్సు బాధపడింది.) బాధ ఎందుకు నాన్నా?

చల : రామానుజమూ ఇలాగే అడుగుతాడు. ఏ ఒక్క కారణం చెప్పాలా అని ఆలోచిస్తూంటాను.

(నవ్వుకొని కేన్వాసువేపు తిరగబోయి, ఆగి)

ఈ రాత్రయినా చిన్నన్నయ్య యిల్లు చేరాడా?

గీత : వచ్చాడు.

చల : ఎప్పుడూ? నేను రెండుదాకా మేలుకొనే వున్నానే!

గీత : ఎప్పుడొచ్చాడో నాకూ తెలీదు. ఇందాకా చూస్తే మంచంమీద వున్నాడు. నువ్వు కాఫీ తాగుతావా?

చల : ఇప్పుడే వద్దమ్మా.

(గీత లోపలికి వెళ్ళింది కాలువలో)

(చలపతి ఒక్క క్షణం కేన్వాసు చూసి బ్రష్ కడుగుతున్నాడు ఒక చిప్పలో.)

ఇప్పుడు వీధిలోంచి వేణు ఆయాసపడుతూ వచ్చాడు. చేతిలోపల కేన్ (Can) వుంది. వేణు ఎత్తయిన మనిషి. అందగాడు. మెత్తటివాడు. పైజామా లాల్చీ వేసుకొనివున్నాడు. అవి బాగా నలిగి వున్నాయి.

వేణు : (చలపతిని చూసి) నాన్న ఇన్నిమనుంచి వచ్చేశాడా మావయ్యా?

చల : ఇంకాలేదు వేణూ.

వేణు : అమ్మయ్య! బ్రతికించావు (కేన్వాసు దగ్గరికి వచ్చి) అప్పుడే చెట్టు అయిపోయిందే! వెరీ గుడ్!

(ఇటు తిరిగి చలపతిని చూశాక అనుమానం వచ్చింది.)

రాత్రి నిద్రపోయావా మావయ్యా?

చల : డాక్టరువి. నువ్వు ఎప్పుకో చూద్దాం.

వేణు : ఆర్టిస్టుల ముఖాలు చూసి మాటల్లో చెప్ప గలగడం డాక్టర్ల పనికాదు మావయ్యా—ఏక్టర్ల పని—నేను ఏక్టర్నికాను.

చల : పోనీ, నీ లాగ ఎప్పుడూ ఉత్సాహంగా నవ్వుతూ ఉండడానికి ఏదయినా మందు చెబుతావా?

వేణు : మరో సంవత్సరం పోనీ, ఇంకా మా చదువులు శరీరాలువరకే వచ్చాయి. చిరునవ్వుల వరకూ రాలేదు.

గీత : (చేతులు వెనక్కు వుంచుకొనివస్తూ) పోనీ నన్ను చెప్పమంటారా? డాక్టరుగారూ?

వేణు : ఏదీ చెప్పు చూదాం?

గీత : వంటింట్లో చేరి పెసరట్లు తయారు చేయడం నేర్చుకుంటే మంచి ఉత్సాహంగా వుంటుంది నాన్నా!

వేణు : ఏయ్ (మీదకి రాబోతే వెనక్కి దాచిన స్టెతస్కోపు చూపింది.)

గీత : అందుకు యిదే సాక్ష్యం. నిన్న అలమరలో మఱచిపోయి వచ్చావు.

వేణు : చూశావా మావయ్యా?

చల : (నవ్వుతూ) ఏమిటమ్మా అది?

గీత : నిన్న నువ్వు బావున్నాయని మరీ మరీ వేయించుకుతిన్న పెసరట్లు ఎవరు చేశారనుకున్నావు ఇదిగో—ఈ డాక్టరుగారే.

వేణు : (కోపంతో) అన్నీ నేనే చేశావా?

గీత : పోనీ కొన్ని (స్టెతోస్కోపు యిస్తూ) అబద్ధం అతికి నట్టుండడానికి మంచి మందు కని పెట్టండి పోనీ (జడ పట్టుకోబోతే తప్పించుకుంది) వీరా నాన్నగారొస్తున్నారు.

వేణు : (చూపి) మైగాడ్! నిజంగానే! (లోపలికి వెళ్ళాడు.)

ఇప్పుడు రామానుజం వచ్చాడు. అతనో గాలి దుమారం. స్టేషనులోనుంచి రైలు దూసుకుపోతూ

అంతలో జ్ఞాపకంవచ్చి ఆగినట్టుంది అతని ధోరణి. మనిషి బోళా. మంచి హృదయం. పెద్దగొంతు. బారు మీసాలూ, పొట్టినిక్కరూ, ఒదులు బనీనూ—చేతిలో టెన్నిస్ రాకెట్. సరిగ్గా చలపతి వయస్సే. వయస్సు ఒక్కదానిలోనే వాళ్లిద్దరికీ పోలిక. మిగతా అన్నిటిలో ఒకరికొకరు సరిగ్గా వ్యతిరేకం. ఉత్సాహంగా, నిండుగా, హఠాత్తుగా ఎదురయిన ఆనందాన్ని అను భవిస్తున్నట్టుగాక, కల్పించుకొని, తెలిసి సుఖపడు తున్న జీవిలాగ కనిపిస్తున్నాడు. మంచిశివి.

రామా: ఒరే చలపతీ— యివాళ—ఇన్నాళ్లకి టెన్నిస్‌లో ఓడిపోయానురా. భలేగమ్మత్తయిన ఆటలే. (గీతని చూసి) అమ్మా - వెళ్లి వేడివేడిఓవల్టిన్ నీ చేత్తో కలుపుకురా తల్లీ—ఉండుఉండు! మీా నాన్నకీ మరో గ్లాసు కలుపుకురా!

చల : నా కెందుకురా?

రామా : ఓహో! ఆతిథ్యాలు నీకు కిట్టవుకదూ? ఇవాళ నేను ఓడిపోయినందుకు పార్టీరా!

చల: వద్దులే. నువ్వెళ్లి వాడికి తీసుకురా అమ్మా (గీత వెళ్లింది. రామానుజంవేపు చూస్తూ) ఓడిపోతే సంతోష మేమిట్రా?

రామా : గెలిచిగెలిచి ఈ జీవితంలో విసిగిపోయాన్రా? ఉద్యోగంలో గెలుపు డబ్బు సంపాదించడంలో గెలుపు. టెన్నిసులో గెలుపు. ఆఖరికి పిల్లల్ని కనడంలో! మూడో బిడ్డని కనగలిగానా? పుట్టకుండానే తాయారు చచ్చిపోయింది.

చల: భలేవాడివిరా నువ్వు! కష్టంలో కూడ నవ్వ గలవు.

రామా : నువ్వో! నవ్వుని కష్టంగా మార్చుకోగలవు. ఒక్కమాట చెప్పు. అవి అంత అందమైన రంగులుకదా, వాటన్నిటినీ కలిపి ఎప్పుడైనా మమ్మల్ని నవ్వించావురా?

చల: జీవితం ఎలావుంటే, కళ అలా వుంటుంది.

రామా: అలాగా! అల్లారుముద్దుగా అపురూపంగా పెంచిన మగుణకి పెళ్లిచేసి ఇంటిదాన్నిచేస్తే రెండేళ్లు తిరక్కుండ ఇంటకి తిరిగొచ్చింది. నాకు ఏం సంతోషం ఉందని నేను నవ్వుతూ తిరుగుతున్నాను?

చల : అది అర్థం అయితే నేను జీవితంలోను, ఈ కేన్వాసుమీాదా బాగుపడేవాడినేమో! ఇద్దరం ఒక ఊళ్లో స్నేహం కలిపాము. ఒకచోట చదివాం. ఒక ఊళ్లోనే, ఒకేసారి ఉద్యో గాలు ప్రారంభించాం. కాని ఈ వేళ కూడా నేను నీ యింట్లోనే అద్దెకుంటున్నాను.

రామా : అదిగో! ఆ మాటే అనొద్దన్నాను. పోనీ నాకూ ఈ బొమ్మలు వేయడం నేర్పు నీకు జీతం యిచ్చుకుంటాను. అలాగయినా నీ అద్దె రుణం తీరుతుంది. బ్రదర్! బంధువుల్ని భగవంతుడే మన నెత్తిన రుద్దుతాడట! కాని స్నేహితుల్ని మనకు మనమే ఎంచుకొనే అవకాశాన్ని వదిలేశాడు. నిజం చెప్తున్నాను— నువ్వు ఆడదానివైవుంటే నేను తాయార్ని పెళ్లిచేసుకునేవాణ్ణికాదు. (పగలబడి నవ్వాడు. చలపతికీ నవ్వొచ్చింది. గీత ఓవల్టిన్ తెచ్చింది.)

రామా : (అందుకుని రుచి చూసి) బాగా కలిపా వమ్మా! రోజూ నీచేత ఓవల్టిన్ రుచి చూడ డానికయినా మా యింటి కోడలిగా చేసు కుంటాను.

చల : నేను............

రామా :నువ్వు నోరుముయ్యిరా. కాదంటే నువ్వూ ఈ అమ్మాయితోపాటు మా యింటికేవచ్చి వుండు. నాకేం అభ్యంతరం లేదు.

గీత : ఇప్పుడు లేకపోలేకదా మావయ్యా?

రామా: ఉండడం అంటే యిలాగా! ఇలా ఉండి ఏం లాభమమ్మా! మా యింట్లో కాఫీ ముట్టడు. భోజనం చెయ్యడు. నే నిచ్చే పళ్లు తినడు. ఈ కుర్చీలో నేను ఓవల్టిన్ తాగుతుంటే, వాడక్కడ కాఫీ అయినా లేకుండా బొమ్మలు గీస్తూంటాడు. (అటుతిరిగి) ఒరే! లేవాక కాఫీ తాగావురా?

చల : లేదింకా.

రామా : చూశావా? నే చెప్పలా?

గీత : ఇవ్వడం చేతకాని చోట పుచ్చుకోకూడదని నాన్న భయం మావయ్యా!

రామా : ఇలాంటి వెధవ ఆలోచనలు పెట్టుకొనే-ఇవ్వ గలిగిన రోజుల్లో—ఆ రోజుల్లో—వీరా అన్న య్యని మా సుగుణకి యివ్వలేకపోయాడు, అంతకంటే నాకేం కావాలమ్మా! అప్పుడా శుభ కార్యం జరిగివుంటే మా సుగుణ యిలా వుండేదా?

(కంఠంలో వణుకు దుఃఖం ధ్వనించింది.)

చల : మంచి చెప్పబోయి ఆ రోజు నొప్పించాను. చెడు జరిగిందని ఈ రోజు నొప్పించలేక పోతున్నాను. అంతా దురదృష్టం!

రామా : చూశావామ్మా! కష్టం నాదీ, దుఃఖం వాడి దీను. ఇంత చెప్పినా నేనేడ్చానా? అప్పుడే వాడి కన్నీళ్లు చూడు. వీడు ఆడదయి పుట్టవల సిందమ్మా! —సరేగాని—నువ్వెళ్లి వాడికి కాఫీ పట్రా!

(గీత లోపలికి వెళ్లింది)

రామా : (రాకెట్ టేబిలుమీద వుంచి, ముఖుకుల మీద కూర్చుని) ఆకుపచ్చరంగు అయిపోయి నట్టుందే!—

చల : ఫరవాలేదు. కలిపితే సరి.

రామా : ఉండు నేను కలుపుతాను—(కూచున్నాడు).

చల : (ఆగి) అల్లుడు బుద్ధి పాడయిందట రామానుజం.

రామా : అంటే—పిచ్చెక్కిందా?

చల : అదే కాస్త నయం—తప్పతోవపట్టి, ఎవరినో...

రామ : ఓస్. అంతేనా?

చల : అంతేనా! ఎంత సులువుగా అనేశావ్!

రామా : అనక! నీతోపాటు ఏడవమంటావా? ఆకుపచ్చ రంగయిపోతే రెండు రంగులు కలిపి దాన్ని సంపాదించుకోవడానికి ప్రయత్నిస్తున్నావ్. కట్టుకున్న పెళ్లాం, పెళ్లయిన దగ్గ ర్నుంచీ రోగం ఏదో తెలీక ఆసుపత్రి లోనే వుంది. వయస్సులోవున్న కుర్రాడు. ఈ చిరాకు, చీదర నుంచి తప్పించుకొందుకయినా చిరునవ్వు కనిపించే చోటుకి వెళ్లివుంటాడు. తప్పేం? వెళ్లకపోతే అతనికి పిచ్చెత్తుతుంది. అసలు వెళ్లమని నేనే సలహా యిచ్చేవాణ్ని— ఆ మాట కొస్తే—

చల : నీదంతా విచిత్రంరా. నీతో చెప్పడమే నా తప్పు.

రామా : భాయ్! నీ బాధేమిటో తెలిసిగా నా కర్థ మవుతోంది. ఒకరి తప్పు లెన్నడం ప్రారం భిస్తే—చివరికి ఆ తప్పు మన దగ్గరికే వచ్చి ఆగుతుంది. అసలు అలాంటి అల్లుణ్ణి ఎందుకు తెచ్చుకున్నావ్?—డబ్బుపోసి మంచి అల్లుణ్ణి కొనుక్కొనే స్తోమతులేదు. పోనీ అమ్మాయి ఆరోగ్యం ఎందుకు బాగుండలేదు?— పది పురుళ్లలో ఆరోగ్యం చితికిపోయిన తల్లి కడుపున పుట్టింది. దక్కింది ఆరుగురే అయినా, ఆరో బిడ్డకి దక్షత లేకుండా తల్లి కన్ను మూసింది. ఈ లోకంలోకి తెచ్చి నందుకు ఆ అమ్మాయికి ఏమిచ్చావు? అనా రోగ్యం, ఆసుపత్రిలో మంచం—అసమర్థు డైన భర్త. అక్కడికీ వాడు సమర్థుడే అంటాను. రోజూ ఆసుపత్రికి క్యారేజయినా తీసుకువెళ్తున్నాడు—(ఇటు తిరిగి) అదిగో మాట కదిపితే కన్నీళ్లు.

చల : నే నేడవడం లేదురా!

రామా : అదే కాస్త నయం. తప్పు అనుకుంటున్నా వని యివన్నీ కదిపాను. రైటు అనుకుంటే ఆలోచనే అవసరంలేదు. ఒక్కటే మాట— చూడు చలపతీ! 30 ఏళ్లు స్టేషను మాష్టరుగా నేర్చుకున్నదేమిటి? విజిల్‌వేసిన తర్వాత కదిలే రైలునీ వెయ్యకముందు టేబిలు మీద కదలని ఫైళ్లనీ మరిచిపోవడం నేర్చు కున్నాను. విజిల్‌వేసేవరకే నేను గవర్నమెంటు

ఉద్యోగిని—రైలు కదిలిపోయిందా—ఆ తర్వాత నేను 'వేను.'

చల : (తెల్లబోయి చూస్తే)

రామా : సమయానికి బాధ్యతల్ని గుర్తించనివాడే అవి నెత్తిన పడ్డాయని ఏడుస్తాడురా. ముందు గుర్తించకపోవడ మెంత తప్పో, తర్వాత ఏడవ డమూ అంతే. నాకు పెయిన్సులాగే నీకు ఈ బ్రష్ వుంది. ఇద్దరం జీవితపు సాయం సంధ్యలో నిలబడ్డాం. కాసేపు జీవితాన్ని మరిచిపోదాం—ఇక నెలాగూ దాన్ని మార్చలేం గనక. ఏమంటావు?

చల : ఎప్పుడు భయపడ్డా, బాధపడ్డా ఆలోచనల్తో ఉక్కిరిబిక్కిరి చేస్తావు. సరేలే.

(గీత వచ్చింది.)

రామా : వినా వాన్నకి కాఫీ యిచ్చి వాడికి వేడి వేడి నీళ్ళ స్నానానికి సిద్ధం చెయ్యమ్మా—స్నానం చేసివచ్చి మహాద్భుతంగా పెయింటింగ్ ప్రారంభిస్తాడు.

(నవ్వి లోపలికి నడిచాడు విజిల్ వేసుకొంటూ)

గీత : (కాఫీ యిస్తూ) చూస్తుంటే వేణూకంటె మావయ్య చిన్నవాడయి పోతున్నట్టనిపిస్తుంది వాన్నా. నువ్వు త్వరగారా. వేన్నీళ్ళు కాగాయి—స్నానానికి నీళ్ళు పెడతాను.

చల : అలాగే నమ్మా!

(గీత లోపలికి వెళ్ళబోతూంటే మాధవరావు తలతుడుచుకుంటూ వచ్చాడు. వయస్సు ముప్ఫై పైన. వయస్సుకిమించిన అనుభవం సంతరించుకున్న ముఖం. మాట చాలా తీపి. సులువుగా కోపం తెచ్చుకోడు. అనవసరంగా మాటతూలే తరహాకాదు)

మాధ : అబ్బ! పొద్దుటే వేన్నీళ్ళతో స్నానంచేస్తే ప్రాణానికి హాయిగా వుంది.

గీత : (ఆశ్చర్యంగా) ఆ పొయ్యిమీద వేన్నీళ్ళు—

మాధ : (అందుకొని) బాగా కాగాయమ్మా! అలసటగా వుంటేనూ నిబ్బరంగా స్నానం చేశాను.

గీత : అవి వాన్నకి.

మాధ : మళ్ళీ పెట్టమ్మా!—ఏం పోయిందీ?—పోనీ నన్ను సాయం చెయ్యమన్నావా?

గీత : (కోపం, అసహ్యం) అక్కరలేదులే.

మాధ : ఆ—అన్నట్టు—నిన్న పద్మ మంచంపక్క కూచొని కునికిపాట్లు పడుతుంటే డాక్టరు చూసి, 'ఏమిటే నువ్వు నీరసంగా వున్నావు? ఏదైనా పుచ్చుకో బలానికి' అన్నాడు. నా కివాల్టి నుంచీ పద్మతోపాటే హార్లిక్సు కలిపి స్తుండమ్మా—

గీత : చక్కెర అయిపోయింది బావా?

సత్యం : (అప్పుడే లోపలికి వస్తూ) మరేం ఫర్వా లేదు. పద్మతోపాటు గ్లూకోజ్ వేయించు. బావ ఆరోగ్యానికి చాలా మంచిది.

మాధ : సత్యం ! నువ్వెప్పుడొచ్చావోయ్.

సత్యం : నీ ఆరోగ్యం బాగుండలేదని రాత్రి నిద్రలో కలవరిస్తున్నప్పుడు. చాపల్ స్ట్రీట్‌లో పద్నాలుగో నంబరు యింట్లో ఆరోగ్యం బావుందా బావా?

చల : సత్యం ! ఏమిటా మాటలు పెద్దా చిన్నా లేకుండా ! పద్మకి ఎలా వుంది బాబూ !

మాధ : ఎలా వుంటుంది?—రోగం ఏమిటో తేల్చ లేకుండా వున్నారు డాక్టర్లు.

సత్యం : నీకుమాత్రం నీరసమని సులువుగా కని పెట్టేశారే !

మాధ : నీ జబ్బుకూడా కుదర్చగలరు బావా! నువ్వు కూడా ఆసుపత్రిలో చేరకూడదూ? ఉద్యోగం లేదన్న బాధలేదు. రెండు పూటలా భోజనం పెడతారు—మా అన్నయ్య రావడంలేదని మాటి మాటికీ పద్మ గుర్తు చేసుకుంటూంటుంది. ఆ కోరికా తీరుతుంది.

సత్యం : నీ సలహాకి థాంక్సు బావా. ఉచితంగా భోజనం పెట్టే వసతి మరోచోటకూడా వుంది—నీకు తెలుసో, లేదో!

మాధ : ఏమిటది?

సత్యం : జైలు - అవసరమైతే అక్కడికి యిద్దరం కలిసే వెళ్దాంలే.

చల : సత్యం !

సత్యం : బావ ఆరోగ్యానికి హార్లిక్సుకన్నా పళ్లరసం మంచిది. సాయంకాలం ఓ బుట్ట పళ్లు తెప్పించండి.

(విసురుగా లోపలికి వెళ్లాడు)

చల : వాడికి వయస్సు వస్తున్నా బుద్ధి పెరగలేదు. నువ్వేం అనుకోకు బాబూ !

మాధ : అబ్బే ! దానికి మీరేం చేస్తారు? ప్రతిసారీ అనుకుంటేమాత్రం పెరుగుతుందా? అయినా ఒకటా, రెండా? ఇంకా యిక్కడ ఎన్నాళ్లు వుండాలో?—ఆఁ. కోపంలోఅన్నా సత్యం అన్న మాట సత్యమే. సాయంకాలం నాకూ పళ్లు తెప్పించండి.

చల : అలాగే. మరి నీ శలవు పొడిగించావా? -

మాధ : ఇక ఆ శ్రమ ఏమీలేదు మావగారూ—విన్ననే ఉత్తరం వచ్చింది ఆఫీసునుంచి. నా ఉద్యోగం తీసేశారు.

చల : తీసేశారా?

మాధ : తీసెయ్యక?—భార్యకు సేవలు చెయ్యడానికి—మీకులాగ పెన్షను యిస్తారా ఏమిటి? అయినా యిదీ మంచిదే అనుకోండి—నిశ్చింతగా పద్మని చూసుకుంటూ వుండొచ్చు. మీకూ తోడుగా వుంటాను. మీకుమాత్రం ఎవరున్నారు? ఏమంటారు?

చల : నిజమే నాయనా! అలాగే కానీ!

మాధ : (ఏదో జ్ఞాపకం వచ్చినట్టు) చూడండి. ఎప్పటికప్పుడు చెప్పాలనుకుంటూ మరచి పోతున్నాను. మీరు మీ ఆర్టు వర్కుని చాలా అశ్రద్ధ చేస్తున్నారు. యిలా అయితే నా అవసరాలు తీరేదెలా చెప్పండి? అప్పుడే పది రోజుల్నుంచీ కిళ్లీకొట్టువాడు ఒకటే యాగీ చేస్తున్నాడు.

చల : లేదు బాబూ, నే నశ్రద్ధ చెయ్యడం లేదు. రాత్రి వేద్దామనే కేన్వాసుముందు కూర్చున్నాను. కాని...కాని...రెండో అమ్మాయి గుర్తుకొచ్చి—

మాధ : ఎవరూ? ఓహో, లలితా! బాగుందండీ—మీ సమక్షంలోనే మీ అమ్మాయినిప్పించి—మీ మంచి చెడ్డలు చూస్తున్న అల్లుణ్ణి మరిచిపోతున్నారూ?—ఇదేం న్యాయమండీ!

చల : ఎంతకోపం తెచ్చుకున్నా కూతురే కదా!

మాధ : ఆ మాట ఆవిడా అనుకోవాలిగా? - మా నాన్న నాకేం యిచ్చాడని గునిసే అమ్మాయి కూడా ఒక అమ్మాయేనా?

చల : నాకు స్తోమతులేదు యివ్వలేకపోయాను.

మాధ అవునులెండి. మీరుమాత్రం ఎన్ని పెళ్లిళ్లని చేస్తారు? చదువున్నా ఉద్యోగంరాని కొడుకులూ, ఉద్యోగంఉన్నా చదువురాని కొడుకులు చేదోడు అయారు.

సత్యం : (వస్తూ) అందుకనే యింటి అల్లుడివి చేదోడు వాదోడుగా ఉండడానికి సకుటుంబంగా వచ్చి మకాం వేశావు. ఒక మంచి కథ చెప్పనా బావా? మా మిత్రు డొకడుండేవాడు. అతనికి మరొక మిత్రుడుండేవాడు. అనాథ శరణాలయం స్థాపిస్తున్నాం, ఏదైనా సహాయం చెయ్యమని ఈ మిత్రుడు వ్రాస్తే—ఇద్దరు అనాథల్ని పంపించాట్ట అతను. తువాలుకోసం వచ్చాను. (అతని భుజంమీద తువాలు చర్రున లాక్కుని) ఇక నాన్నగార్కి నీ నీతి బోధ కానియి.

మాధ : (అతను వెళ్లినవేపే చూస్తూ) పాపం!—బావ ఎంత పాడయిపోయాడు. చెప్పొచ్చేదేమిటంటే—ఇలాంటి వాళ్లున్నందుకు మీకీ 'కళ' చేతిలో వుంది కనక—

చల : అలా అంటావుకానీ—నాదీ ఒక కళేనా? సగం మనస్సుతో గీసిన బొమ్మలూ బొమ్మలేనా? వీటిని నువ్విలా డబ్బు చేస్తున్నావో నాకివాళ్టికీ ఆశ్చర్యమే! ఏదో నువ్వు పట్టుపడుతున్నావని.

మాధ: అహ! అలాంటి సందేహం మీకువద్దు. మీ చిత్రాలంటే—కేవలం మీ చిత్రాలంటేనే అభిమానంగల ఒక రసికుణ్ణి సంపాదించాను. మీ చిత్రాలనుచూసి మురిసిపోతూంటా డాయన. డబ్బా, ఫరవాలేదనుకోండి—ఏదో గిట్టుబాటవుతోంది.

చల: (నవ్వి) అపసరార్థం గీసిన బొమ్మల్లో అన్ని అర్థాలు వెదికే అతన్ని ఒక్కసారి చూడాలని వుంది మాధవరావు.

మాధ: అలాగే, అలాగే—! అవకాశం వచ్చినపుడు అలాగే చూపిస్తాను. ఆఁ. నా హోటలు ఖాతా కూడా పెరిగిపోయింది. ఇంతకీ విన్నటి పెయింటింగ్ అయినట్టేనా?

చల: ఆఁ! (నిరుత్సాహంగా, ఆసక్తి రహితంగా) ఆ మూల వుంచాను.

మాధ: (తీసి చూసి) భేష్! అద్భుతంగావుంది. మంచిబేరం కుదురుతుంది. (స్టాండుమీద వున్న కేన్వాసువేపు చూస్తూ) ఇదీ త్వరగా పూర్తిచెయ్యండి.

చల: (విప్రాణంతో) ఇది పూర్తిచెయ్యడానికి నా దగ్గరున్న సామగ్రి చాలదు బాబూ!

మాధ: (ఉలిక్కిపడ్డట్టు తిరిగి) ఏమిటీ! మొన్న తెచ్చిన ట్యూబ్‌లు అన్నీ అయిపోయాయా? ఇలాగయితే...........

చల: (మధ్యలోనే అడ్డొచ్చి) రంగులు చాలు. కాని బాధలూ, దుఃఖాలూ చాలవు. వాటిని ఎవరైనా కల్పించాలి.

మాధ: అదా! (చాలా మామూలుగా) అందుకు మీ అబ్బాయి వున్నాడు లెండి. ఉండండి పిలుస్తాను. సత్యం! (పిలిచాడు.)

సత్యం: (వచ్చాడు. ఇప్పుడు బట్టలు మార్చుకుని వున్నాడు.) ఏం?

మాధ: చూడు సత్యం మీ నాన్న కేదో కావాలట.

సత్యం: నువ్వు యివ్వలేనిది నా దగ్గరేముంది బావా?

మాధ: (మాటిగా) అహ! ఇది నువ్వొక్కడివే యివ్వగలిగిందిలే.

(అతని భుజంమీదఉన్న తువాలు లాక్కుని సూటిగా లోపలికి వెళ్లాడు.)

సత్యం: ఏమిటి కావాలి నాన్నా?

చల: (కోపం ఉదాసీనత) బాధలు, కష్టాలు. ఎందుకురా మీ యిద్దరూ అలా కరుచుకుంటారు?— ఈ ఇంటికి పెద్దవాణ్ణంటూ నే నొకణ్ణి ఉన్నానుగా? నేను చచ్చాక అతన్ని, అక్కయ్యనీ బయటకు వెళ్లగొడుదువుగానిలే.

సత్యం: అంతవరకూ అక్కయ్యని ఈయన బ్రతకనిస్తే—

చల: సత్యం! (సత్యం అతన్ని కానట్టు చేతులు మడత పెట్టుకుంటున్నాడు.) నా ముఖం చూసి నిజం చెప్పరా!— ఈ నాలుగు రోజులూ ఎక్కడున్నావ్? నిన్న అంతరాత్రిలో ఎక్కణ్ణుంచి వచ్చావ్?

సత్యం: (తలెత్తి, నిదానంగా) స్మశానంనుంచి. ఉద్యోగాలుచేసి, ఊళ్లేలుదామని కలలుగన్న ఒక చిన్ననాటి స్నేహితుడు చచ్చిపోయాడు. అదృష్టవశాత్తూ వాడు పెళ్లిచేసుకోలేదు. వాడు పాపం—బి. ఏ. చదువుకున్నాడు. లేకపోతే నాలాగ ధైర్యంగా నాలుగు కాలాలపాటు బ్రతికే వాడు. ఈ నాలుగు రోజులూ వాడు చావుకి ప్రయత్నం చేస్తూంటే—ఆ వినోదం చూస్తూ కూర్చున్నాను.

చల: (ఇది విని కదిలిపోయాడు.) ఒక్కొక్కప్పుడు నువ్వు నిజం చెపుతున్నావో, అబద్ధం చెపుతున్నావో అర్థంకాదు.

సత్యం: అంత సందేహంవస్తే అది నిజమే నాన్నా— నిస్సందేహంగా, అతికినట్టు కనిపించేదే అబద్ధం—అక్కయ్య జబ్బులాగ.

చల: ఒరేయ్! మనస్ఫూర్తిగా ఉద్యోగానికి ఎప్పుడయినా ప్రయత్నం చేశావురా?

సత్యం: నాకు ఉద్యోగం చెయ్యడానికి సరిపోయే చదువు చెప్పించావా నాన్నా—ఉద్యోగులదగ్గర ఊడిగం చెయ్యడానికమనుకున్నాను.

చల : సత్యం!

సత్యం: ఎల్లాయి చేసిన కంపెనీల జాబితాలతో జేబులు నిండాయి. ఉద్యోగం యిచ్చే జీతం రాళ్లతో కాదు.

చల : మరియిలా చలవ బట్టలు వేసుకొని ఊరంతా బలాదూరు తిరగడానికి సిగ్గు లేదూ?

సత్యం: సిగ్గా! (ఆ మాట జీవితంలో మొదటిసారి విన్నట్టు) ఆ మా ఎప్పుడో చిన్నప్పుడు విన్న గుర్తు. అయినా ఆ యింటి కొడుగ్గా పుట్టి నందుకే సిగ్గుపడలేదు నేను. ఈ యింటి అల్లుడిగా పుడితే—చలవబట్ట లేకాదు— చలవ కళ్లజోడుకూడా పెట్టుకు—నువ్వు చెప్పావే— అది లేకుండా హాయిగా తిరగ్గలిగే వాడిని.

(సరిగ్గా అదే సమయానికి ఇస్త్రీ బట్టలు, చలవ కళ్లద్దాలతో లోపల్నుంచి వచ్చాడు— మాధవరావు.)

ఏం బావా?

మాధ: ఏమిటది ?

సత్యం: మా నాన్న నా దగ్గర సిగ్గులేదా అని అడిగితే నీ దగ్గర ఉందేమోనని అడిగాను. ఎలా వుంటుందిలే; కొత్త బట్టలుకదా? కోట్ హాంగర్‌కి తగిలించి మరిచిపోయి వుంటావు.

మాధ : ఏమిటి?

సత్యం: సిగ్గు—(మాధవరావు తికమకపడితే) మరేం బాధ లేదులే—ఈ ఇంట్లో దాని అవసరం ఎవరికీ లేదులే (బట్టలు ముట్టుకు చూసి) ఓహ్! వండర్‌ఫుల్! మల్లెపువ్వుల్లాగ వున్నాయ్—ఎక్కడ వాష్ చేయించావేమిటి?

మాధ: బజార్లోనే

సత్యం : స్టీమ్ లాండ్రీ (డ్రై చెయ్యి బావా—మరీ ఫస్టుగా వుంటాయి. ఓ రూపాయి ఎక్కువయినా భయం లేదులే. మా నాన్న మరో పెయింటింగు ప్రారంభించాడు.

మాధ : (మావగారితోనే) వస్తానండి.

చల : ఆసుపత్రికేనా ఏమిటి ?

మాధ : కాదండి. ఊళ్లో చిన్నపనుంది.

సత్యం : చూడు బావా! ఈ మాటు ఆసుపత్రికి వెళ్లినప్పుడు రోగం యిప్పుడే తగ్గకుండా జాగ్రత్తపడమని డాక్టర్లకి చెప్పు. పండగల సీజను—తగ్గి మీ ఊరు వెళ్లిపోతే యిక్కడి పిండివంటలూ, కొత్తబట్టలూ Miss అవుతావు.

మాధ : (నవ్వి, ప్రశాంతంగా బుజంతట్టి) కుర్రవాడివి—నువ్వెన్నన్నా, నాకు బాధ లేదోయ్. దేవుడిలాంటి మావగారి మొహం చూసి ఊరుకుంటున్నాను. (అనేసి వెళ్లిపోయాడు.)

సత్యం : చూశారా నాన్నా—తన దగ్గరకూడా సిగ్గు లేదని బావ ఎంత బాగా నిరూపించాడో—

చల : సత్యం ! ఎందుకురా యిలా తయారయావు ఆఖరికి?

సత్యం : (కాలుమీద కాలు వేసుకుని ఆడిస్తూ) చెప్పుకోండి చూదాం.

చల: (కోపం, ఉదాసీనత) నేను వెధవని—అందుకనేనా?

సత్యం : అది మీరు తేల్చుకోవలసిన విషయం.

చల : నేనే నువ్వయితే యిలాంటి కొడుకుని నువ్వేం చేసేవాడివిరా?

సత్యం : (లేచి, తండ్రిని సూటిగా చూస్తూ) నేనే నువ్వయితే నిన్ను నేను కనేవాణ్ణికాదు. అర్థమయిందా? (లోపలికి వెళ్లబోతూ, ఆగి) నీకు జ్ఞాపకంవుంటే—పెద్దచెల్లాయి ఇంట్లోంచి చివరిసారిగా వెళ్లిపోతూ ఈ మాటే చెప్పి వెళ్లింది.

(లోనికి వెళ్లబోతూండేసరికి వీథిలోంచి మాధవరావు వచ్చాడు.)

మాధ: సత్యం!

సత్యం: వేళకానివేళ—దాని అవసరం ఏముంది బావా నీకు?

మాధ: నాకు కాదయ్యా—ఓ అందమయిన అమ్మాయి—చాలా ధనవంతురాలు కూడాను—ఆవిడకు సత్యం అవసరం వుందట. దాదాపు లక్ష రూపాయలు విలువచేసే కారులో.........

సత్యం: దాంట్లో నలభయ్యో వంతయినా ఖరీదు చెయ్యని ఓ నిరుద్యోగికోసం వచ్చింది. అంతేనా? (వీధి గుమ్మందాకావచ్చి) అలా! వస్తున్నా—'వన్ మినిట్' (మాధవరావుతో) నీకు తెలుసుకోవాలనుంటే సత్యం విలువ చాలా ఎక్కువ బావా! (బయటకు వెళ్లబోతూ ఆగి) అన్నయ్య ఊరినుంచివస్తే చెప్పండి—రేపటికి 64 రూపాయలు కావాలి.

చల: ఎందుకు?

సత్యం: ఏడు కంపెనీలలో ఏజెండరు పోస్టుకి అప్లికేషన్లు పంపడానికి (మాధవరావు వెళ్లబోతే) అలాంటి ఉద్యోగంచేసే ధైర్యంఉందా బావా?—వద్దులే — అనువ్రతికి కేరేజీలు తీసుకువెళ్తాండు—ఇప్పటికి అది చాలు—వస్తా.

(బయిటికు వెళ్లాడు. అతని వెనకనే మాధవరావూ బయిటికి నడిచాడు. చలపతిరావు నిశ్చేష్టుడై అటువేపే చూస్తూ కూర్చొన్నాడు చాలా సేపు. లేవబోయేసరికి బయిట పోస్టు అన్నకేక వినిపించింది. రెండు ఉత్తరాలు లోపలపడ్డాయి. చలపతి లేచేలోగానే ఊదురు గాలిలాగ రామానుజం వచ్చాడు.)

రామా: వస్తున్నా (వచ్చి రెండు ఉత్తరాలూ అందుకుని, చూసి) ఇది నీకురా—ఇది ఒరేయ్!—ఇది మా సుగుణ దగ్గర్నుంచే!! (ఆతృతగా విప్పుతున్నాడు.)

చల: (ఉత్తరం అనాసక్తంగా చేతోపెట్టుకొనే) పదిమంది పిల్లల్తో ఇల్లు కళకళలాడాలనుకోవడం తప్పురా?—(ఎటువేపో చూస్తూ అడిగాడు.)

రామా: (ఉత్తరంవేపేదృష్టి)తప్పే—ఏమయిందిప్పుడు?

చల: ఏమీ లేదు. ఆ మాటే సత్యం అని వెళ్లాడిప్పుడు.

రామా: నే చెప్పలా—వాడు చాలా తెలివయిన కుర్రాడు. నువ్వు పదిమంది పిల్లల సంగతే చూశావు. కాని వాళ్ల కళకళలాడుతూ బ్రతగ్గలరా అని చూడలేదు. (ఉత్తరం యిప్పుడువిప్పి, చదివి) ఒరేయి, సుగుణ బి. ఏ. పరీక్షలన్నీ బాగా వ్రాసిందటరా—12 వ రైలెక్కుతోందట. అంటే—(కేలెండరు చూసి)ఇవాళే! వచ్చేస్తుందన్నమాట—(ఇప్పుడు చలపతి చేతిలో ఉత్తరంచూసి) నీ ఉత్తరం ఎక్కణ్ణుంచి?

చల: ఏమో—చూడు.

రామా: ఇలాతే (ఉత్తరంచూసి) మీ చివరి వాడి దగ్గర్నుంచిలా వుందిరా—డ్రాయింగు మాష్టరు కొడుకుకదూ!—ఒక్కొక్క అక్షరం ఒక్కొక్క బొమ్మలాగ చెక్కాడు—ఏం రాశాడో!—(చించి చదివాడు) 'నీ ఆరోగ్యం బాగాలేదన్నావు. విచారించాను. నన్ను రమ్మన్నావు. బ్రతకడానికే జీతం చాలడం లేదు. ఇక ప్రయాణానికి ఏం సరిపోతుంది?'—గొప్ప Joke రా! నీ కొడుకులంతా humourous boys.

చల: వాడికీ నా అసమర్థతమీద కోపమే.

రామా: (ఆ దృష్టే లేదు). భలే! కొత్త స్టాంపు అంటించాడే!

చల: నీకీ వయస్సులో స్టాంపుల పిచ్చేమిట్రా?

రామా: నాక్కాదు మీ మనవడికి—

చల: (తలెత్తాడు) ఎవరికీ?

రామా: ఆదే—మీ రాజా కొడుకు—నేను పోస్టు మాష్టర్ని అనుకున్నాడు కాబోలు—కొత్త స్టాంపులు కావాలన్నాడు. మొన్న హైద్రాబాదు వెళ్లినప్పుడు అలా మీ మనవణ్ణి చూసివచ్చా

మరే. మనలాటి ముసలాళ్లకి యిదో కొత్త హాబీ. ఉండు. కత్తిరించుకునొస్తాను. (వెళ్ల బోతూ ఆగి) ఆఁ. అన్నట్టు, బట్టలు మార్చుకు సిద్ధంగా వుండు. సుగుణని తీసుకు రావడానికి స్టేషనుకి—వెడదాం.

(వెళ్లిపోయాడు)

గీత : (తువాలుతోవచ్చి) ఏమిటి నాన్నా – నీకని పెట్టిన నీళ్లు ఇప్పటికి యిద్దరు స్నానం చేశారు. నువ్వెంతకీ కదలవు. పద మరి.

చం : (ఆమెవేపు చూసి) అవునమ్మా! నేను ప్రారంభించాలనుకున్న పనిని అందరూ పూర్తిచేస్తున్నారు. నేనుమాత్రం చెయ్యలేకపోతున్నాను. వేళమించిపోయింది—పదమ్మా స్నానమయినా చేస్తాను. (లోపలికి నడిచాడు)

(తండ్రి బ్రష్‌లూ, సామాన్లూ సర్దుతోంది. సర్దుతూ కేన్వాసు ముందుకువచ్చి ఏకదీక్షగా దాన్నే చూస్తూ నిలబడింది. ఇప్పుడు ఎడమవేపునుంచి వేణూవచ్చాడు. పాంటూ, షర్టూ వేసుకొనివున్నాడు. చేతిలో స్టెతస్కోపు, అద్దంఉన్నాయి. దానిలో చూసి తలదువ్వుకుంటూ వచ్చాడు. గీతని చూసి)

గీత : తల చిక్కుపడిందా డాక్టరుగారూ!

వేణు : (చూసి) ఊహూ! నేనే తల చిక్కుల్లో పడ్డాను. ఏం! నువ్వేంచేస్తున్నావిక్కడ? బొమ్మ వేస్తున్నావా?

గీత : ఊహూ. చూస్తున్నాను. (గెడ్డంక్రింద చెయ్యి పెట్టుకుంది.)

వేణు : అలా చూడకపోతే కాస్త సాయం చెయ్యకూడదూ? (దువ్వెన అందించాడు.)

గీత : ఆ అర్హత జీవితంలో ఒక్కరికేవస్తుంది సార్! ఈ పాఠం మీ వైద్యశాస్త్రంలో చెప్పరనుకుంటాను.

వేణు : చెప్పినప్పుడు నేర్చుకొని నీకు ఏకంగా జడ వేస్తాలే. ఊఁ. ఊఁ. త్వరగా కానియ్.

(దగ్గరకువస్తే మెడకు స్టెతస్కోపు తగిలించి, అద్దం బల్లమీదవుంచి 'టై' సర్దుకున్నాడు. ఆమె తల దువ్వుతోంది ఆమె ఎత్తు చపటామీద నిలబడింది. అతను కింద నిలబడ్డాడు.)

గీత : డాక్టరు చదువుకున్న అబ్బాయికి డ్రాయింగు మాస్టరు కూతుర్ని చేసుకుంటారా మీ నాన్న?

వేణు : ఏమో నమ్మకంలేదు.

గీత : (తెల్లబోయి) ఏమిటి!

వేణు : కాని చలపతిరావుగారి అమ్మాయిని మాత్రం రామానుజంగారు కొడుక్కిచేసుకుంటారు. (ఇప్పుడు ఆమెను చూసి) ఆ స్టెతస్కోపు నీకెంతబాగుందో తెలుసా?

గీత : (దువ్వడం అయిపోయింది) వెక్కిరించనక్కరలేదులే.

వేణు : నిజంగానే అంటున్నాను. నువ్వు నాతో కాలేజీకి వస్తే ఎంత బాగుండేదో తెలుసా? కలిసిపెరిగాం. కలిసి చదువుకొని, కలిసి బ్రతికేవాళ్లం.

గీత : చదువెందుకు సాగలేదో నీకు తెలుసుగా!

వేణు: డబ్బేగా—సత్యం పనిచేస్తే అంతా సరిపోయేది.

గీత : వాడు పనిచేసేంత చదువుకోలేదు. అది వాడి తప్పుకాదు. చదువు చెప్పించలేకపోయాడు నాన్న.

వేణు: పోనీ మా నాన్న దగ్గర తీసుకోవచ్చుగా?

గీత : (మాటమార్చే ప్రయత్నంలో) ఇది మరీ బావుంది మా నాన్నే మీకు బోలెడు డబ్బివ్వాలి—రేప్పొద్దున్న...

వేణు : అదేమిటి!

గీత : అవును. కట్నం యివ్వందే ఆడపిల్లను ఎవరు చేసుకుంటారు. బాబూ!—ఈ రోజుల్లో!— అదీ మెట్రిక్ ప్యాసయిన అమ్మాయిని.

వేణు: పోనీ, మీ నాన్నతోపాటు నువ్వూ బొమ్మలు వేసి సంపాదించకూడదూ?

గీత : ఊహూఁ! నీ జుత్తు దువ్వి జీతం పుచ్చుకొని కట్నం అప్పు తీర్చుకుంటాలే.

వేణు: మాట్లాడితే పెళ్ళి జ్ఞాపకం వస్తుందే ఆడ వాళ్ళకు?

గీత : (నవ్వి) జవాబు గట్టిగా చెప్పేదా, మెల్లగా చెప్పేనా?

వేణు : నాకేం భయం, గట్టిగానే చెప్పు!

గీత : పెళ్ళి చేసుకోదలచినవారే ఎప్పుడూ గుర్తు చేస్తూంటారు కనక.

వేణు: నేనా!

గీత : నిజం చెప్పు! ఆసుపత్రిలో ఈ స్టెతస్కోపు పెట్టుకొన్నప్పుడు గుండె చప్పుడు విని పిస్తుందా? నా పేరు వినిపిస్తుందా?

వేణు: అబ్బ! తనే అందగత్తెనని గర్వం అమ్మాయికి.

గీత : మళ్ళీ ఆ గడుసుదనం దేనికి? అందగత్తెనవే చెప్పకూడదూ?

(సరిగా ఈ సమయంలో రామామణం ఎడమ వేపునుంచి 'చలపతీ' అని పిలుచుకుంటూ చలపతి యింట్లోంకి బయలుదేరాడు. గుమ్మం దగ్గర, ఏదో జ్ఞాపకంవచ్చినట్టు ఆగి యిద్దర్నీ చూస్తూ)

రామా: నువ్వన్నది నిజమేనమ్మా! గడుసుదనానికిపోయి వీడు చాలా నష్టపోతున్నాడు. ఒరే, నీకు మరో సాక్ష్యం కావలిస్తే నేను చెబుతున్నాను. గీత అందమయినదేరా—కనీసం నీకంటె— ఇంట్లోంకి వెళ్ళాడు.

(గీత ఒకటే నవ్వు, వేణూకి కోపం వచ్చింది.)

వేణు: మొత్తంమీద బాగానే లోబరుచుకున్నావ్—మావగార్ని.

గీత : అదిగో మళ్ళీ గడుసుదనం. మామయ్య పాకుతో నా అందాన్ని ఒప్పుకున్నావు. మనస్సు లొంగిపోయినట్టేగా?

వేణు: (ఆమెను సూటిగా చూస్తున్నాడు.)

గీత : ఏమిటలా చూస్తున్నావు?

వేణు: నా కొక్కప్పుడు ఆశ్చర్యం వేస్తుంది గీతా. ఇంత తెలివైన అమ్మాయి, కుటుంబాన్నయినా సరిగా దిద్దుకోలేని మామయ్య కూతురేనా అని.

గీత : (వెంటనే కోపం, ఉదాసీనత వచ్చాయి. రూఢిగా అంది.) నాన్న తెలివితక్కువవాడేంకాదు.

వేణు : స్తోమతుకి మించిన సంతానం, సంపాదనకి మించిన ఖర్చూ, దూరాలోచనలేని వ్యాసంగం—ఇదేగా మావయ్య జీవితం?

గీత : (అతన్ని ఆశ్చర్యంగా చూస్తోంది) వేణూ!

వేణు : ఆ సంపాదనతో, అంతమంది సంతానంతో ఆయన కనక వేగాడు కాని, నేనయితేనా?

గీత : (నెమ్మదిగా) ఏంచేసేవాడివి వేణూ?

వేణు : ఇప్పుడెందుకులే. అంతమంది గజిబిజిగా ఇంటి నిండా తిరుగుతూ—ఒకరిమాటఒకరికి పొందక అందర్నీ ఒక్కసారి చూడడం సాధ్యపడక ఎవరితోనూ చెప్పుకోలేని ఒద్దికతో— నరకంలో లాగ బ్రతకడం నీమట్టుకు నీకు యిబ్బంది అనుపించదూ?

గీత : (నిశ్చలంగా, నిశ్చయంగా) అనిపించదు వేణూ—

వేణు: (దిగ్భ్రమతో) అనిపించదా!

గీత : ఊహూ! ఎందుకంటే నేనూ వాళ్ళలో ఒకతెను గనుక. పదిమందిలో బ్రతకడం చేతకాని వాడివి—నీకేంతెలుసు ఆ తియ్యదనం?

వేణు : గీతా!

గీత : అక్కడ కష్టాలూ కన్నీళ్ళూ తియ్యగానే వుంటాయి వేణూ—నీకు తెలీదు ఆ లిపి.

వేణు: గీతా! ఎందుకంత ఉద్రేకం? నేనిప్పుడేమన్నా నని—కన్నీళ్ళు కూడానా? ఛ ఛ!

గీత : (తుడవబోతే ఆపింది—అతని తమ కూడదీసు కొంది) నీకు వేళవుతోంది. ఇంక బయల్దేరు.

వేణు : కాని, ఒక్క.........

గీత : అబ్బ! తర్వాత మాట్లాడుకోవచ్చులే. నాన్న, మావయ్య వస్తున్నట్టున్నారు—పద.

(వేణు వెళ్ళాడు. గీత కళ్ళు తుడుచుకుని క్షణంలో మామూలు మనిషయింది.)

రామా :(వచ్చాడు.) చూడమ్మా వీణాన్న? ఇవాళ నుగుణవస్తోందా? (ఏదో చెప్పబోయాడు.)

గీత : సుగుణవస్తోందా మావయ్యా!

రామా : అవును—ఓహో ! అన్నట్టు నీకు చెప్పలేదు కదూ?—అవునమ్మా - యివాళేవస్తోంది.

గీత : పరీక్షలు ఎలా రాసిందట ?

రామా : అది రాయకపోతే ఎవరు రాస్తారమ్మా?—చెప్పేదేమిటంటే— సుగుణని తీసుకురావడానికి రైలుకువెళ్దాం, స్నానంచేసి సిద్ధంగా వుండరా అన్నానా ?

గీత : ఇప్పుడేమయింది?

రామా: స్నానంచేసి ఆ పెరటితోవంట ఎక్కడికో బయలుదేరిపోయాడట—(నవ్వు) ఆ ఆర్టిస్టులకి అర్థంకుంటే మతిమరుపు ఎక్కువగా వున్నట్టుంది. నువ్వోసారి ఆ తలుపు తీసి చూడు. ఎక్కడికి వెళ్ళాడో ఏమిటో ?— మళ్ళీ క్షణంలో రావచ్చు.

గీత : (నవ్వి) అలాగే (లోపలికి వెళ్ళింది.)

రామా: వీడితో వేగడంకంటె గయ్యాళిపెళ్ళాంతో కాపరం చెయ్యొచ్చు.— (లోపలికి వెళ్ళబోతూంటే మాధవరావు వచ్చాడు.)

మాధ: (చివరిమాటలు విని) ఆరెండూ నేను చేస్తున్నాను కదండి.

రామా: (ఆగి, చూసి) నువ్వటోయ్ - ఏమిటీ? పద్మ గయ్యాళిదా? ఆలెక్కన—దాన్నలా తయారు చేసిన నివ్వేమనాలి?

మాధ: ఏదన్నా మీరు నామీదకే తిప్పుతారు (రామానుజం నవ్వుతూ లోపలికి వెళ్ళబోతూంటే) చూడండి—పెయింటింగు తయారయింది.

రామా : అలాగా? - ఏదీ చూడనీ !

(మాధవరావు సరాసరివెళ్ళి చలపతి తయారు చేసివుంచిన చిత్రాన్ని రామానుజం చేతుల్లోవుంచాడు. దాన్ని చూస్తూ రామానుజం మురిసిపోయాడు.)

రామా : మా చలపతి చెయ్యి అమృతమే! -సందేహం లేదు.

మాధ: అందులోనూ ఈ మధ్య మరీ దుఃఖపడిపోతున్నారు. పాపం — అందుకే మరింత అందంగావచ్చింది.

రామా : చలపతి రహస్యం నువ్వూ కనిపెట్టేశావే! (జేబులోకి చెయ్యిపోనిచ్చి, డబ్బుతీసి) ఇది చాలా ?

మాధ : (లెక్కచూసుకుని) ఏభై చాలుకోండి. కాని చాలా బాకీలుపడిపోయాము. మరో పాతికయినా.

రామా: (నవ్వి, తీసియిస్తూ) ఎప్పుడయినా చలపతి చిత్రప్రదర్శనం ఏర్పాటుచేస్తే వీటి ధరలు గుర్తుచెయ్యడం మరిచిపోకు. నీదగ్గర చాలా ఖరీదుకి కొన్నాను వీటిని.

మాధ: తన చిత్రాల్ని కొనేవ్యక్తిని చూడాలని ఒకటే తహతహపడిపోతున్నారండి—మావగారు!

రామా : కొంపతీసి నేనేనని చెప్పావేమిటి?

మాధ: అంత తొందరపడతావా?

రామా : చెప్తే నీకు డబ్బుండదు. వాడికి వ్యసనం ఉండదు.

మాధ : ఆమాత్రం నాకు తెలీదా?

రామా : చేతికి పనిలేకపోతే ఆలోచనలతో చచ్చిపోతాడు వాడు.

మాధ: ఇలాంటి స్నేహితులు ఎంతమందివుంటారండి... చూడండి. అప్పుడే మావగారు చెట్టు పూర్తిచేశారు. ఈసారి చాలా గొప్పచిత్రం వేసేట్టున్నారు.

రామా : ఏం కథ? ఈ సారి నా దగ్గర బాగా రాబట్టదల్చుకున్నావా?

మాధ: నేను తల్చుకోకపోయినా యిచ్చే మనస్సువీరిది కళని, కళాకారుణ్ణి తెలిసిన వాళ్ళు—మీకు నేను చెప్పాలా?

రామా: మాధవరావ్! నిజం చెప్పాలంటే చిన్నప్పట్నుంచీ వాడి కళమీటో నా కర్థం కావడం లేదు. ఒకప్పుడు బాగా వేసేవాడేమోకాని, ఇప్పుడుమాత్రం నా కళ్లకు అవన్నీ చెత్తగావే కనిపిస్తున్నాయి. కాని మమతల మాధుర్యం ఉంది చూశావ్. అది చాలా గొప్పది. ఎలాంటి వాడినయినా బ్రతికిస్తుంది. వాడికది జీవితంమీద ఎలాగూ లేదు. ఈ కళమీద యినా ఉంటే పది కాలాలపాటు బ్రతుకుతాడు.

మాధ: మంచి మాటన్నారు.

రామా: వాడు బ్రతికి ఉండడం మీలాంటి వారంద రికీ శ్రేయస్కరం.

మాధ: మాకా!

రామా: మీక్కాకపోతే మాకా? వాడు లేకపోతేమీరంతా మీ కష్టాలు ఎవరి నెత్తిన రుద్దుతారు? సత్యం ఎవరిమీద ఎగురుతాడు? ఆ స్కూలు మాష్టరు ఎవరికి ఉత్తరాలు రాస్తాడు? కష్టాల్ని గుదిగుచ్చే దారంవాడు. ఈ వాడిపోయిన పువ్వుల్నయినా జతచేర్చే శక్తి వాడికే వుంది.

మాధ: ఏమిటో అనుకున్నాము. మీరు చాలా ఆలోచించారు ఈ సంసారాన్ని గురించి.

రామా: అంతేకాదు—నీ గురించీ ఆలోచించాను మాధవరావు! నీ అవసరాలకీ, అనవసరాలికి నేనిలా డబ్బు యివ్వకపోతే వాడిని పీక్కుతింటావని. వాడి దగ్గర నీకింక రుచించేది ఏమీ లేదు. రక్తమాంసాలుతప్ప. వీటిని కొనడానికి అదో కారణం—

మాధ: రామానుజంగారూ!

రామా: బాధపడకు. నీ మీద కోపం లేదు. నీ దగ్గర కొంటూనే వుంటామలే. ఇలాంటి మావయ్య వుంటే—నేనూ నీలాగ బ్రతికే వాణ్ణేమో! ఉండు. ఎవరో వస్తున్నట్టున్నారు—ఈ క్షేమ దాచి వస్తాను.

(మాధవరావు త్వరగా డబ్బు జేబులో పెట్టుకున్నాడు. బయటకు వెళ్లలోగా ఎదురుగ్గా మావగారు వచ్చారు.)

చల : ఇంకా ఆసుపత్రికి వెళ్ల లేదా బాబూ!

మాధ: ఇదిగో వెళ్తున్నా—

చల : మరి కేరేజి ఏది?

మాధ: కేరేజీలుమోసి ఒళ్లూ జబ్బపడిపోయింది ఇవాళ్టినుంచీ గీతను తీసుకువెళ్లమన్నాను. (ఆయన ఆశ్చర్యపోతే.) అహ! మరేం లేదు—పద్మ ఆసుపత్రిలో వుండడం ఒక వారమా, రెండా? ఎప్పుడూ వుండేదేగా! అంతా కేరేజీలు మోయడంలో తరిఫీదు అవడం మంచిదని (మెత్తగా చెప్పి వెళ్లిపోయాడు)

(చలపతి యిటుతిరిగేసరికి రామానుజం వచ్చాడు)

రామా: ఏరా ఎక్కడికి వెళ్లివచ్చావు?

చల: నువ్వేగా స్టేషనుకి—

రామా: స్టేషనుకి వెళ్దామంటే అప్పుడే వెళ్లివచ్చేశావన్నమాట!

చల: వీధి చివరిదాకా వెళ్లేసరికి గీత కేకవేసింది.

(గీత కండువాతో యింట్లోంచి వచ్చింది)

రామా: చూశావమ్మా!—వేచెప్పలా. నీ పెళ్లిలో వీడు నిన్ను కూర్చోబెట్టబోయి తను పీటలమీద కూర్చుంటాడు. నాకు తెలుసు.

(అంతా ప్రసన్నమయారు)

చల: పోనీ వేణూ గుర్తుపడతాడులే – మంగళ సూత్రం కట్టకపోయినా ఎటూ మీ యింటికి చేరేవాణ్ణే నేను.

గీత : (సీరియస్‌గా) ఇప్పుడెందుకు వావా ఆ విషయాలు?

రామా: వాడిచేతి కర్ర అందుకోవమ్మా – వీడికి

అందరూ దుఃఖాన్ని పంచేవాళ్లే. నీ పెళ్లి ఆలోచనైనా వాడికి సంతోషాన్ని కలిగించనీ.

(మాట అంటూండగానే లోపలికి వెళ్లింది గీత)

చల : (తలెత్తి, కృతజ్ఞత, స్నేహం నిండినకళ్లతో రామానుజం రెండుచేతులూ పట్టుకున్నాడు)

రామా : అరెరె! ఏమిట్రా యిది?

చల : మా రాజు విషయంలో జరిగిన పొరపాటు మళ్లీ జరగనివ్వను. ఏమయినా సరే గీత నీ కోడలేరా!

రామా : అదా! దానికి మళ్లీ నీ హామీ ఏమిట్రా? అది పుట్టినప్పుడే నా కోడలైంది. ఈసారి నామాటకు ఎదురుచెప్పావంటే తుపాకీపెట్టి కాల్చేస్తాను.

గీత : (చేతికర్రతోవచ్చి) ఏమిటిమావయ్యా నాన్నని బెదిరిస్తున్నారు?

రామా : బెదిరించాలమ్మా—రోజులు పాడయిపోయాయి—ఈ రోజుల్లో ఎవరివస్తువువాళ్లు తీసుకోవడానికి బెదిరించక తప్పడంలేదు.

గీత : ఏమిటి మామయ్యా అది?

రామా : (దయగా ఆమె తలమీద చెయ్యివేసి) నువ్వేనమ్మా—తన బంగారమేదో దానంచేస్తున్నట్టు — యివాళ నాచేతిలో చెయ్యివేసి 'గీత నీకోడలేరా' అంటున్నాడు వాడు. తనదికానిది దానం చెయ్యడంలో మహామహుడులే. చూడమ్మా వీడు?

గీత : నాన్న పొరపాటుపడ్డాడు మావయ్యా.

రామా: అలా చెప్పువాడికి—వినరా!

చల : (సంతృప్తిగా నవ్వి) ఆఖరికి మామాకోడళ్లు ఒకటయ్యారన్నమాట.

గీత : కాదు నాన్నా నేను ఆయనకు కోడలుకావడం లేదు.

చల : అంటే?

గీత : నేను వేణుని చేసుకోవడంలేదు.

చల : అమ్మా, గీతా!

గీత : చేసుకోలేను.

చల : అమ్మా! ఏమిటా మాటలు? నీకు మతిపోయిందేమిటి?

(రామానుజం నిర్ఘాంతపోయాడు. కాని ఏమీ మాట్లాడలేదు)

గీత : లేదు నాన్నా అందుకే చెప్తున్నాను.

చల : కారణం?

గీత : కారణం నన్నడక్కండి.

చల : నిన్నడగను, ఏమీ అడగను. అడక్కుండానే పెళ్లి పీటలమీద కూర్చోపెడతాను. ఎలా ఈ పెళ్లి జరగదో చూస్తాను.

(ఇంకా ఏదో అనబోయేసరికి రామానుజం అతన్ని ఆపాడు.)

రామా : చలపతీ! గీత యిష్టంలేకుండా ఈ పెళ్లి ఎలా జరుగుతుందో నేనూ చూస్తాను. (చలపతి ఇంకా ఏదో అనబోయేసరికి రామానుజం ఆతన్ని ఆపాడు.)

చల : రామానుజం!

రామా : (గీత దగ్గరకు వచ్చి ఆప్యాయంగా తలమీద చెయ్యివేశాడు) అలాగేనమ్మా! నీయిష్టమే కానియ్. నీకిష్టంలేని పనిని వాణ్ణి చెయ్య నివ్వను. సరేనా?

గీత : (గీత తలెత్తి జాలిగా అతనివేపు చూసింది) నన్ను క్షమించు మావయ్యా! తప్పనిసరిగా యిలా చెయ్యవలసివచ్చింది. కారణం—

రామా : ఏదయినా కానీ—నేనడగను—నీకు మంచిదని తోస్తే చాలు, నేనూ నీకు అండగా నిలుస్తాను. ఇక వేణుకి నీకు పెళ్లి జరగదు. సరేనా? (గీత ఒక్కసారి దుఃఖం ముంచుకొచ్చి మావయ్య గుండెలమీద తల ఆనించి ఏడ్చేసింది.) ఇంక ఊరుకోమ్మా! లోపలికి పద. (గుమ్మంవరకూ తీసుకెళ్లాడు, తల వంచుకు మెల్లగా లోనికి వెళ్లిపోయింది.)

రామా :(లేని ఉత్సాహం తెచ్చిపెట్టుకొని) అలా మట్టి బొమ్మలా నిలబడ్డావేమిరా? త్వరగా పద! ఎక్కడైనా వేడివేడి కాఫీ తాగి అలా రైలు స్టేషనుకి పోవాలి పదపద.

(నిశ్చేష్టుడయి నిలబడ్డ చలపతిని ఈడ్చుకు పోయాడు రామానుజం.)

రంగస్థలం ఒక్కక్షణం నిశ్శబ్దంగా వున్నతర్వాత.

తెర





# 11 వ శతాబ్ది వర్తమానార్థక క్రియలు*

శ్రీ ఎం. కందప్ప శెట్టి

తెలుగులో సమాపకక్రియలు రెండు విధములు.

1. సంశ్లిష్ట సమాపకక్రియలు (Periphrastic finite verbs.)

2. సాధారణ సమాపకక్రియలు (Simple finite verbs.)

## సంశ్లిష్ట సమాపక క్రియలు

అడిగినాడు, అడుగుచున్నాడు, అడుగగలడు; అడిగినావు మొ. వి.

## సాధారణ సమాపక క్రియలు

అడిగెను, అడిగెడును, అడుగును; అడిగితివి మొ. వి.

ఇందు మొదటి రకపు సమాపక క్రియలు నన్నయకాలమునాటికి పరిణతస్థితికి రాలేదు. నన్నయ అడిగినవాడు, అడుగుచున్నవాడు, మొ. వి. ప్రయోగించెనేకాని వకారలుప్త రూపములను ప్రయోగింప లేదు [1] కాని తిక్కన వకారలుప్త రూపములను గూడ ప్రయోగించెను.[2] శాసనాధారములనుబట్టి అడిగినవాడు> అడిగినాడు వంటి మార్పు తెలుగున క్రీ. శ. 11 వ శతాబ్దమున ప్రారంభమయి 12–14 వ శతాబ్దుల మధ్య తీవ్రముగ జరుగుచుండెనని చెప్పవచ్చును.[3] అనగా సంశ్లిష్ట సమాపకక్రియలు ఈ కాలమున పరిణతిని పొందుచుండెనని శాసన సాహిత్యాధారములనుబట్టి నిర్ణయింపవచ్చును.

సంశ్లిష్ట సమాపకక్రియలందు మూడు కాలములు ఉండగా సాధారణ సమాపకక్రియలందు రెండే కాలము లున్నట్లు చిన్నయసూరి వ్యాకరణము వలన తెలియుచున్నది. 1. భూతకాలము. (వాడు అడిగెను.) 2. తద్ధర్మార్థకము (వాడు అడిగెడును, వాడు అడిగెడివి, వాడు అడుగును.) కాని కేతన, పెద్దనలు తమ వ్యాకరణ రచనలందు సాధారణ సమాపక క్రియలయందును మూడు కాలములు చెప్పుచున్నారు. ఇందు భూతకాల విషయమున (వెళ్ళెను, వెళ్ళిరి మొ. వి) ఎట్టి సమస్యయును లేదు. కాన వర్తమాన భవిష్యత్ కాలములను గురించి యిందు చర్చించెదము.

## వర్తమానార్థక రూపములు

దును దరు లొరులకు నెదిరికి—
దనరంగా దు దవు దరులు తనకు దను దముఌ
జను నేక బహువచనములు
మను సన్నిభ క్రియల వర్తమానార్థములన్

---

* ఈ వ్యాసముయొక్క మొదటి ప్రతిని పఠించి విమర్శించిన డా. భద్రిరాజు కృష్ణమూర్తి గారికి నా కృతజ్ఞత.

1. 'అడుగ గలవాడు> అడుగ గలాడు' అను రూపమునకును, 'అడుగగలడు' అను రూపమునకును చారిత్రకముగ సంబంధములేదు. చూడుడు.

M. Kandappa Chetty, Historical Grammar of Inscriptional Telugu, 3.49-51 (Paras) (Unpublished Ph.D. thesis of S. V. University, Tirupati, 1966.).

2. Bh. Krishnamurti Telugu Verbal Bases PP 233-4-footnote 8. (Berkeley, 1961.)

3. Historical Grammar of Inscriptional Telugu, 3.43-49.

'ఇచ్చినవాణు > ఇచ్చినాణ్డు' వంటి మార్పు తెలుగుభాషలో మొట్టమొదట 11 వ శతాబ్దపు శాసనములో గన్పడుచున్నది చూడుడు:

B. Radhakrishna, A Historical and Comparative Grammar of Early Telugu 4-144 I (Unpublished Ph.D. thesis of Andhra University, Waltair, 1964.)

అడిగెదు నడిగెదరనఁగా
నడిగె దడిగెదవు దనంబు నడిగెదరనఁగా
నడిగెద నడిగెదమనఁ బొ
ల్పడరంగా వరుసతో నుదాహరణంబుల్

(ఆం. భా. భూ 142–143)

ప్రథమ పురుషంబునకు వర్తమానార్థంబునందు నేకవచన బహువచనంబులందు నెడి నెదరు లును, మధ్యమ పురుషంబున కెదవెదరులును, నుత్తమ పురుషంబున కెదవెదములును క్రమంబున నాదేశంబు లయ్యెఁ దన్నిరూపణంబు లెఱింగింతు.

అరిగెడి నరిగెద రనఁగా
నరిగెద వరిగెద రనంగ నధిపతి పురికై
యరిగెద నరిగెద మనఁగా
బరుపడి నిది వర్తమాన ఫణితార్థము గున్

(కా. చూ. IX 150–151)

## భవిష్యదర్థక రూపములు

ఉనుదురు లోరులకుఁ జెప్పను
దనరఁగ దువుదురు లెదిరికిఁ దనకుదునుదుముల్
దనరఁగ నివి యేక బహువ
చనములగు భవిష్యదర్థ సంసూచకముల్
పలుకును పలుకుదు రనఁగాఁ
బలుకుదువు పలుకుదురనఁగఁ బలుకుదు నర్థిన్
బలుకుదు మనఁగా నిన్నియు
నలఘుమతీ వరుసతో నుదాహరణంబుల్

(ఆం. భా. భూ. 144–145)

ప్రథమ పురుషంబునకు భవిష్యదర్థంబునందు నేక బహువచనంబులకు నుదురులును, మధ్యమ పురుషంబునకు దువుదురులును, నుత్తమ పురుషంబునకు దునుదుములు వరుస నాదేశంబులయ్యెఁ దన్నిదర్శనం బెట్టిదనిన.

చేయుం జేయుదు రనఁగాఁ—
జేయుదు చేయుదురు విహారు చిత్తం బలరం
జేయుదుఁ జేయుదు మనఁగా
నాయతముగ నివి భవిష్యదర్థము చెప్పన్.

(కా. చూ. IX 154–155.)

పై వ్యాకర్తలు ధాతుప్రత్యయ విభాగమునందు భిన్నమార్గముల నవలంబించినను రూపనిష్పాదనమం దిరువురును ఇంచుమించు నేకీభవించుచున్నారు. వా రిరువురును కాలప్రత్యయములను (Tense Suffixes), పురుష ప్రత్యయములను (Personal Suffixes) కలిపి చెప్పిరి. వానిని విడదీసి చెప్పినచో కాలపురుష ప్రత్యయము లీ క్రింది రీతిగ నగును.

## వర్తమానార్థక ప్రత్యయములు

—ఎడు—ను/—ఎడి—వి ప్రథమ పుం స్త్రీ వాచకముల ఏకవచనము క్లీబవాచక ఏకబహువచనములు.

—ఎద—రు ప్రథమ పుం స్త్రీ—బహువచనము.
—ఎద—ఉ/—ఎద—వు మధ్యమైకవచనము.
—ఎద—రు మధ్యమ బహువచనము.
—ఎద—ను ఉత్తమైక వచనము.
—ఎద—ము ఉత్తమ బహువచనము.

అనగా—ఎడు—/—ఎడి—,—ఎద— అను రెండు రూపులును వర్తమానార్థక రూపములని తేలుచున్నవి.

## భవిష్యదర్థక ప్రత్యయములు

—∅—ను ప్రథమ పుం స్త్రీ—ఏకవచనము, క్లీబవాచక ఏకబహువచనములు.

—దు—రు ప్రథమ పుం స్త్రీ—బహువచనము.
—దు—ఉ/—దు—వు మధ్యమైక వచనము.
—దు—రు మధ్యమ బహువచనము.
—దు—ను ఉత్తమైక వచనము.
—దు—ము ఉత్తమ బహువచనము.

అనగా—∅—(శూన్య ప్రత్యయము),—దు—అను రెండు రూపములును భవిష్యదర్థకరూపములని తేలుచున్నవి. (—ను/—వి,—రు మొ. వి. పురుషార్థక ప్రత్యయములు)[4]. సౌలభ్యార్థము ఈ వర్తమానా

---

4. ఈ ప్రత్యయ విభాగములు డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారు చేసినవి.

Telugu Verbal Bases, See chart on page 189.

ర్థక ప్రత్యయములను ఎద-వర్గ ప్రత్యయములనియు, భవిష్యదర్థక ప్రత్యయములను దు-వర్గ ప్రత్యయములనియు పేర్కొందము.

పై ఎద-వర్గ ప్రత్యయములను, దు-వర్గ ప్రత్యయములను కలిపి చిన్నయసూరి తద్ధర్మాద్యర్థక ప్రత్యయములని చెప్పెను. తెలుగు వ్యాకరణమును సంస్కృతమున రచించిన ఆంధ్ర శబ్దచింతామణి కారుడు మొదలగు వారి ననుసరించిన చిన్నయసూరి— ఈ విషయమునను వారినే అనుసరించి పై ప్రత్యయములను తద్ధర్మాద్యర్థకము లనెను. చిన్నయసూరి వ్యాకరణము బహుళ ప్రచారమున నుండుటచే ద్రావిడభాషా తులనాత్మక పరిశోధకులు (Scholars on Comparative Darvidian) చిన్నయసూరి సూత్రముల ననుసరించి తెలుగులో భూత-తద్ధర్మ కాలములు (past and non-past) రెండే యున్నవని గైకొనుటచే నేనీ చిన్న వ్యాసమును ప్రకటింప ప్రయత్నించుచున్నాను.

చిన్నయసూరి యనుసరించిన ఆంధ్ర శబ్ద చింతామణ్యాదులు ఒక దానితో నొకటి యేకీభవించుట లేదు. ఆంధ్రశబ్ద చింతామణి కేతన పెద్దనలు చెప్పిన దు-వర్గ ప్రత్యయములను మాత్రము పేర్కొని వానిని తద్ధర్మార్థకము లనెను. కేతన పెద్దనలు చెప్పిన ఎద-వర్గ ప్రత్యయముల ప్రసక్తియే యిందు లేదు.

> 'దుతి వర్ణకౌ క్రమాత్ స్తో
> వ్యాద్యప్యాదే ర్ద్వయోశ్చ భూతార్థే
> బిన్దు పరస్య తకారో
> దో ప్స్య దఖ్యాతా దుతాం పరేషా మిత్
> (బాలసరస్వతీయము-82)

ఆంధ్రశబ్ద చింతామణికి పూరకమువంటి అథర్వణకారికావళిపై ఆంధ్రశబ్ద చింతామణి పేర్కొన్న దు-వర్గ ప్రత్యయములకు-దు-/-డి-(ప్రథమైక)ని మాత్రము చేర్చి వానిని తద్ధర్మార్థకముగనే పెప్పెను.

> 'తద్ధర్మ ప్రథమేస్యాతాం
> దు, డి, పరౌ చ నాంతకౌ.'
> (అథ-క్రియా-9)

ఇందును—ఎద—ప్రత్యయము స్వక్రమముగ నిర్వచింపబడలేదు—ఎద—ప్రత్యయమును కూడ చేర్చి యున్నిటిని కల్పి తద్ధర్మార్థకములని తొలుత అహోబల పండితుడు చెప్పెను. ఇట్లు సంస్కృతమున వ్యాకరణము రచించినవారిలో నొకరికొకరికి భేదము లుండుటయు, తెలుగున వ్యాకరణము రచించినవారిలో నీ భేదము లేకుండుటయు నిందు గుర్తింపవలయును.

సంస్కృతమున ఆంధ్ర వ్యాకరణమును రచించినవారు కొంత భిన్నత్వము వహించినను—పై ప్రత్యయములను చెప్పు సందర్భమున 'వర్తమాన భవిష్యత్' పదములను వాడక 'తద్ధర్మ' పదమును వాడుటయందేకీభవించిరి. తెలుగున వ్యాకరణమును రచించిన కేతన పెద్దనలు 'తద్ధర్మ' పదమును వాడక 'వర్తమాన భవిష్యత్' పదములను వాడిరి. ఈ రెండు వర్గములకు జెందిన వ్యాకర్తల అభిప్రాయములందలి సత్యాసత్యములను నిర్ణయించవలెనన్న ఆ కాలమున రచింపబడిన శాసనములు, లేక సాహిత్యరచనలే తగిన యాధారములు. ఎద—వర్గ ప్రత్యయములు శాసనములలో అరుదుగ గన్పడుటచే[5] సాహిత్యాధారమే యీ పరిశీలనకు ఉపయోగపడుచున్నది.

నన్నయ రచించిన భారత భాగమును స్థూలముగా పరిశీలించిన ఎద-వర్గ ప్రత్యయములకును దు—వర్గ ప్రత్యయములకును వర్తమాన భవిష్యద్భేదము లున్నవో లేవో యని తేల్చి చెప్పలేముగాని, ఈ రెండు వర్గపు ప్రత్యయములకును ఏదోయొక భేదమున్నదని మాత్రము చెప్పగలము. కథాకథనమును గురించి నన్నయ చెప్పునపుడెల్ల 'చెప్పెద వినుఁడు' అని చెప్పునుగాని 'చెప్పుదు వినుఁడు' అని యెక్కడను చెప్పలేదు. ఈరెంటికిని అర్థములో భేదములేనిచో నన్నయ 'చెప్పెద వినుఁడు' అని సర్వత్ర ప్రయోగింపవలసిన యవసరము లేదు. ఇందులోని అర్థభేదములను విశదీకరించవలెనన్న కావ్యమును పూర్తిగా చదివి అందలి ప్రయోగముల నెల్ల పరిశీలించినగాని తేల్చలేము. నన్నయ గ్రంథము ఇంచుక పెద్దదిగా నుండుటచే (సౌలభ్యము కొరకై) అతని కించుక సమకాలికు

5. Historical Grammar of Inscriptional Telugu 3–19.

శైవ నన్నెచోడుని కుమార సంభవమునందలి ప్రయోగములను పరిశీలించి ఈ క్రింద పొందుపరచుచున్నాను.

## ఎన-వర్గ ప్రత్యయములు

### 1) వర్తమానార్థకమున

-ఎద-

1. అనియెదు 2-24, 6-10
2. పొగడెదు 7-33
3. అలుగఁ బోయెదు 7-33
4. కొనియాడెదు 2-31
5. చెడనాడెదు 2-36
6. ఎఱుగక తిరెదో 2-36
7. ప్రేలెదో 2-36
8. లేవడ లేవెదు 4-65
9. ప్రాణ గొడ్డమాడెదు 4-65
10. దెప్పరికంబులు సేసెదు 4-65
11. పెద్దగఁ జేసెదు 7-34
12. ఆడెదు 7-34
13. నిద్ర దెల్పెదరు 5-151
14. చేయునెత్తెదు 7-40
15. ఎన్నెదు 7-27
16. ఎఱుగుదు 6-21
17. ఏడ్చెదు 8-149
18. పోయెదు 4-62
19. కడగెదరు 4-62
20. పల్కెదు 4-59
21. పెట్టెదు 4-59
22. మాచెదు 5-123
23. చెనసెదు 12-20
24. చేసెదు 7-38, 7-21, 7-22, 5-35
25. నిందించెదు 7-52
26. మాచెదు 7-52
27. విడిచెదు 6-30
28. దూషించెదు 7-45
29. పల్కెదు 2-34
30. పెనగెదు 10-172
31. పొగడెదవు 10-176
32. పోయెదు 4-66
33. వెదకెదరు 2-30
34. వెఱచెదు 5-165
35. శంకించెదన్ 8-10

—ఎదు— / —ఎడి—

1. బిందమయ్యెడున్ 8-16
2. ఉదరెడు 5-151
3. పులకలొత్తెడు 5-151
4. కదలెడు 5-151
5. చెమట గ్రమ్మెడు 5-151
6. ఊర్పులు నిల్గెడున్ 5-151
7. త్రుళ్లెడున్ 8-149
8. కరువటిల్లెడు 4-59
9. అలిముఖి సంపెడు 12-103
10. తిరిగెడు 6-147
11. పాలించెడున్ 4-12
12. పనవెడున్ 5-88
13. విరహవేదనఁ బెట్టెడు 5-143
14. నడపెడి[6] 4-24

భవిష్యదర్థకమున

1. పోయెదవి 6-21
2. ఒడలేర్పెదన్ 6-5

---

6. సాహిత్యాధారములనుబట్టియు, శాసనాధారములనుబట్టియు -ఎడు- ప్రత్యయమే 11 వ శతాబ్దిలో నుండెననియు, తర్వాత -ఎడి- ప్రత్యయముగా మారెననియు చెప్పవచ్చును. కేతన -ఎడు- ప్రత్యయమును. పెద్దన తొలుత -ఎడి- తర్వాత -ఎడు- ను పేర్కొనిరి.

Historical Grammar of Inscriptional Telugu, 3-35.

3. చేసెదన్ 6-7
4. ఇచ్చెద 10-100
5. వచ్చెద 6-25
6. క్రమ్మఱెద 6-25
7. మరులు గొలిపెద 4-42
8. చంపెద 4-50
9. చేసెదన్ 4-41
10. చేసెద 4 43
11. తెచ్చెదన్ 2-58
11. తెచ్చెదన్ 2-43
12. పూనెద 4-69
13. వసియించెదన్ 3-101
14. సంహరించెదన్ 2-56.

తద్ధర్మార్థకము (Habitual)

1. తావరకస్థితికేమి రోసెదున్ 6-66.

## దు-వర్గ ప్రత్యయములు

భవిష్యదర్థమున

-దు-(-తు-)[7]

1. చూతున్ 10-57
2. చూతువు 10-92
3. కాంతురు 12-126
4. చేయుదున్ 2-6
5. సహింతురె 2-28
6. ఇత్తున్ 7-134, 11-38
7. ఇత్తురు 12-225
8. ఋణంబు నీఁగుదున్ 11-42
9. ఎదురుదురే 4-46
10. ఎఱిగింతున్ 4-45
11. ఎఱుగుదురు 9-134
12. ఏయుదున్ 5-29
13. ఓపుదువే 3-100
14. కురియింతున్ 11-35
15. కొందురు 11-43
16. క్రిక్కింతున్ 12-82
17. చత్తు 4-108
18. జీవింతునే 5-63
19. చాలుదుము 2-55, 12-58
20. చేయుదున్ 5-94
21. చొత్తున్ 5-80
22. తన్పుదుము 11-60
23. తీర్తున్ 11-53
24. తెత్తు 2-57
25. మ్రింగుదు 2-57
26. తెత్తుమే 6-17
27. మర్దింతుము 2-54
28. పట్టుదుమె 2-54
29. వధియింతుమొ 2-54
30. భంజింతుమొ 2-54
31. ఎత్తుదుమొ 2-54
32. పడయుదున్ 6-2
33. పిల్తుము 8-137
34. పొడుతున్ 11-36
35. పోదున్ 6-16
36. మగిడింతున్ 11-40
37. మర్గింతున్ 11-34
38. సహింతువె 10-139
39. సహింతురె 2-28

తద్ధర్మార్థకమున (Habitual)

1. అందురు 7-123
2. అందేవి 4-80
3. అందురు 9-130
4. అనుదురు 9-130
5. అందురె 1-38
6. మెత్తురే 1-38

---

7. -తు- పరిసరములనుబట్టి మారును (Phonologically Conditioned) కాన దీనిని రూపాంతరముగ జెప్పవక్కఱలేదు.

7. చొత్తురె 2-34
8. కొందురె 2-34
9. అందురే 2-34
10. అగుదుర్ 10-98
11. అగుదురు 10-40
12. ఓపుదురు 7-24
13. అభినందింతురు 1-71
14. కలుతురె 8-151
15. ఉండుదు 5-64
16. ఎఱుగుదు 5-79
17. ఉఁడుదురు 7-120
18. ఎఱుంగుదు 4-70, 10-39
19. ఎఱుంగుదున్ 9-85
20. ఒప్పుదురు 7-21, 7-129
21. ఓడుదురు 6-44
22. రమింతురు 6-45, 4-18, 3-15
23. ఓపుదురు 7-24
24. ఓహటిల్లుదున్ 6-12
25. కొందురె 2-34
26. కొల్తురు 12-216
27. గెలుతురు 10-192, 6-68
28. క్రాలుదు 4-108
29. క్రీడింతురు 3-16
30. వర్తింతురు 3-16
31. చూతె 10-151
32. చొత్తురె 2-34
33. విల్తురే 10-279
34. వత్తురె 10-279
35. చొత్తురే 10-279
36. ఐయుంతురు 10-189
37. తలరుదు 4-74
38. త్రోతురు 3-8
39. నడతున్ 6-65
40. నడతుము 4-41
41. నవ్వుదురు 7-112
42. నేర్తువు 11-103
43. నేర్తురే 12-57
44. నడకుందుదురు 12-150
45. పొందుదురు 10-96
46. పిల్తుమె 8-139
47. పిల్తుము 8-140
48. పోలుదుము 7-96
49. విహరింతురు 3-15
50. నలుపుదురు 10-24.

భూతార్థమున[8]

1. ఆ ఆమున్... కూయుదు... మొరయుదు... చీరున్...ఏడ్చు...వావోవున్ 5-68.
2. చూచు......8-68
3. ఒరయుదురు 5-159
4. చూతురు 11-186
5. పోదురు 9-86

-ఁదు- ప్రత్యయము సంఖ్య యెక్కువగ నుండుటచేతను, దాని ప్రయోగము -దు- ప్రయోగము వలెనే యుండుటచేతను, రెండు రెండు ఉదాహరణము లిచ్చి వదలెదను.

భవిష్యదర్థకమున

తలమునుక యగున్ 4-14, పలియెట్లు అగున్ 6-9

తద్ధర్మార్థకమున

అగున్ 5-18, ఎఱుంగున్ 7-105

పై పట్టికను పరిశీలించినచో ఎద-వర్గ ప్రత్యయములకును, దు-వర్గ ప్రత్యయములకును భేదమున్నదని గ్రహింపగలము. ఎద-వర్గము— వర్తమాన భవిష్యదర్థములందును, దు-వర్గము— తద్ధర్మ భవిష్యదర్థములందును ప్రయోగింపబడి

8 బాల వ్యాకరణము, క్రియా 22. ఈ ప్రయోగములందు కార్యము జరిగిపోయినను, తద్ధర్మార్థకముగనే వీనిని గుర్తింపవచ్చును.

నట్లు స్పష్టముగ గన్పడుచున్నది.[9] భవిష్యదర్థమున ప్రయోగింపబడిన ఎద-వర్గ ప్రత్యయములు త్వరితార్థ సూచకములుగాని, సామీప్య భవిష్యదర్థకములుగాని యవుచున్నవి. ఇట్లు కొన్ని విశేష సందర్భములందు ఒక కాల ప్రత్యయమును మరొక్క అర్థమున ప్రయోగించుట సహజమే.

'త్వరితార్థ సూచకంబయి
భావిని భూతంబు చూపబెట్టెడి'
తావచ్చె నుదర్శనాయుధుఁడు—
(ప్రౌఢ-క్రియా-7)

కావున పై ఎద-వర్గ ప్రత్యయములు కేతన పెద్దనలు చెప్పినట్లు ముఖ్యముగ వర్తమానార్థక ప్రత్యయములని చెప్పవచ్చును. అవి త్వరితార్థ సూచకముగను, సామీప్యార్థ సూచకముగను భవిష్యదర్థమునను ప్రయోగింపబడుచు వచ్చెను. దు-వర్గ ప్రత్యయములు భవిష్యత్తద్ధర్మార్థకములైనను కేతన పెద్దనలు భవిష్యదర్థమును మాత్రము సూచించి తద్ధర్మార్థమును సూచింపక వదలివేసిరి. ఈ ఎద-వర్గ, దు-వర్గ ప్రత్యయములు వర్తమాన భవిష్యదర్థములందు ఉపయోగించుటను నేడును తమిళ దశమునున్న తెలుగువారి భాషలో చూడనగును

వర్తమానార్థకము

నేను వచ్చేను (వచ్చెదను> వచ్చేను)

భవిష్యదర్థకము

నేను వత్తును[10]

12–14వ శతాబ్దుల శాసనములలో దు-వర్గ ప్రత్యయములు విరివిగ ప్రయోగింపబడియున్నవి. ఇవి యన్నియు భవిష్యదర్థముననే ప్రయోగింపబడి యున్నవి. కాని ఎద-వర్గ ప్రత్యయములకు రెండే ప్రయోగము లున్నవి. అవి సామీప్య భవిష్యదర్థమున ప్రయోగింపబడియున్నవి[11] ఇట్లు శాసనములందు దు-వర్గ ప్రత్యయములకు భవిష్యదర్థమున విరివిగ ప్రయోగములు ఉండుటయు, ఎద-వర్గ ప్రత్యయములకు అరుదుగ ప్రయోగము లుండుటయు, కేతన పెద్దనలు చెప్పిన నిర్వచనములనే బలపరచుచున్నవి. శాసనభాషలో వర్తమానార్థక వాక్యముల యావశ్యకము చాల అరుదు.[12] కావున వర్తమానార్థక ప్రత్యయములైన ఎద-వర్గ ప్రత్యయములు అరుదుగ ప్రయోగింపబడెను. భవిష్యదర్థక వాక్యముల యావశ్యకము అధికము. కావున దు-వర్గ ప్రత్యయములు భవిష్యదర్థమున విరివిగ ప్రయోగింపబడియున్నవి.

ఎద-దు- వర్గ ప్రత్యయములను చేర్చి యొక వర్గమునకు చెందిన వైయాకరణులు తద్ధర్మార్థకములనుటకు కారణమేమి అని సందేహము గల్గును. దీని క్రింది విధముగా సమాధానము చెప్పవచ్చును.

సంస్కృత మర్యాద ననుసరించిన వైయాకరణులలో ప్రథముడైన ఆంధ్రశబ్ద చింతామణికారుడు దు-వర్గ ప్రత్యయములను మాత్రమే పేర్కొని అవి తద్ధర్మార్థక ప్రత్యయము లనెను. వానిని కేతన పెద్దనలు భవిష్యదర్థకము లనిరి. ఈ రెండర్థములును ఆ ప్రత్యయములకున్నట్లు పై పట్టికవలన

9. ఒక సందర్భమున ఎద-వర్గ ప్రత్యయము తద్ధర్మార్థకమున నున్నది. 'రోసెడున్' ఇది ప్రశ్నార్థక సందర్భమునందు ప్రయోగింపబడి యున్నది. ఇచ్చట తద్ధర్మమనుపదమును ఆంగ్లమున habitual అనుపదమునకు సమానార్థకముగ తీసికొనుచున్నాను. అనగా నిది సామాన్యముగా మూడుకాలములందును జరిగెడునది యని యర్థము.

10. ఈ ప్రయోగమును చెప్పిన శ్రీ కుమారస్వామిరాజా-(రీడర్-అణ్ణామలై యూనివర్సిటీ)గారికి నా కృతజ్ఞత.

11. అబ్బును, సిద్ధించును, పొందుదురు, చెప్పొదురు, ఇత్తురు, అనుభవింతురు వంటి దు-వర్గ ప్రత్యయములు 12–14 శతాబ్దుల శాసనములలో అనేకము లున్నవి. కాని ఎద-వర్గ ప్రత్యయములకు చెరిచెదము, నడచెదము అను రెండు ప్రయోగములే యున్నవి చూడుడు.

Historical Grmmar of Inscriptional Telugu, 3 18, 19.

12. శాసన ఇతివృత్తములు చాలవరకు దాన విషయములు లేక రాజస్తుతులు. వీనికి వర్తమానార్థక వాక్యముల యవసరము మిక్కిలి అరుదు.

తెలియుచున్నది. కావున ఆంధ్రశబ్ద చింతామణికారుడు చెప్పినదానిలో దోష మేమియులేదు కాని ఆంధ్రశబ్ద చింతామణికి పూరకమువంటి అథర్వణకారికావళి, పై దు–వర్గ ప్రత్యయములేగాక–ఎడి, ఎడు ప్రత్యయములను తద్ధర్మార్థకములని చెప్పుచున్నది. కాని– ఎద ప్రత్యయమును గురించి యీ వ్యాకరణము స్పష్టముగా జెప్పుటలేదు. ఇట్లే వ్యాకరణమునందు ఎద–వర్గ ప్రత్యయములను గురించి చెప్పుటలో కొంత తబ్బిబ్బు కనబడుచున్నది. ఈ తబ్బిబ్బు వచ్చుటకు కారణమేమి?

11–15 శతాబ్దుల మధ్య తెలుగుభాషలో అనేక పరిణామములు సంభవించుచుండెను. అందు సమాపక క్రియలయందు జరిగిన పరిణతి చాల ముఖ్యమైనది. (1) 12–14 శతాబ్దులమధ్య సంశ్లిష్ట సమాపకక్రియల ప్రయోగములు వృద్ధిం చెందుచు వచ్చెను. కావున తెలుగుభాషలో నీ కాలమున సాధారణ సమాపకక్రియల ప్రయోగములు తగ్గుచుండెనని తెలిసికొనవచ్చును. (2) రాయవాచకము నాటికి తెలుగు భాషలో ఎద – వర్గ ప్రత్యయములకు పూర్తి మార్పు సంభవించెను. –ఎద ప్రత్యయమునకు బదులు –ఏ ప్రత్యయమును, –ఎడి/–ఎడు ప్రత్యయములకు బదులు ఈ ప్రత్యయమును రాయవాచకము నాటికి ప్రయోగమునకు వచ్చెను.[13]

'ఏంతెరచేరు కలిగిన అర్థం నిలుపరముగా చెప్పేము' (వర్తమానార్థకము) రాయ. వా. 81.

'ఈ క్షణాన్నే దేవరవారి చిత్తానకు వచ్చేటట్టు యేనుగు గుర్రాలు బంట్లు నంద రినిన్ని సంతరించేను' (సామీప్య భవిష్యదర్థకము) రాయ. వా. 41.

'యీాల వచ్చేని' రాయ. వా. 46. 'అమరిక అంఘ్యాని' రాయ. వా. 40. (భవిష్యదర్థకము)

ఈ మార్పు భాషలో రాయవాచకమునకు పూర్వమే జరిగియుండవలెను. కావున వ్యవహారమున లేని ఎద–వర్గ ప్రత్యయములను గురించి చెప్పనశె నన్ను ప్రాచీన ప్రయోగములే యాధారములు. ప్రాచీన కావ్యములలో రెండువర్గ ప్రత్యయములకును భవిష్యదర్థక ప్రయోగములు గన్పడుటచేతను, వానిలో కొన్నిటిని తద్ధర్మార్థకము–అని యొక క్రొత్త పేరుతో చింతామణికారుడు పిలుచుటచేతను, బహుశా అథర్వణునకు కొంత తబ్బిబ్బు ఏర్పడియుండును. కనుకనే యితడు –ఎద ప్రత్యయమును తద్ధర్మార్థకమనుటకు ఇష్టపడక భవిష్యదర్థకమని చెప్పియుండవచ్చును.[14]

'భావిక్రియాను యన్యస్యా దేత్వమేవ ప్రయోగతః' అథ–23.

ఇట్లు అథర్వణుడు ఎద–దు–వర్గ ప్రత్యయములను కొంతవరకు కలుపగా, వీని నన్నిటిని కలిపి అహోబల పండితుడు తద్ధర్మార్థకములనెను. వీనిని అనుసరించిన చిన్నయసూరి–వీనిని కేవలము తద్ధర్మార్థకములనుటకు ఇష్టపడక తద్ధర్మాద్యర్థకములనెను.

**ఈ వ్యాసమున నుపయోగింపబడిన యితర గ్రంథములు**

1. నన్నెచోడుడు, కుమారసంభవము, (మద్రాసు యూనివర్శిటీ.)

2. నన్నయ, ఆంధ్ర మహాభారతము, (రామా అండ్ కో, 1946.)

3. బహుజనపల్లి సీతారామాచార్యులు ప్రౌఢ వ్యాకరణము (వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి 1952.)

4. V. చిన సీతారామస్వామిశాస్త్రి (ed), బాలసరస్వతీయము (వావిళ్ల, 1932)

5. ,, అథర్వణ కారికావళి (వావిళ్ల, 1955)

6. కేతన, ఆంధ్రభాషాభూషణము, (వావిళ్ల, 1932)

7. పెద్దన, కావ్యాలంకార చూడామణి, (వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్, మద్రాసు 1936)

8. నన్నెచోడ పదప్రయోగ సూచిక, (ఆంధ్ర సాహిత్య అకాడమి, హైదరాబాదు)

---

13 రాయవాచకమునందలి ప్రయోగములను గురించి చెప్పిన డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారికి నా కృతజ్ఞత.

14. ఇచ్చటకూడ –ఎద–ప్రత్యయముయొక్క పూర్తి రూపమును అథర్వణుడు చెప్పుటలేదు.

# గద్యశైలీ చతుష్పథము

శ్రీ బయ్యా వెంకటసూర్యనారాయణ

ఊనవింశతి శతాబ్దము ఆధునికాంధ్ర గద్యయుగావతరణ కాలము. అంతకుమున్నె అన్యప్రక్రియాంతర్గతములును, స్వతంత్రములును నగు గద్య రచన లెడనెడ జూపట్టినను, దక్షిణాంధ్రయుగమున వచనశాఖ వెలసినను, పద్యశాఖవలె స్వతంత్ర ప్రతిపత్తి గల్గి సాహిత్య సామ్రాజ్యమున గద్యమున కర్ధరాజ్యము లభించుట పందొమ్మిదవ శతాబ్దముననే.

గద్య కావ్యఘంటాపథమున పరుగులు తీసిన ఆంధ్రభారతి దివ్యరథము గడచిన శతాబ్దమున గద్యశైలీ చతుష్పథమున గస్తుట్టుచున్నది. ఇతరేతర విషయముల జోలికిబోక ఆ శతాబ్దమున గద్య రచనను ముందుకు సాగించిన ప్రముఖశైలులు నాల్గింటినిగూర్చి సంక్షేపముగ ముచ్చటించుటయే ప్రస్తుత వ్యాసమున నుద్దేశింపబడినది.

ఒకవిధముగ జూచిన ననేకులశైలిని ఒక వర్గముక్రింద జేర్చుకొనుట సాధ్యముగని విషయమే. ప్రతిపాద్య విషయము, రసము, ఎంచుకొన్న కావ్యభేదము, రచయిత అభిరుచి, శక్తి మున్నగు ననేకహేతువులు శైలీ భేదముల ననంతముగ సృష్టింపజాలియుండును. కాకున్న ఒక రచనను చూచి దానిరచయిత నూహింపగల్గుటెట్లు? అట్లని రచనలెన్నియో శైలీభేదములన్ని యనియు, ఒక్కొక్క కృతియందును భిన్నభిన్నము లగు సన్నివేశముల శైలులు భిన్నములనియు చెప్పుచు బోయిన వీనిసంఖ్యకు పట్టపగ్గములుండునా! వ్యావహారిక దృష్టితో చూచిన నిన్నిభేదములలో నొకింత యైక్యత నాధారముగాగొని స్థూలముగ ప్రధాన శైలుల నిర్దేశింపవలసి యుండునుకదా!

పైని – చెప్పిన పద్ధతిని పందొమ్మిదవ శతాబ్దమున వెలసిన గద్యరచనలలో ప్రముఖశైలీ భేదములు నాలుగని వచింపవచ్చును, 1. కృత్రిమాసుందరశైలి. 2. క్లిష్టశైలి 3. సరళశైలి. 4. సహజ సుందరశైలి. ఈ విభాగమున గ్రాంథిక వ్యావహారికముల నన్నిచోట్లను వేరుచేయలేదు. ప్రథమ చతుర్థ భేదములలో నుభయములును గలవు. ఇక నొక్కొక శైలిని పరామర్శింతము.

శతాబ్దారంభమున క్రైస్తవ మిషనరీల ప్రయత్న ప్రోత్సాహములు ఫలితముగ వెలువడిన రచనలలో నుపర్యుక్తశైలీ చతుష్టయమున తొలుతటిదగు కృత్రిమాసుందరశైలి గాననగును. వీరికి తమ మత ప్రచారమే లక్ష్యముగాని అందుల కుపకరణముగ గ్రహించిన రచనలో భాషాశుద్ధి, శైలీరామణీయకము మున్నగువానిపై దృష్టినిడి సాహిత్యోపయుక్తమగు శైలిని రూపొందించుట కాదు. ముఖ్యముగ వీరు విదేశీయులగుటచేతను, రచనాసౌష్ఠవముపై కాక నిర్దిష్ట ప్రయోజనము వంకకే దృష్టికేంద్రీకృతమగుటను ఈ రచనలలో కృత్రిమాసుందరశైలి కాలిడుట కవకాశమేర్పడినది. తిక్తమయ్యు నౌషధము రోగికి హితకారియే యైనట్లు, సౌందర్యవతిగాకయు మాతృశ్రీ అత్యంత ప్రేమపాత్రయైన విధమున వీరి కృత్రిమాసుందరశైలీవిబద్ధగద్య రచనలును ఆంధ్రగద్య వికాస విస్తరణములకు యథాసంభవముగ దోడ్పడి చరిత్రకారుల మన్ననల నందినవని చెప్పక తప్పదు. ఇట్టి రచనలలో గొన్నిట దేశీయుల సహాయమున్నను వీని స్వరూపమిట్లుండుట విశేషము. కొన్ని రచనలలోని భాగముల నిట నుదాహరించుచున్నాడను.

'ఈశ్వరుని అన్నిమాటలు విశేషముగా మనుష్యుని ఉద్ధారము కొఱకు ఆచరించేటందుకు కోరకున్న దెవి ప్రకారము చెనున్నాడో ఇదె ధర్మపున్తకము—దాని అంత్యభాగము. అర్థము. మాకు ప్రభుడు

ఉద్ధరించే వాడున్నైన యిశు(క్రీ)స్తువని మంగళ సమాచారము.

గ్రీకు భాషవల్లనుంచి తర్జుమాయెను. శ్రీరామపురములో పదెమ్బ ఆయను.[1]

'యిశుక్రీస్తునియొక్క పుట్టడము యీ లాగు వాయెను. అతనియొక్క తల్లి మారియా యునపుని కొరకు వాక్యదత్త ఇందొకుంచున్న వారియొక్క కలుసుకోవడముకంటె ముందుగా ధర్మాత్ముని శేత కడుపులో ఉన్నమవంట్టి దాయెను. దానియొక్క పెనిమిటి యునపుడు యథార్థకుడైన వాడవుకుంచున్న ప్రకాశంగాను కళంకం కలదాన్నిగాను చేయించేటందుకొరకు ఇచ్చ ఇంచక దాన్ని గుప్తరూపము చేత విడిచిపెట్టె టందుకొరకు తలిచెను.1 మరి యెమంటె వాడు ఈ ప్రకారంగా చింతచేస్తూ ఉండగా చూడు ఈశ్వరుని దూత స్వప్నమందు వారికొఅకు దర్శనమును ఇచ్చెను.[2]

మతప్రచారార్థమై క్రైస్తవమతమందర శైలిలో వెలువడిన గద్యరచన క్రమముగ విద్యాబోధనోపయోగిగ కొంత వరకు వ్యావహారిక రూపమును సవరించుకొను చుండిన దినములలో ప్రప్రథమముగ పరవస్తు చిన్నయ సూరి క్లిష్టశైలీ నిబద్ధరచనము గావించి, దానినే నాడు విద్యారంగమున నాదర్శభాషగ చేసినాడు. ఈ యుద్యమమును మరింత క్లిష్టముచేసి ముందుకు సాగించిన మహానుభావు లిరువురు గలరు. ఆధునిక యుగమున తొలి నాటకకర్తగ పేర్కొనబడుచున్న కోరాడ రామచంద్రశాస్త్రిగారొకరు, ఆధునిక యుగ కర్తలు గద్య తిక్కన బిరుదాంకితులునగు కందుకూరి వారికి ప్రతిస్పర్థులు ప్రముఖ ప్రేరకులు నగు బ్రహ్మశ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారిం కొకరు. చిన్నయసూరి శైలియందు కాఠిన్యమున్నను అందొక మాధుర్యము సర్వత్ర పరివ్యాప్తమై యుండు టచే నేటికిని విశేషాదరమును పొందుచునే యున్నది. విశిష్టములగు అచ్చిక తత్సమ పదముల మిశ్రణ విధానమునను, శబ్దాలంకారముల గూర్చుకొనుటలోను శ్రీ కోరాడవారి శైలికి క్లిష్టతయే సమకూడెనుగాని సూరి శైలికిగల మాధుర్యమబ్బలేదు. ఇక కొక్కొండ వారి శైలినిగూర్చి 'మాటలు వేయునేల!' వ్యావహారిక జీవనమాత్ర సంబద్ధములగు లేఖాదులలో సైతము నారికేళపాకమున బడిన గ్రాంథికమునే పొందుపరుచు వీరి శైలి ఒకవిధముగ నాంధ్ర భాషాశైలీ చరిత్ర మున పురావస్తు సంగ్రహాంతర్గతముగ నిలుచు నైతి హాసిక మహత్త్వము గలట్టిది. ఈ మహానుభావుల శైలుల కివిగో మచ్చుతునకలు:—

'......తత్పరిచారికలు కొందఱా వాయసం బెవాయకుం బోయెడినో యేమఱక కనుగలిగి యుండుఁడని యచ్చటి వనపాలకుల నియమించి, సత్వరంబుగం బోయి యా వృత్తాంతంబు రాజపురు షులకు నివేదించి, వారిచేఁ బ్రేరితులగు జనులం దోకొని వచ్చి కానిపించుడు, నా కాకంబు మందగమ నంబునం జని యాత్మావాసంబగు వటకుటుంబు కొమ్మం జేరి నేరిమి నిహాఅం గ్రింది వల్మీకంబునకుం జాటి వడ విడువ నాసరంబు నిహారంబుగం గెంపు మెఱుంగులు దుఱంగలింపఁ దత్తల్య తల వ్యాళ వినాశ విశునోల్కాపాతానుకారి యగుచుం గోమ్రకంతం బడ రాజభటులు గాంచి గునపంబులు లోనగు సాధనంబులు దెప్పించి దానిం గ్రొప్పించిన నందలి దందశూకంబు విషానలంబు దరికొలుపుటకుం బోలె ఘూత్కా రంబులు నిగుడించుచుం, బర ప్రాణానిలంబులు గ్రోలు టకుం బోలె నాభీలంబుగ నాలుక లార్చుచు నిర్గ మించి పయింబడి కఱవం గమకించుడు, వారలు చిక్కని పెక్కు బడియలం జదియ నడిచి దాని పడి యించి యా నేవళంబుం గొనిపోయిరి.'[3]

'అంతకుమున్న సైన్యకనాథ సనాథ తద్భక్త ప్రతిపాదితార్థ రాద్ధాంతీకరణ సిద్ధాంతః కరణుం డగుచు పర్వ్మంబులయుం దాత్మకరణేఁ జతురాది గోళంబులం గరణంబుల బాతి యాపత్రపమేయ ప్రచయాంతర్గతుండై యుండుటంజేసి జగిన్నాయ కుండు సకల మశీల ఖల కమల కువలయ వలయ విలయాకరణ ఖర ఘృణి గణనీయ పుణ్య శ్రవసుం డగు నా విష్ణుశ్రవసుండునుం దత్క్షణంబ యన్వే

1 2. నిడుదవోలు వేంకటరావు; ఆంధ్రవచన వాఙ్మయము. పుట 72.

3. చిన్నయసూరి. నీతిచంద్రిక. మిత్రభేదము నుండి.

టున దానిం బగిలించికొని ధూమప్రభవ గర్భంబునం
భిదిరంబు చాడ్పున క్షితిభృత్కుక్షిస్థలన వాకర విశేష
ప్రభవ వహ్నికరణేం జైనుతికి బెగడు బొడము
నదరించుచు నా యనురంబట్టి తొల్లి నలువ
యొసంగిన వరంబులు దోసంగులు గాకుండం బవ
లును జేతిరియుం గాని మునిమాపున మానిసియు
మెకంబునుం గాని నరహరి రూపంబున లోనిక్క వెలి
చెంకియుంగాని కొలువుకూటంపు దారంపు నడుమ
మిన్నును మన్నునుంగాని కురువుచోటున నుసురరు
లును వానిపెఅలుంగాని గోరుల సకల ప్రాకృత పదార్థ
విలక్షణుండగు నప్పరమేశ్వరుండు బెబ్బులి యుబ్బి
గొబ్బున నబ్బనపుని వ్రీల్చు చందంబున నక్కుండల
దిండుల దండిమగండగు నయ్యాఖండలవిరోధి
వేదండంబు దండించి దండధరునండకుం బనిచె.'[4]

'శ్రీమదాంధ్ర కుమారసంభవము. ఇది శ్రీమత్
కాళిదాస కవీశ్వర నిర్మితమైన కుమారసంభవమను
సంస్కృత కావ్యమునకు భాషాంతరీకరణము. ఇద్ది
మూలమునవలెఁ గేవల పద్యాత్మకమే యౌను. కాని
పద్యమునకుఁ బద్య మన స్వరిగాఁ గానంబడకున్నది.
అనను, రచన సరసముగానే యున్నది. ఈయది,
బ్బాయదనన్ వేంకటగిరి సంస్థానాధిపానుజులైన
మ॥ రా॥ రా॥ రాజా వెలుగోటి ముద్దుకృష్ణయా
చేంద్రుల కంకితంబుగఁ దదాస్థాన కవీశ్వరుండు
నుభయభాషా భూషణుండునగు శ్రీమద్విరుదరాజ
శేషాద్రిరాజ కవిచే విరచితము; బ్రహ్మశ్రీ దేశభట్ల
జానకీరామ పండితులచేఁ బరిష్కృతము; వేంకటగిరి
నగరీ మండనంబగు శ్రీ కాశీవిశ్వనాథ ముద్రాక్షరశాల
యందు ముద్రితము, కృతినాథాజ్ఞచేతఁ బ్రకటితము;
సంజీవనీ సముపలబ్ధము....ఇంతటి ప్రభుసమాశ్రయ
మబ్బినందున నబ్బట్టురాజు కవి భాగ్యశాలియ యని
భావించుచున్నాము. 'భోజునివంటి రాజున్నన్,
గాళిదాసునివంటి కవి యప్పుడే చెప్పడు'నను లోకోక్తి
యుక్తమనియే యిత్తఱిం దలంచుచున్నాము.

| | |
|---|---|
| జయ సం. అశ్వయుజ బహుళ 12 గురువారము. | కొక్కొండ వెంకట రత్నము పంతులు ఆంధ్రభాషా సంజీవనీ పత్రికాధిపతిః |

సమాజముయొక్క అవసరములు అధికమై,
అభిరుచులలో అభూతపూర్వమగు పరివర్తనముగల్గి,
ఒకవంక యుగధర్మము భాషా రచనలందు సారళ్య
మును, సకల విషయ సమన్వితత్వమును గోరుచుండ
గమ్యమునకు దూరముగ బోవుచున్న క్లిష్టశైలీ
వికాసముయొక్క గతిక్రమమును మరలించక తప్పని
స్థితి యేర్పడెను. కసుగాయను కొట్టి రాల్చుటకు
కడగండ్లుగాని పక్వఫలంబును పడగొట్టుటకు పరి
శ్రమలో పనియేమున్నది! అభినివేశములో కొక్కొండ
వారు స్థానాస్థానములతో పనిలేక క్లిష్టగ్రాంథిక
శైలీయుత రచనా రూపమగు గభీరసాగరమున
నాంధ్రసాహిత్యమును, జాతిని చాపచుట్టగ చుట్టి
ముంచివేయదలంపగా నప్పటికా యుద్యమము చరమ
సీమం దాకినది. ఫలితమా! ఇంకేమున్నది! పండు
తనంతటామగ తొడిమను వీడి నేల రాలినది. రథచక్ర
ములు గతి మరలించినవి.

క్రియ, ప్రతిక్రియ అనునవి జీవితరంగమున
వలె సాహిత్య రంగమునను సహజములు, అనివార్య
ములు. కావుననే కాఠిన్యముతో కిడుపునింపుకొనుచున్న
భాషాశైలిని తదితర గుణవిశేషముల గూర్చుటమాట
అటుంచి, సత్వరముగ సారళ్యసముపేత మగున ట్లొన
ర్చె నా యుగద్రష్ట వీరేశలింగము. యుగద్రష్ట కావు
ననే యాతడు యుగప్రవక్త కాజాలినాడు. ఈతని రచ
నలకు గద్యమయత, వివిధ విషయ సంపన్నత, విస్తృతి
మున్నగు నవ్యగుణములతోబాటు సారళ్యమొక ప్రధాన
ధర్మముగా భాసించుచున్నది. ఒక్కయుదాహరణమును
పరికించుట భావ్యము కదా!

'అప్పుడు బైరాగి మఱికొన్ని పిడకలను పైని
బెట్టి మంటవేసి, తాను వేమగిరి కొండమీదనున్న
మూలికలను గొనివచ్చుటకయి వెళ్లెదననియు, తాను
బోయి వానిని గొనివచ్చి పసరు పిండినగాని యంతయు
బంగారము కాదనియు, దాను వచ్చులోపల పిడకలను
వేసి మంటచేయుము జాగ్రత్తతోఁ గనిపెట్టుకొని

4. కొరాడ రామచంద్రశాస్త్రి; నయప్రదీపము విగ్రహము. పుటలు 67, 68.

5. అముద్రిత గ్రంథ చింతామణ్యనుబంధము. పుటలు, 5, 6, 7.

యుండవలయునని యుఁజెప్పి, మూలికల నిమిత్తమయి వెళ్లెను. అతఁడు వనమూలికలకై వెళ్లి యే వేంకును రానందున, రాజశేఖరుఁడుగారు తామక్కడనే యుండి, బైరాగిని పిలుచుకొని వచ్చుటకయి మనుష్యులను బంపిరి. వారును గొండయంతయు వెదకి యెక్కడను అతని జాడనుగానక మందుచెట్టు దొరకక పోవుటచేత దూరపు కొండలకుఁ బోయినాఁ డేమో యనుకొని మరలవచ్చి యీ వార్తను జెప్పిరి. ఆ బైరాగి బంగారముచేయు మూలికలు దొరకనందునఁ గాబోలు మరల రానేలేదు. అతని నిమిత్తమయి యొకదినము వలకు వేచియుండి రాజశేఖరుఁడుగారు పుటము దీసి చూచునప్పటికి దానియందు బంగారమును, వెండియు లేదుగాని తెల్లని భస్మము మాత్ర ముండెను.'[6]

పంతులుగారు కడుసమర్థతతో సమాజ సాహిత్యముల రెంటిని సమానముగానే ఉద్ధరించినను వారి రచనా వ్యాసంగమంతయు నించుమించు సమాజ సంస్కరణోద్యమమునకు సశక్తమగు నుపకరణముగ గ్రహింపబడినదే. ప్రాచీనాచారములను త్రుప్పుపట్టి, కదలక పడియున్న సమాజ మను రథమును త్రుప్పు డుల్లజేసి గంతవ్య పథమున నడిపించుటకై కొని రాబడిన రథ్యములు వారి రచనలు. కావ్యప్రయోగజనములలో 'శివేతరక్షతయే', 'ఉపదేశయుజే' అనికూడ చెప్పినను 'కాంతా సమ్మితతయా' అను పదమునకు ప్రాధాన్యము మెండుగ గలదు. దీని నుపేక్షించిన అది ఇంకేమేమి సాధించినను కావ్యత్వమును మాత్రము పడయజాలదు. ఉదాత్తకవుల సృష్టిలో సమాజమునకు హితకరములగు నీత్యుపదేశము లంతర్వాహినులు. అట్లుకాక తమ దృష్టినంతను వీని పైననే కేంద్రీకరించినవారి రచనలలో కళాధర్మము కొంత కుంటుపడక తప్పదు. కళాకారుఁడుగ కలము సాగింపలేక కాదుగాని, అవధులు నిరూపింప ననువు పడని యధోగతిలో పడిన నాటి సమాజముయొక్క దుస్థితికి కరగిపోయినారు కందుకూరివారు. పంతులుగారు ప్రతిభావ్యుత్పత్తులను పక్షములతో భావాంబర వీథి విశ్రుత విహారము సేయజాలియు, సమక్షము నందలి సత్యమునుకాదని కల్పనాజగత్తులోనికి పరుగు సాగించరైరి. కావుననే వీరిశైలియందు ప్రాయికముగ సారళ్యము గోచరించినంతగా సౌందర్య మభివ్యక్తము కాలేకపోయినది. ఇట్లన్న వారి రచనలన్నియు సౌందర్య విహీనములను నభిప్రాయము గ్రహించుట పాడిగాదు.

భాషాస్రవంతికి గ్రాంథిక వ్యావహారిక రూపములు తటద్వయము వంటివి. అవిచ్ఛిన్నముగ ననుపలబ్ధములయ్యు వ్యావహారిక భాషారచనలు కూడ ప్రాచీనకాలమునుండి గ్రాంథిక భాషా రచనలతో బాటుగ వెలయుచునే యున్నవనుటను గిడుగువారి గద్య చిన్తామణి సమర్థించి యున్నది. పందొమ్మిదవ శతాబ్దముయొక్క పూర్వార్ధమున సరళ వ్యావహారిక భాషను మిషనరీల కృత్రిమశైలియు, సరళ గ్రాంథికమును తరువాతి క్లిష్ట గ్రాంథికమును అణచివేసి ఉచితమగు వికాసమును పొందనీయలేదు. ఆ శతాబ్దాంతమున నదృష్టవశమున సరళములగు ఈ రెండు శైలులును సరళసుందరములుగ రూపొంది కమనీయ కావ్యరచనకు తోడ్పడినవి. సారళ్యమే భాషకు సహజముగుట వీనిని సహజసుందరశైలులని యన్న పొరపాటుకాదు. సహజసుందరమగు గ్రాంథికశైలిని రూపొందించిన శ్రేయస్సు చిలకమర్తివారికిని, అట్లే సహజసుందరమగు వ్యావహారిక శైలిని రూపొందించిన కీర్తి గురుజాడవారికిని లభించుట ముదావహము. రెండే ఉదాహరణముల దిలకించి సత్వరముగ వేడను రేవునకు గొనిపోవుదముగాక!

'ఆ గ్రామమునకుఁ జేరియే యొక మామిడి తోఁట గలదు. విఱుగఁగాసిన యా మామిడిచెట్ల కాయ లెవ్వరైన దొంగిలించుకొనిపోదురేమో యను భయముచేతఁ జెట్లకు నిలువెత్తున ముండ్లకంచె వేసి, పండుట కర్హమైన కాయలు దోరఁబాఱఁగనె బుట్టలఁగట్టి, చిలుకలు మొదలగు పక్షులు కొఱికివేయకుండఁ జేతిలో నొక యుండవిల్లుబద్ద పుచ్చుకొని, మధ్యమధ్య పచ్చని మామిడాకులనడుమఁ గూర్చుండి తన రంగు తెలియకుండ మోసము చేయుచున్న చిలుక వైపున నొకయుండ వేయుచు నొకకాపువాఁడు కాపు కాయుచుండును. ఆవల కోరడివీద మార్గస్థుల దృష్టిదోషమునఁ దోఁటకు భంగిమేమియుఁ గల్గ

6. కం. వీరేశలింగము. రాజశేఖర చరిత్ర. పుటలు 99, 100. (శతవార్షిక ముద్రణము)

కుండఁ గావుఁదలఁగాఁ గావువాఁడు తన శిల్పశాస్త్ర చమత్కారమునంతను వినియోగించి చేసిన వికృతాకారముగల యొక దృష్టిబొమ్మ గలదు. అది వేసవి కాలమగుటచే నతిమనోహరమైన యా వసంత ఋతువునందు శృంగారలక్ష్మికిఁ బుట్టినింటివలెనున్న యా తోటలో నికివచ్చి విశ్రమింపకుండ మార్గస్థుల బెదరించుచుండును. కలసి మెలసి దట్టముగా గుమిగూడుకొన్నవారిని సహస్రకరములు గలవాఁడైన భేదింప జాలఁడని యైకమత్యపయోగములను జనుల కుపదేశించుచున్నవో యన గుజ్జుమామిడి గున్నల యాకులు దట్టమై సూర్యకిరణ దుర్గమంబుగ నుండెను. ప్రభాకరుఁడు తన సహస్ర కిరణములను జగమునందు వ్యాపింపఁజేయుచు సర్వభూత భయంకరుడై భూమండలమెల్ల దహించుచుండెను.[7]

'యేమి పాపత్యం తెచ్చావు? కుక్కకీ గంగిగోవుకూ యెంత వారో, వాడికి ఆయనకు అంతవార. సౌజన్యారావు పంతులుగారు కర్మణా, మనసా, వాచా యాంటీనాచి. 'వేశ్య' అనేమాట యేమరి ఆయన యెదట పలికితివట్టాయనా, 'అసందర్భం' అంటారు. ఆయనలాంటి ఆశ్చాణీలు అరుదు. మిగిలినవారు యథాశక్తి యాంటీనాచులు. ఫౌజా ఫౌజంతా మాటల్లో మహావీరులే. అందులో గిరీశం అగ్రగణ్యుడు. కొందరుబంట్లు పొగలు యాంటీనాచి, రాత్రి ప్రొనాచి; కొందరు వున్నవూళ్లో యాంటీనాచి, పరాయి వూళ్లో ప్రోనాచి: కొందరు శరీర దార్ఢ్యం వున్నంతకాలం ప్రోనాచి, శరీరం చెడ్డ తర్వాత యాంటీనాచి. కొందరు బ్రతికి వున్నంతకాలం ప్రోనాచి, చచ్చిపోయిన తరవాత యాంటీనాచి. కొందరు అదృష్టవంతులు చచ్చిన తరవాతకూడా ప్రోనాచే; అనగా యజ్ఞంచేసి పరలోకంలో భోగాలికి టిక్కట్లు కొనుక్కుంటారు. నా బోటి అల్ప ప్రజ్ఞకలవాళ్లు లభ్యం కానప్పుడల్లా యాంటీనాచే.'[8]

పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థమున ఫోర్టు సెంటు జార్జి కళాశాల పండితులు మున్నగువారు, ఉత్తరార్థమున వావిలకొలనువారు, వడ్డాదివారు, వేదంవారు – ఇంకను పెలువురు రచయితలు వివిధ శైలుల రూపురేఖల దిద్దుటలో ప్రముఖపాత్ర వహించిన వారేయైనను స్థూల విభాగమగుట నిట వారి నెల్లర స్మరింపకుండుటకు కినుక బూనకుడు. ఈ చతుష్పథమునుండి రాజమార్గమునుబట్టి ఆంధ్ర సాహితీ పథికుడు గద్యసాహిత్య క్షేత్రయాత్ర కొనసాగించుచునే యున్నాడు.

'శివా నః పన్థానః సన్తు'

7. చిలకమర్తి లక్ష్మీనరసింహము : రామచంద్ర విజయము. పుటలు 7, 8.

8. గురుజాడ అప్పారావు. కన్యాశుల్కము. పుట. 157.



# గ్రంథ విమర్శలు

## డిసెంట్ పత్రం

[రచన: శ్రీ గురజాడ అప్పారావు; అనువాదం:- శ్రీ పోరంకి దక్షిణామూర్తి; ప్రచురణ:- విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. ఏలూరు రోడ్డు, విజయవాడ; 188 పేజీలు; వెల సాదా ప్రతి రూ. 3 మేలుప్రతి: రూ 4.]

వ్యావహారికభాషా ప్రాశస్త్యాన్ని గూర్చి యీనాడెవ్వరూ సమర్థించనక్కరలేదు. భాషావేత్త గిడుగు, మహాకవి గురజాడలు ఆంధ్రజాతికి మహోపకారం చేసి ఆంధ్రోక్తిమయ ప్రపంచాన్ని వినిర్మించారు. మాండలికాలు భాషలోని స్థిరత్వాన్ని, సువ్యవస్థనూ నాశనం చేస్తాయని వేలకువేల పండితమ్మన్యులు భావించి, అనుకరణ జాడ్యాన్ని అధికంచేసి, ప్రాచీన మహాకవుల పదబంధాలను ఎరువు సొమ్ములుగా ధరించి సృజనశక్తిని నాశనం చేసుకొంటూ పెట్టెల్లో పెట్టిన తేనెటీగలు పెట్టిన తేనెకు మల్లే సారస్వత మకరందాన్ని అందిస్తూ వచ్చారు. నిర్భరత, స్వచ్ఛందమైన భావన, స్వతంత్రమైన తలపులూ ప్రతిభ ఉండికూడ భాషానియమాలకు లోబడి రచన చేయటాన, 'నానాటికీ తీసికట్టు నాగంభొట్లు'గా మన సాహిత్యం మారిపోయిందనాడు. చావచచ్చిన తెలుగుజాతి వాక్కుకు నవోత్తేజాన్నిచ్చిన మహాకవి గురజాడ. పండితుల నెదిర్చి భాష ప్రవాహంవంటిదనీ, శబ్దస్వరూపం మారటం అసహజం కాదనీ అనేక యుద్ధాలుచేసి ఆరితేరి సప్రమాణంగా నిరూపించి జాతి అంతటిచేత తల లూపింపజేసికూడ పండితుల హృదయాల రాతిబండల్ని కరగింపలేక పోయారు గిడుగుపిడుగు.

'గుండు కా! కా!మంటు కొట్టినట్టుగ నేటి పండితులు కారెత్తి పరుగుప్పుకోవాలి' అని ప్రతిజ్ఞచేసి నిల్చుకొన్న బసవరాజు, పండూరివంటి వారి ధాటి కాగలేక పలాయనం చిత్తగించిన పండిత ప్రకాండులు చాటుమాటుగా దొంగదెబ్బలు తీస్తూనే వున్నారు. విశ్వవిద్యాలయాలనే కోటబురుజులను, అధికారం అనే మేకపోతు గాంభీర్యంతో కంచుకోటలుగా భ్రమింపచేస్తూ ఆశ్రయించి బ్రతుకులను వెళ్ళమార్చుకుంటూ భాషను శాసిస్తున్నారు. విశ్వవిద్యాలయాల్లో గ్రాంథికభాషతప్ప పనికిరాదంటున్న యీ పండితులు తమ జీవికకోసం, అస్తిత్వంకోసం, కీర్తికోసం వ్యావహారికంలోనే తమ రచనలను వెలయిస్తున్నారు.

కొత్తంటే గొంతు పిసుక్కుంటూ, యతిప్రాసలు లేక పోవటాన్ని, గణ విచ్ఛేదాన్ని పద్యంలోనైనా నూతనమైన ఉపమానాలు సృజించటాన్ని నేటినీ సహించలేని పండితోత్తముల నుద్దేశించి

'మెచ్చనంటావీవు

మెచ్చుకుంటే మించి పోయెను' అని చెప్పి త్రోసిరాజని వాడుక భాషలో జీవమున్నదీ, హృదయాన్ని లరించేవీ అయిన కావ్యాలకు ఒరవడిపెట్టారు, గురుజాడవారు. రాయప్రోలువంటి కవులు భావనలో నూతనమైన దారు లేర్పరచి తరువాత కవుల కనుసరణీయులయ్యారు. వెనుకచూపుతప్ప ముందు చూపులేని మెట్టవేదాంతులైన పండితులకు కళ్ళెదుట, సహేతుకంగా సప్రమాణంగా జీవద్భాషయైన వ్యావహారికమంటే యేమిటో భాషలోనూ భావంలోనూ అన్నింటా ఆధునికత్వం వ్యావహారిక భాషవలన ఏ విధంగా సాధింపబడుతుందో నిరూపించినది యీ 'డిసెంట్ పత్రం'. 'భాషను ఆధునీకరించటమంటే దాన్ని వ్యావహారికీకరించటం కాదు.' అనే ఆచార్యవర్యులింకా యీ నాడు ఉన్నారంటే వారిమీద జాలి కలుగుతుంది తెలుగు వాళ్ళ నుడికారాన్ని జీవాన్ని నింపుకొన్న భాష విశ్వవిద్యాలయాల్లో చోటు చేసుకోవటానికి యింకా యెంత కాలం పడుతుందోగదా అనిపిస్తున్నది.

భాషలో ఏ విధమైన అవ్యవస్థనూ సహించలేమనే వారు 'చీకటిలో అరసున్నకై వెదికే' పండిత

ప్రకాండులు గుమిగూడి 'సాహిత్య అకాడమీ'వంటి దుష్ట సమాసాలను సృష్టించి దాన్నే ప్రామాణికంగా భ్రమించి, ఆధునిక భాషను శాసకులమని విజృంభించడం విస్మ్యతేయు. 1914 లో – అంటే అప్పుడే అర్ధ శతాబ్దం గడిచిందన్నమాట – మదరాసు యూనివర్సిటీ సెనేటు సభ్యులుగా ఉండి పండితులు భాషాప్రవాహాన్ని అడ్డుకట్టకట్టి సాహసించారంటే ఆశ్చర్యమేమున్నది? కాని ఆశ్చర్యపడవలసిన సంఘటన ఒకటి జరిగి చరిత్రలో స్థిరస్థాయిగా నిలిచిపోయింది. భాషయొక్క సమగ్ర స్వరూపాన్ని చూడటానికి, దృష్టిని చెదరనీయకుండ ఉండటానికి కావలసిన హృదయ వైశాల్యం సమ్యగ్దృష్టిలేని 'పండిత గ్రీవులు' అంతా కలిసి ఏకగ్రీవంగా తీర్మానంచేసిభాషకు సజీవ సమాధి కట్టాలని సిద్ధమైనప్పుడు అది వీల్లేదని యెలుగెత్తి అరచి, తన 'dissent' ప్రకటించి సహేతుకమూ, సప్రమాణమూ అయిన గ్రంథాన్ని సమర్పించిన ఘనుడు శ్రీ. శే. గురజాడ అప్పారావు.

శ్రీయుతులు జయంతి రామయ్య పంతులు, కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారలీ ఉపసంఘంలో ఉండటం అబ్బురమేమీ కాదు. వాళ్ళు వ్రాస్తున్న భాష ఎంత కృతకమో వాళ్ళు వ్రాసిననాడు కాకపోయినా యీనాడెందరో గ్రహిస్తున్నారు. అసలు పై పండితుల మాటల్లోనే ఎన్నో పరస్పర విరుద్ధాంశాలుండటాన్ని శ్రీ గురజాడ వివరించి చెప్పారు. ఈ 'డిసెంట్ పత్రం' ప్రచురణావశ్యకతను శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సువారు ఆ నాడే గ్రహించి భాషా విషయంలో తమ శ్రద్ధను వ్యక్తం చేశారు. ఇదే ఆ నాడు ప్రచురితం కాకుంటే 'సెనేటు' బయట నున్న భాషాభిమానులు పలువురకీ విషయాలు తెలిసేవి కావు. ఈనాడైనా తెలిసేమి ప్రయోజనం? ఆ పండిత ప్రకాండుల ఆటలింకా సెనేటు తదితరమైన పరీక్షా నిర్ణాయక సభలలో సాగుతూనే ఉన్నాయి. ఐనా తెలుగు వాళ్ళు తమ భాషా స్థితిని తెలుసుకోవటానికి యీ 'డిసెంట్ పత్రం' చదివి తీరాలి. తెలుగులోనే చదివేటందుకు వీలుగా శ్రీ పోరంకి దక్షిణా మూర్తిగారు చక్కని తెలుగు అనువాదంచేసి భాషాభిమానుల ప్రశంసలకు పాత్రులయ్యారు.

తెలుగుదేశమెంత విశాలమైనా, ఏ జిల్లాలో మాట్లాడే భాషయైనా మిగిలిన జిల్లాల వారందరికీ అర్థమవుతుంది. గిడుగు, గురజాడలు వాదించిన యీ విషయాన్ని పత్రికలు వ్యావహారిక భాషలోనే ప్రచురితమవుతూ నిరూపించాయి. సాహిత్య సృష్టి మాండలికభేదాలవల్ల సంకుచితమైపోదనీ, ప్రతిభఉంటే ఆ పరిమళం దశదిశలా వ్యాపిస్తుందనీ శ్రీ పోరంకి దక్షిణామూర్తిగారు తమ నవలల్లో రుజువు చేశారు. గోదావరిజిల్లాలభాషలోనూ, తెలంగాణా ప్రాంతీయుల మాటలతోనూ ఆయన 'వెలుగూ–వెన్నెల–గోదారీ'; 'ముత్యాల పందిరి'వంటి నవలలు వ్రాసి నిరూపించారు. భాషపట్ల అంత మక్కువ ఉండబట్టే ఆయన గురజాడ భాషాసేవను అభినందించి తెలుగు భాషాభిమానులందరూ గురజాడ అభిప్రాయాలను తెలిసికోవలసిందిగా వాటిని మన ముందుంచారు.

గురజాడవారి బహుగ్రంథపరిశీలనమూ, భిన్న మాండలికాల తీరుతెన్నులు, వాటిలోని ఏకత్వమూ, శాస్త్రీయమూ, క్రమపరిణతమూనైన భాషాస్థితి నిరూపణము, తెలుగుజాతి జీవనాడిని ఆయన విన్న విధమూ 'డిసెంట్‌పత్రం' చక్కగా తెలియపరుస్తుంది. గిడుగుపిడుగు వ్రాసిన 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజము' ఎంతటి విప్లవాన్ని తెచ్చిందో 'డిసెంట్‌పత్రమూ' అంతటి విప్లవాన్ని తెచ్చి జీవద్భాషను సమర్థిస్తుంది. గురజాడది ప్రశాంత విప్లవం. పైపెచ్చు గురజాడ మహాకవి; ఉత్తమ నాటక రచయిత.

ఆయుర్వేదంలో పండితులైన పండిత. డి. గోపాలాచార్యులవంటివారు భాషకు సంబంధించిన నిర్ణయాలు చెయ్యబూని గురజాడను 'అపండితుడ'ని నిందిస్తూ ఆరోపణ చేశారు. అటువంటి వారందరికీ దిగ్భ్రాంతి గొలిపేవిధంగా గురజాడ ఎంతటి మహాపండితుడో తెలుస్తుంది 'డిసెంట్ పత్రం' చదివితే. భాషాభిమానులూ జిజ్ఞాసువులూ అందరూ తప్పక చదువతగినది 'డిసెంట్‌పత్రం'—

## శ్రుతి తప్పిన రాగం

(రచన: పాకాల వెంకటరాజమన్నారు; ప్రచురణ: శ్రీయం. శేషాచలం అండ్ కో– ఎమెస్కో బుక్స్ సీరీస్–160 పేజీలు–వెల రూ. 2.00.)

ఏకాంకికా రచనలో సిద్ధహస్తులైన వారిని పేర్కొనవలసివస్తే శ్రీ రాజమన్నారుగారి పేరు ముమ్మొదటగా పేర్కొనాలి. 'సంస్కృతాంధ్ర తమిళ సాహితీ పరిపాకాల మిన్నేరు శ్రీ పాకాల వెంకట రాజమన్నారు' అని వారిని కొనియాడడం సబబే. సంభాషణలను నడిపించటంలోను, సన్నివేశాన్ని రూపు కట్టించటంలోను శ్రీ రాజమన్నారు ప్రతిభ అనన్య సామాన్యం.

'శ్రుతిమించిన రాగం' నవల చదివినప్పుడు ఈ నవల అసలు రాజమన్నారుగారు వ్రాసిందేనా అన్నంత దిగ్భ్రాంతి కలుగుతుంది. 'తీర్పు', 'విష్ఫలం' 'ఏం మగాళ్ళు' 'దెయ్యాలలంక' వంటి అత్యున్నత ప్రమాణాలుగల నాటికలు వ్రాసిన రాజమన్నారుగారు యింత చప్పటి నవల వ్రాయటమేమిటనిపిస్తుంది. నవలా రచనలో తొలి యత్నంచేసే ఏ యువ రచయితైనా యింతకంటె బాగా వ్రాయగలరనిపించేటంత పాహా కథినమే యిందులో కన్పిస్తుంది. నవలా శిల్పమంటే రాజమన్నారుగారికి ముక్కు మొగము తెలియదనటం అతిశయోక్తి కాదని ఈ నవల చదివిన తరువాత అనిపిస్తుంది.

కీ. శే. వేదము వెంకటరాయశాస్త్రిగారి 'ఉష' నాటకాన్ని విమర్శిస్తూ కీ. శే. గురజాడ అప్పారావు రావుగారు శ్రీ వేదము వారికి 'నాటక శిల్పమన్న ముక్కు మొగము తెలియదు' అని వ్రాశారు. అంత మాత్రంచేత 'ప్రతాపరుద్రీయము' మంచి నాటకం కాదనలేము. శ్రీ రాజమన్నారుగారు ఉత్తమ నాటికా రచయిత గదా అని ఉత్తమ నవలా రచయితగా అంగీకరించలేము. శ్రీ రాజమన్నారు పతిత స్త్రీలయెడ అపారమైన కరుణ గలవారు. ప్రేమచంద్, శరత్‌ల వలె తెలుగులో చలం, గురజాడల తరువాత రాజమన్నారుగారు పేర్కొనదగినవారు. 'శ్రుతితప్పిన రాగం' నవలలో 'కళ్యాణి' పతితయైన పరిస్థితులమా, అసలామె తన మేనమామచేత మోసగింపబడింది తప్ప తరువాతెప్పుడూ తన శీలాన్ని కోల్పోకపోయినప్పటికీ, తానెక్కడ ఆశ్రయాన్ని కోరినా అక్కడి పురుషులామెను వేటాడి వేధించి వశం చేసుకోజూస్తారు. ఆమె యుక్తిగా తప్పించుకుంటూ ఒకచోటనుండి మరొకచోటికి పారిపోతుంది. ఐతే అన్నిచోట్ల ఆమె వారిని మోసగించి తప్పించుకొనిపోవటానికి వాడే సాధనం ఆమెకు కలకత్తాలో పరిచయమైన స్నేహితుడిచ్చిన 'దత్తూరా' అనే మత్తుమందు. ఈ విషయంలోనే రాజమన్నారుగారి శిల్పం దెబ్బతిన్నది. ఏదో జానపద కథలో నాయిక Adventures చేస్తున్నట్లు అనిపిస్తుందిగాని సహజమనిపించదు.

కళ్యాణి అభాగిని. తండ్రి చిన్నప్పుడే చనిపోగా వయస్సొచ్చిన తరువాత తల్లి కూడ కళ్యాణిని తన సోదరుని చేతిలోపెట్టి కన్ను మూస్తుంది. కళ్యాణి మేనమామ కృష్ణయ్యచౌదరి పెద్దవ్యాపారస్తుడు. మొదటి భార్య చనిపోగా రెండవ భార్యనుకూడ తెచ్చుకున్నాడు. ఆమె జబ్బుతో 'శానిటోరియం'లో చేరుతుంది. అప్పుడు కళ్యాణి తల్లి చనిపోగా కృష్ణయ్యచౌదరి ఆమెను తన బంగళాకు తీసికొనిపోతాడు. తన బంగాళా, కారు, చీరెలు, నగలు చూపించి కళ్యాణిని వశం చేసికొనాలనుకుంటాడు. కాని కళ్యాణి గడుసుది. వివాహం చేసికొంటేనేగాని లొంగిపోవటానికి సమ్మతించదు. రహస్యంగా 'రిజిస్టర్ మ్యారేజి' చేసుకొంటాడు. ఐతే, మోజు తగ్గిపోగానే కళ్యాణిని శంకించి, అర్ధాంతరంగా కలకత్తాలోనే విడిచి వెళ్ళిపోతాడు. అప్పటికి కళ్యాణి గర్భవతి. ఆమె తర్వాత ఎన్నో Adventures చేస్తుంది. చివరకు చౌదరి ఇల్లుచేరి నిజాన్ని వెల్లడిస్తుంది. అతడు పశ్చాత్తాపం పొంది కళ్యాణినీ, బిడ్డనూ స్వీకరిస్తాడు. కాని అంతలోనే ఆమెను 'అరెస్టు' చెయ్యటానికి పోలీసుల గాలింపు ప్రకటన కన్పిస్తుంది. నిరాశతో ఆమె అక్కడనుండికూడ వెళ్ళి తిరుపతికొండల మీదనుండి పడి ప్రాణాలు విడుస్తుంది. ఇదీ కథ.

అభాగినులపట్ల జాలితప్పించి సన్నివేశ కల్పనా, సంభాషణాచాతురి, శైలీ విన్యాసం వీటన్ని

టితో కూడిన నవలా శిల్పం, ముఖ్యంగా జీవితంపట్ల కలిగించవలసిన అవగాహన ఏదీ 'శ్రుతితప్పిన రాగం'లో కన్పించదు. నాటికా రచనతో వీణానాదం విన్పిస్తున్న రాజమన్నారుగారు నవలా రచనచేసి శ్రుతితప్పినరాగం విన్పించారు. శ్రీ శ్రీ వంటి కవి కథలు వ్రాసినప్పుడు ఆ కథల్లోనూ సహజంగా కవిత్వం పొలుపొందుకొంది. కాని అదేమి ప్రారబ్ధమో రాజమన్నారుగారి నవలలో వారికి సహజమైన నాటకీయ సంభాషణా రచనకూడ చోటు చేసికోలేకపోయింది.

సాహిత్య ప్రక్రియలలో ఎవరి అభిరుచి వారిదే. ఎవరికి సహజమైన భావ వ్యక్తీకరణ సాధనాన్నే వారు ఏరుకుంటారు. కీ. శే. గోపీచంద్‌గారు పద్యం వ్రాయాలని ప్రయాసపడలేదు. అలాగే కృష్ణశాస్త్రిగారి వంటి ప్రతిభావంతులు నవలా రచన చెయ్యటానికి ప్రయత్నించలేదు. కొందరికి ఒకటికంటె ఎక్కువ సాహితీ ప్రక్రియలలో అభిరుచి, అభినివేశమూ ఉంటాయి. అమేయ ప్రతిభాశాలురైన విశ్వనాథ వంటి వారికి అన్ని సాహితీ ప్రక్రియలలోనూ అగ్రగణ్యత లభించవచ్చు. అయినా ఒక ప్రక్రియలో సిద్ధహస్తులైనవారు మరో ప్రక్రియలో ప్రయత్నం చెయ్యడం తప్పేమీ కాదు. అవశ్యం చెయ్యొచ్చు. కాని 'శ్రుతితప్పిన రాగం' నవల రాజమన్నారుగారి విఫల ప్రయత్నమే.

—శ్రీ రామమోహనరాయ్.

## కథాక్షేత్రము

[కృతికర్త: శ్రీ బోడేపూడి వేంకటరావు; ప్రచురణ: త్రివేణీ పబ్లిషర్సు, మచిలీపట్టణము. మూల్యము: మూడు రూపాయలు]

సౌందరనందము మార్గము ననుసరించి ఈ నేటికాలమున ఆంధ్రమున వెలసిన బౌద్ధకావ్యములలో నీ కథాక్షేత్రము నొకటి. ఇందు ప్రశంసాఖండము, అవతారఖండము, చరిత్రఖండము అను మూడు భాగము లున్నవి. కాలక్రమము ననుసరించి యున్నచో ప్రశంసాఖండము మూడవదిగా నుండవలసినది. కాని కవిగారు ముందు నాగార్జునపర్వత శిల్పవిశిష్టతను మరియు తత్సంబంధి పురాతన విశేషములను మొత్తముమీద ఆంధ్రబౌద్ధమహాసీయులను కొనియాడిరి. అదియే ప్రశంసాఖండము. ఆ పిమ్మటిది అవతారఖండము. ఇందు బుద్ధజననాదికములలోనున్న వాని జీవితకథా సన్నివేశముల వర్ణనము కలదు. బుద్ధుని యనంతరము దేశమునను, విదేశములను ఆ మత మెట్లు వ్యాప్తినందినదియు వివరించునది చరిత్రఖండము. ఈ మూడింటిలోను అవతారఖండము పెద్దది.

శ్రీ వేంకటరావుగారు ఈ గ్రంథమును మూడు వంతులు పట్టివర్ణనములతోడనే నింపినారు. కథావస్తువు చాల తక్కువ. బుద్ధుడు జన్మించుట—వివాహమగుట—విరక్తి—బుద్ధుడగుట—ఇత్యాదుల నొక భాగముగాను, బుద్ధుడు బింబిసారుని మనసు మార్చు సన్నివేశమును, బుద్ధుడు కపిలవస్తు నగరమునకు తిరిగివచ్చి, భార్యాపుత్రులాయనను కలిసికొనుట మరి రెండు భాగములుగను మొత్తము అవతారఖండము రచింపబడినది.

గ్రంథమును వర్ణనాత్మకముగా నిర్వహించుటకు కవి మంచి ఊహాపోహలు కలవాడు కావలయును బహువిషయములను సూక్ష్మాతిసూక్ష్మముగా పరిశీలించి భావించు నేర్పుకలవాడు కావలయును. శ్రీ వెంకటరావుగారు ఆయా విషయములందనన్యమైన ప్రతిభాబుద్ధి కలవారు. పద్యరచనమునందును శ్రీ వేంకటరావుగారు లెస్సగా చేయి తిరిగినవారు. ప్రాచీనాంధ్రకవుల అందములయిన పద్యరచనావిధానములన్నియు శ్రీ రావుగారికి కరతలామలకములు. ప్రశంసాఖండ వర్ణనమంతయు ఇప్పుడు మనయెదుట ఆయా సన్నివేశములున్నవనిపించునంత చక్కగా నున్నది. ఈ కావ్యమున మరొక్క విశేషమున్నది. ఈ అవతారఖండమున కొద్దిపాటి కథ యున్నది గనుక పాత్రములుండును. ఉన్నవి నాలుగు. వస్తుప్రాధాన్యమున్న గ్రంథముకాదు, అందువలననే పాత్రప్రాధాన్యము గూడ లేదు. అనగా ఆయా పాత్రములను విశిష్ట వ్యక్తిత్వలక్షణము కలవారుగా నిరూపించు ప్రయత్నమంతగా లేదన్నమాట. మామూలుగా బుద్ధుని కథలో ఉండవలసినట్లే ఆ యశోధర, ఆమె కుమారుడు మొదలయిన వారున్నారు. శ్రీ వేంకటరావుగారు, తమ లోకాతిశయమైన ఊహాశక్తి చేతను, తమ మతతాత్త్వక విషయ విజ్ఞానముచేతను, పద్యరచనా

శిల్పనైశిష్ట్యముచేతను, సమాన కల్పనా పాటవము చేతను, శబ్దప్రయోగప్రౌఢిమచేతను ఈ కావ్యమును మహోదాత్తముగా నిర్మించినారు. శివభారతము, ఆంధ్రపురాణము మొదలయిన కావ్యముల తరువాత పేర్కొనదగిన నవ్యత, హృదయాహ్లాదిత ఈ కళా క్షేత్రము నందున్నవి. కవిత్వకళ ఇందు పూర్ణవికాస స్థితినందియున్నది.

నాగార్జున పర్వత శిల్ప కళాఖండములను వర్ణించు నీ పద్యము శ్రీ వెంకటరావుగారి కావ్యపరిణతకొక మచ్చు.—

'మాటలాడును భావ మహితాక్షరంబుగా
ముగ్ధమోహన దివ్యమూక భాష
ఆటలాడును భరతాచార్యులకు మెచ్చు
లావహిల్లగ విశ్వలాంగకముల
పాటపాడును మానవ శ్రవోవీథుల
కందంగరాని యుదాత్త ఫణితి
చాటిచెప్పును రసస్యందంబుగా బుద్ధ
భగవానుగాథా ప్రబంధములను
నిర్నిమేష ప్రశాంతవహా నేత్రములనె
స్వాగతంబిచ్చు నిచ్చ నభ్యాగతులకు
ఏకళాబ్రహ్మసృష్టియో యీ ప్రపంచ
మజుని సృష్టికి మేల్బంతి యనగనొప్పు.

మాయాదేవి గర్భవతికాగా

యతి మూర్ధన్యుడు గర్భగోళమున
దివ్యజ్యోతియై వెల్గను
ప్రతయాస్యంబున వెల్గదో చె
మృదుతల్ భాసించె వాక్యంబులన్
గ్రతు ముఖ్యంబులు శ్రౌత కర్మముల
కాంక్షల్ జాఱె సర్వాత్మనా
ప్రతిభాసించె నితాంత దుఃఖమయ
విశ్వంబెల్ల మల్లంబునన్.

కవితాప్రియులు, సాహిత్యపరులు చదివి ఆనందింపదగిన నవ్యకావ్యవిహార కళాక్షేత్రము.

## ఇంద్రద్యుమ్నీయము

(కృతికర్త: శ్రీ రంగరాజా కేశవరాయుడు, సంపాదకుడు: శ్రీ పేర్వారం జగన్నాథం, ఎం. ఎ., ప్రచురణ: సాహితీబంధు బృందం, హనుమకొండ, వరంగల్లు. మూల్యము: ఐదు రూపాయలు, ప్రతులకు: చందా నారాయణశ్రేష్ఠి—వరంగల్లు.

ఇంతవరకు వెలుగుచూడని పందొమ్మిదవ శతాబ్దపు ప్రబంధమిది. దీనిని రచించిన శ్రీ కేశవరావుగారు వరంగల్లుజిల్లా జనగామ తాలూకా ఖిలాషాపురమువారు. ఆనాడాయన దేశముక్. అరబ్బీ, పార్సీ, ఉరుదూ, సంస్కృతాంధ్రములలో గొప్ప పండితులు. పార్సీ కవిత్వముచేత నవాబును మెప్పించి కవి శిరోమణి అను బిరుదమును పొందిరి. తెలుగులో వీరు చాల గ్రంథములు రచించినారు. ఇంతవరకు తెలియవచ్చినవే ఇరువదిమూడున్నవి. ఇందులో ప్రబంధములు, యక్షగానములు, శతకములు, కీర్తనలు, మొదలయిన పలు రకముల గ్రంథములున్నవి.

శ్రీ పేర్వారం జగన్నాథముగారు, ఉస్మానియా విశ్వవిద్యాలయము తెలుగుశాఖలో ఉపన్యాసకులుగానున్నారు, శ్రీ రంగరాజా కేశవరావుగారి అముద్రిత గ్రంథములను సంపాదించి ప్రకటించుటకు పూనుకొనుట మిక్కిలి అభినందింపదగియున్నది. ఇప్పటికెందరో మహానుభావులయిన కవుల గ్రంథములు వెలుగులోనికిరాక మరుగునపడియున్నవి. తెలంగాణమున మరియును. శ్రీ జగన్నాథముగారు మరియు అముద్రితములయిన తెలంగాణమునందలి ఆంధ్ర ప్రబంధములను సంపాదించి ప్రకటించుట ఎంతయు ప్రోత్సహింప తగినది.

శ్రీ కేశవరావుగారు పద్య రచనా శిల్పవిధాన పారంగతులు. ప్రాచీనాంధ్ర కవుల పోకడలన్నియు నల్లేరు మీద బండి నడకగా పోగలవారు. వసుచరిత్ర వ్రాయబడిన తరువాత తెనుగు కవులకు దాని ననుసరించి వ్రాయుటమే తప్పనిసరియైనది. ఆ కాలమున ఆ గ్రంథము రచనా శిల్పము గొప్పగా ప్రజల చిత్తముల నాకట్టుకొన్నది. కనుకనే పిల్లవసుచరిత్రలు కోకొల్లలుగా వచ్చినవి. అభినందించువారు, ఆనందించువారు లేనిచో ఆ పద్ధతిన మరొకడేల వ్రాయును? రెండు మూడువందల సంవత్సరములు ఆంధ్రదేశమున సాహిత్యాభిరుచి వసుచరిత్రము నాదర్శముగా పెట్టుకొని యున్నది. అంతటి గౌరవము మరియే తెనుగు గ్రంథమునకును దక్కలేదు. శ్రీ రంగరాజా కేశవ

రాయ ప్రణీతమైన ఈ ఇంద్రద్యుమ్నీయ ప్రబంధము ఏతల్లక్షణలక్షితమై మహాకృతిగా నున్నది. శ్రీ కేశవ రావుగారు పాండిత్యముచేతను, పద్యరచనాశిల్పము చేతను ప్రాచీనాంధ్ర ప్రబంధ కవులను పోలినవారయ్యు, ఈ ప్రబంధమును శృంగారాత్మకముగా నిబంధింప కుండుట ఒక గొప్ప విశేషము. ఇతివృత్తముకూడ ప్రబంధములయందువలె లేదు. పౌరాణికములయందు వలె నున్నది. ఈ గ్రంథమున యుద్ధవర్ణన మెక్కువ. సంస్కృతాంధ్రములను సమఉజ్జీలుగా నిలిపి కవిత్వ మల్లుట శ్రీ రావుగారి ప్రత్యేకత. ఉత్ప్రేక్షలయందు శ్రీ రావుగారు ప్రాచీనులకు ఏ మాత్రము తీసిపోరు. సమాస నిర్మాణము ధారాప్రవాహమురీతి నుండును. శ్రీ రంగరాజు కేశవరాయ ప్రణీతమైన ఈ కృతి ప్రబంధకవితయొక్క చిట్టచివరి రోజులలోని వైభవమునకు నిదర్శనము.

ఇంతగా బహువిధముల ప్రమాణభూతమైన కృతిని శ్రీ జగన్నాథముగారు విపులమైన చారిత్ర విషయ వివరణములతో పీఠిక సంతరించి గ్రంథ సంపాదనమును నెరపుట మిక్కిలి ప్రశంసింపదగి యున్నది. ఉదాహరించుటకు చాల పద్యములు కలవు. కోడికూతను వర్ణించిన ఈ పద్యమును చూడుడు. (5-48.)

'రెక్కలుమిక్కుల దీడికొంచు నపుడో
ద్యుపతిన్ గళంబుబ్బయి
న్నిక్కన్ బొక్కపు గంఠనాదములు కో
టీ నిర్జరుల్నిద్దుర
ల్చక్కన్ చెప్పుట దోప జానపదులిం
డ్లన్నారె కుద్యేలమై
కొక్కొక్కోయని తామ్రచూడ వితతు
ల్గూపెన్ కరాళార్భటిన్.

మరొక్క సీసపద్యము. (6-69)

'బాల్యకేళిన కళాలోల్యులు మత్తమా
భవులు గారుర్వరాభరణచణులు
విరళ సంతోషవర్ధితలు కూతురులు గా
రనఘ మామక వియోగానుభవులు
మృదుతల్పకాంచలపరలు మత్పతులు గా
రటవీపథాచలకటకచరులు
భగవత్ప్రియాప సంప్రాప్తిగాగల దియు
మనఘ కాదిది తదుపాస్తిహితము
రాజ్య మెటుడింతు విడిచిపోరాదు మతల
నెట్టు లడవులు దిరుగుదు నెట్లు మూఢ
భావభాగ్వైరదాకృతి బట్టువాడ
దిక్కులేదీపుడక్కగా దీనశరణ.'

ప్రౌఢ కవితాప్రియులు ఈ కృతిని సమాదరింతురు.

—క్షేమేంద్ర.

## తాను వెలిగించిన దీపాలు

[సాహిత్యఅకాడమీ అవార్డుపొందిన శ్రీ మధురాంతకం రాజారాం కథలు. ప్రతులకు: విశ్వప్రభ ప్రచురణలు నేండ్రగుంట, చిత్తూరుజిల్లా. వెల: రూ. 3-00. పేజీలు 172. కథలు 8.]

'తాను వెలిగించిన దీపాలు' సంపుటిలో మొదటి కథ, అధ్యాపకుడయిన 'శర్మగారు' కథ.

ముప్ఫయిఅయిదేళ్లు పనిచేసి ఉద్యోగ విరమణలో వుంటున్న 'శర్మగారు' తను పనిచేసిన పాఠశాల చూడబోయి, ఆశించిన ఫలితం చిక్కక విరామయంగా తిరిగి వెళ్లిపోతూ మార్గమధ్యంలో గోపాలం అనే పాత విద్యార్థిని ఆకస్మికంగా కలిసి, ఆశించని గౌరవంపొంది మనుమరాలికి అధ్యాపకవృత్తి చేపట్టదగిందని చెబుతుంటే పాఠకులు ఆనందం పొందుతారు.

'జారుడుమెట్లు' కొంచెం పెద్దకథ. సాహితీ జీవితంలోని తారతమ్యాలు ప్రదర్శించే కథ.

నీలకంఠం చక్కని రచనలు చేసికూడా పేరు ప్రతిష్ఠలు రాక, ఆర్థిక పరిస్థితులూ, అపనమ్మకమూ కారణంగా ఇల్లు వదిలి వెళ్లిపోయి, బహుకాలం శ్రమించి, తిరిగి స్వస్థలం వస్తూ మార్గంలో పత్రికలు పుస్తకాలు చూచి సాహిత్యం పొందిన పతనం గూర్చి ఆలోచిస్తూ, తన పేరుతో చలామణీ అయ్యే రచనలు చూచి ఆశ్చర్యపోయి, ఆ పుస్తకాలు ప్రచురించిన సంస్థను చూడబోయి, అక్కడ తన కొడుకు ప్రకాశంను చూచి, పరిస్థితి అర్థంచేసుకొని, కాలానికి ఎదురొడ్డి నిలువగల రచనచేసి సంతో

షించాడు. ఈ కథ కరుణరసరమ్యంగా చిత్రిత మయింది.

'చేదునిజం' కూడా రచయితలు ఇతివృత్తంగా గల కథ. అసహజమూ, సహజమూ మధ్య తలెత్తు తున్న కథా రచనా విధానంమీద చర్చనంటేదీ కథ.

రాధాపతి పేరున్న రచయిత ప్రకాశం రచన చేయాలని ఉత్సాహం ఉన్నవ్యక్తి. ప్రకాశం రచనలు అసహజంగా ఉన్నాయి. రాధాపతి పడేసుకొన్న గాజును గూర్చి ప్రకాశం ఆసక్తి చూపితే, రాధాపతి గాజుకు సంబంధించిన కథ ఒకటి కల్పించి చెబుతాడు. platonic love వంటి కథ. అది అసహజం అని రచయిత అభిప్రాయం. చివరకు ఆ గాజుకు సంబంధించిన అసలు విషయం చెబుతాడు రాధాపతి. అసహజంగావుండి కల్పనాలోకాలలో విహరించేసే కథా రచన చేయరాదని చెప్పేదీ కథ.

'సర్కస్ డేరా' మానవత్వం పొందే అవమానం ప్రదర్శించే కథ.

నాగులు బలం ప్రదర్శించి సర్కస్ టిక్కెట్లు కొని, రెట్టింపు ధరకు అమ్మటం, సర్కస్‌లోని కార్యక్రమం వర్ణించటం ఇందులో ప్రధానం. మనిషి శారీరక బలంచూపి టిక్కెట్లు సంపాదించటం, పశువుల్ని చిత్రహింసపెట్టి సర్కస్ ఆడించటం, దానికితోడు మనుష్యులు జంతువులులాగా మసలుకోవటం ఇదంతా బాధాకరంగా వుంటుంది. ఇది హృదయం కదిలించే కథ.

'విధి విలాసము'లో విధి విలాసంవుంది. పరమాత్ముడి లీలలకు అందరూ బద్ధులే అని చెప్పే కథ.

తన కొడుకుచేసిన నేరం కప్పి పుచ్చటంకోసం, వెంకటనరసయ్య, అయిదేళ్ళక్రితం పిచ్చివాడుగా తిరుగుతున్న చంద్రమౌళిని నేరస్థుడుగా చూపించిసే, ఆ చంద్రమౌళి పిచ్చి నయమయి, ఆనర్సు చదువుకొని లెక్చరరుఅయి, వెంకటనరసయ్య కూతురును పెళ్లాడి, మరణ సమయంలో అతనికిన్ని నీళ్ళు గొంతులో పోస్తాడు. ఇది విధివిలాసం కాకపోతే ఏమవుతుంది. ఆశ్చర్యం కలిగించే సామాన్యమయిన కథ.

'సబల' స్త్రీ సామర్థ్యం ప్రదర్శించే కథ. ఈ సామర్థ్యం మానసికం

విశాల కుటుంబ పరిస్థితులు బాగా లేవు. తన జీవిత భాగస్వామిని ఎన్నిక చేసుకోవటంలో ఆమె నేర్పు చూపించింది. కొంతవరకు నటన చేసింది. విజయం పొందింది. చక్కని సంసారం జీవితం జీవించింది. ఆ ప్రదర్శిత నైపుణ్యం కథలో బలం. అది చెప్పకూడదు. పాఠకులే చదువుకోవాలి. ఇదీ ఆశ్చర్యం కలిగించే సామాన్యమయిన కథ.

'జగన్నాటకం'—జీవితానికీ—నాటకానికీ మధ్య తేడా చూపించాలనుకొన్న నాటకం నాటకంలో అసహజత వుంటుందికానీ జీవితంలో ఉండదు అని చెప్పదల్చుకొన్నకథ.

నాటకంలోని కథతో తుల్యమయిన జీవితంలో బాధపడుతున్న భార్యను వదిలిపెట్టి వెళ్ళిపోయిన భర్త నాటకంలో సానుభూతి చూపలేడు. జీవితంలో తిరస్కారం ప్రదర్శిస్తాడు. వేదికమీద నాటకం జరుగుతూ వుంటుంది. ప్రేక్షకులలో సులోచన ప్రక్కనున్న 'పిన్ని'తో తన జీవితం చెప్పుకొంటూవుంటుంది. ఈ కథ పాఠకుల హృదయం దోచుకోగలిగిందే అయినా అసహజత సులోచన ధోరణిలో కనిపిస్తుంది.

'చీమలు పెట్టిన పుట్టలు' సాంసారికమయిన కథ. కుటుంబంలో ఆర్థిక పరిస్థితులు కారణంగా వచ్చే పరిణామాలు ప్రదర్శించే కథ. కొంచెం పెద్ద కథ.

వెంకట్రామయ్య బీదవాడు. కళ్యాణి,(కూతురు) పెళ్ళి చేశాడు. నాగరాజును (కొడుకు) షావుకారు రంగధామయ్యకు దత్తత ఇచ్చాడు. ఆ పైన కొద్ది కాలంలో గతించాడు. కళ్యాణి భర్త రాధాపతి అధ్యాపకుడు, స్కూలు నడపటంలో డబ్బు అవసరమయి భార్యను అన్న దగ్గరకు పంపాడు. ఆమె అక్కడ విచిత్రమయిన పరిస్థితులు ఎదుర్కొంది. చివరికి డబ్బు ఇవ్వకుండానే అన్న ఆమెను పంపించాడు. ఆ పైన దొంగతనం ఆమెమీద ఆరోపించబడుతుంది. చివరకు నిజానిజాలు తెలుస్తాయి. డబ్బు ఆవేది రక్త సంబంధం ఉన్న ఒక్కతల్లి పిల్లల్లోనూ ఎంత కఠినమైన పరిణామాలు తీసుకురాగలదో చూపించే కథ. పాఠకుల సానుభూతి నిస్సంకోచంగా పొందేకథ.

శ్రీ మధురాంతకం రాజారాం కథల్లో ప్రస్ఫుటంగా కానవచ్చే విశిష్ట గుణం తెలుగుదనం. చక్కని తెలుగు వాతావరణం, వ్యక్తులు, భావాలు – ముమ్మూర్తులా ఇవి తెలుగు కథలు.

భాష పాఠకులను బాగా ఆకట్టుకొంటుంది. గ్రాంథికానికి సమీపంగావుండీ ఈ కథల్లో కనిపిస్తుంది. వాక్య నిర్మాణం శిల్పి చేతిలో తీర్చిదిద్దిన బొమ్మలాగా వుంటుంది. అనవసరమైన పదాలు లేకుండా భావం సూటిగా చెప్పటం కథలలో కనిపిస్తుంది.

అయితే కథాపథకంలో అంత జాగరూకత ఉందని అనలేకపోవచ్చు పాఠకులు. కథకు అవసరం లేని విషయాలు ఈ కథల్లో చోటు చేసుకొన్నాయి. భాష, వాక్యనిర్మాణం, కథాకథనం అంతా బాగున్నా, కథాపథకం లోపం కళ్లకు కట్టినట్లు కనిపిస్తుంది.

పాత్ర సృష్టిలో రచయిత అందెవేసిన చేయి. తెలుగు పల్లెల్లో తిరుగుతున్న మనుష్యులే కథల్లోకి వచ్చారా అన్నట్లుగా వుంటాయి పాత్రలు. సజీవంగా అందరికీ పరిచయముండున్న వ్యక్తులలాగా పాఠకుల ప్రక్కనుంచి రాచుకుపోతుంటాయి పాత్రలు.

కథల ముగింపులు ముచ్చటగా వుంటాయి. ముగింపులు గుండెపై వేసే ముద్రవల్ల ఈ రచయిత ఏ కథనూ పాఠకుడు మర్చిపోయేందుకు ధైర్యం చేయలేడు.

కరుణరసపోషణలో, రచయితకు ప్రత్యేకత వుంది. అయితే ఆ ప్రత్యేకత నిరాశావాదందాకా పోకుండా జాగ్రత్తపడటం అవసరం.

అధ్యాపకవృత్తిలోని ఆనందంగూర్చి రచయిత పలికేతీరు, పాఠకులకు నచ్చుతుంది. జీవితంలోని సంతోషం అంతా వృత్తిలో నిక్షిప్తం చేసుకొన్న ఏ వృత్తిలోఉన్న వ్యక్తిఅయినా అటువంటి ఆనందమే పొందుతాడు.

రచయిత తన అభిప్రాయాలు చెప్పటానికే రచనలు చేస్తాడు. రచయితలే ఇతివృత్తంగా, రచనలే కథాంశాలుగా ఉన్న ఈ కథలు కొన్నింటిలో సమకాలీన రచనలు, రచయితలపై, ఈ రచయిత ప్రకటించిన కొన్నిభావాలు ఉన్నాయి. అవి అన్నీ అందరికీ ఆమోదయోగ్యాలు కావు.

ఇది ఈ రచయిత అభిప్రాయం అని ఏ రచయిత చెప్పిన అభిప్రాయమయినా స్వీకరించవచ్చు అసలు అభిప్రాయమే లేని రచనకంటే ఒక అభిప్రాయం ఉన్న రచన ఉత్కృష్టమయింది.

సహజత ఉండాలని వాంఛించే ఈ రచయిత కథలలో పాఠకులు అక్కడక్కడా అసహజత తిలకించే అవకాశం వుంది.

జీవితం గూర్చి భ్రమలేనటువంటి ఈ రచయిత కథలలో భ్రమ జనిత కల్పనలు గోచరమవుతాయి. ఆ మాత్రం కల్పన లేకపోతే రచన ఎలా సాధ్యం?

నమ్మిన సత్యం సూటిగా చెప్పగల ఈ రచయిత కథలు పాఠకులు తప్పక చదువుతారు.

## సామాన్యుడి కామన

[నవల: రచన : శ్రీహిత్ శ్రీ. ప్రచురణ : యం. శేషాచలం అండ్ కంపెనీ. మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాద్; ప్రతులకు : ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్ వెల : రూ. 2.00, పేజీలు 184.]

ఆంధ్రసాహిత్యంలో అవతరించిన నవలలు పదింటిలో ఒక్కటి ఇటువంటి నవలఉన్నా, ఆంధ్ర నవలాసాహిత్యం చాలా అత్యున్నతదశ అందుకొన్నట్లే భావింపవచ్చు.

ఒక సమస్యను స్వీకరించి, దానికొక పరిష్కార మార్గం చూపించి, వాస్తవికత ఉట్టిపడేట్టుగా సమాజ చిత్రీకరణచేసి, కథాపథకం కూలంకషంగా పరిశీలించుకొని, కథాభాగాలు నిర్ణయించుకొని, ఒక సంఘటనపై మరో సంఘటన నాటకీయత ద్యోతకం అయ్యేట్టుగా చిత్రించి, పాత్రచిత్రణ సంపుష్టంగా వుండి నవల రచించే సామర్థ్యం ఉన్న నవలా రచయితలతో కొద్దిమందిలో శ్రీహిత్ శ్రీకి ప్రత్యేక స్థానం వుంది. ఈ నవల తెలుగులో ఉత్తమమయిన నవలలో ఒకటిగా ఆంధ్రులు ఆంధ్రేతరులతో చెప్పుకోవచ్చు.

ఒక వ్యవస్థమీద మరో వ్యవస్థ ఎదురు తిరిగితే సమ్మెచేస్తే అందం వుంది. ఒక ఆశయం కోసం సమ్మెచేస్తే అందరూ హర్షిస్తారు. ఒక దుర్మార్గతను అంతమొందించటానికి ఒక సన్మార్గతను స్థాపించటానికి సమ్మెచేస్తే సముచితంగా ఉంటుంది. పరాయి పరిపాలన పనికిరాదని, స్వాతంత్ర్యం కావాలని దేశం సమ్మెచేస్తే ధర్మంగా ఉంటుంది సామూహికబాధను సమసిపోయేట్లు చేయటానికి సమ్మె చేయవచ్చు. సమ్మెకు కారణమయిన సమస్య ఎందరు వ్యక్తులకు బాధ కలిగించేదో దానినిబట్టి, సమ్మె విలువ నిర్ణయింపబడుతుంది. సత్యాగ్రహం, ఒట్టి ఆగ్రహంగా మారిపోతే విలువ తగ్గుతుంది. భారతీయులు స్వాతంత్ర్యం కావాలని చేసిన సమ్మె తప్పని బ్రిటీష్‌వాళ్లే అంతరంగంలో అనుకోలేదు. అయితే తమ ఆధిక్యం కాపాడుకోవటానికి చేసిన ప్రయత్నాలు ఎన్నయినా వుండవచ్చు. ప్రత్యేకరాష్ట్రం కావాలని ఆంధ్రులు చేసిన సమ్మెలు తప్పని ఆంధ్రులెవరూ అనుకోలేదు. ఇతరులూ అనలేకపోయారు. విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు అంటే కొందరు తప్పన్నారు. దేశగతమూ, సంఘగతమూ, విశాలవిషయమూ లేని సమ్మె సమ్మెకాదు. మానవమస్తిష్కంలోని క్రూరతకు రూపకల్పన. ఇంట్లో అమ్మ అన్నంపెట్టలేదని కొడుకు ఇల్లు పడగొడతాను, నేను సమ్మె చేస్తున్నాను అంటే ఎలా వుంటుందో అలా వుంటున్నాయి చాలా సమ్మెలు. ఇంట్లో అమ్మ నాకు అన్నంపెట్టి, మజ్జిగవేసి, ఉప్పువేయటం మర్చిపోయిందని, ఉప్పుసత్యాగ్రహంచేస్తా, వంటగదిఅంతా చిందరవందర చేస్తాననే కొడుకును చెవులుపిండి నోరుమూయించితే తప్పులేదు. పైగా మంచిది!

అన్యాయం ఎంత చిన్నదిఅయినా కావచ్చు. దాన్ని వ్యక్తంచేసే హక్కు లేదనుకోనక్కరలేదు. అయితే పిల్లికీ భిక్షానికీ ఒకటే మంత్రం కాదు. ప్రత్యల్పవిషయానికి వంద మెషిన్‌గన్స్‌కంటే బలమైన సమ్మెను ఆయుధంగా స్వీకరిస్తామంటే సభ్యసమాజం అంగీకరించదు. అలజడి, ఆందోళన రోడ్డుమీద కాల్లో మేకు గుచ్చుకొన్నందుకు దాని కెవరూ కారణం కాకపోయినా—చేస్తాననటం—అసభ్యం. ఎవరికయినా, ఎంత చిన్ననష్టమయినా, ఏ రూపంలోనయినా సంభవిస్తే, దానిని సముచితంగా పరిష్కరించుకోవచ్చు. తప్పులేదు. పరిష్కార మార్గాలు అన్నీ నిరుపయోగం అయితే, తీసుకోవాల్సిన చర్య, మొదటే తీసుకోకూడదు.

సమ్మెలన్నింటికి వెనుక సామాన్యంగా సహజమైన కారణాలు ఉంటాయి. అయితే అన్నిసమ్మెలూ సత్కారణ పరాభావంవల్ల పుట్టుకు రావటం లేదు. స్వతంత్ర భారతంలో అకారణంగా వచ్చే సమ్మెలు సొంత యింటిని తగలబెట్టుకోవటంతో సమానమయినవి. స్టేషన్ తగలబెట్టాం, రైలు పెట్టెలు కాల్చేశాం, వంతెనలు కూలదోశాము, బిల్డింగులు కాల్చేశాం. అయితే ఇదంతా ఎవడి సొమ్ము. ప్రతి మానవుడి, ప్రతి భారతీయుడి ఆస్తి. ఇలా సొంత ఆస్తిని నాశనం చేసుకొంటే భారతీయులు ఆర్థికంగా పెరిగేదెప్పుడు? ప్రపంచ దేశాలలో భారతదేశం తలెత్తుకొగలిగేదెప్పుడు? అప్పులు తెచ్చుకొంటూ దేశాన్ని అమ్ముకోబోయే మనస్థితి మారేదెప్పుడు? ఎప్పుడి దేశం బాగుపడేది?

శ్రీనివాస్ స్పిన్నింగ్ మిల్స్ యజమాని శ్రీనివాసరావు. పెట్టుబడిదారీ మనస్తత్వంఉన్న యజమాని కాదు. సంఘంలో జరిగే అన్యాయాలు సమూలంగా నాశనం చేయాలని పూనుకొన్న ధనవంతుడు. ప్రజలకు ప్రతిదినం కావలసిన వస్తువుల ధరలు ఆకాశం అంటుతుంటే అదుపులో పెట్టటానికి పూనుకొన్న సహృదయుడు. అతని పోటీవల్ల మిగతా వ్యాపారులకు అక్రమంగావచ్చే సంపాదన తగ్గిపోవటంవల్ల సమ్మె తయారయింది. సమ్మె కారణం బాహిరంగా కనిపించేది—జీతాలు పెంచాలి. అంతరంగా ఉన్నది అతను నాశనం కావాలి.

అప్పటికే మంచి జీతాలు ఇస్తున్న శ్రీనివాసరావు ఇంకా ఎక్కువ జీతాలుఇస్తే మిల్లు నడవదు. మూయవలసివస్తుంది. మూసివేస్తే నిరుద్యోగం విచ్చలవిడిగా నృత్యం చేస్తున్న ఈ దేశంలో మరికొందరు ఆ నృత్యంలో పాల్గొనవలసివస్తుంది. మూయకపోతే, తమ నష్ట పోవలసివస్తుంది. శ్రీని

వాసరావు డబ్బున్నవాడు కావటం తప్పుకాదు. ఆ డబ్బు నాశనం కాకుండా చూచుకోవటం తప్పుకాదు.

ఒక మంచి క్షణంలో తన ఆస్తి నష్టంకావటం అయినా సహించి, జీతాలు పెంచటానికి ఇష్టపడిన శ్రీనివాసరావు, తనకారు తగలబడి పోవటంతో, వెర్రి కోపంలో ఇచ్చిన మాట తప్పాడు. నేను జీతాలు పెంచనన్నాడు. వస్తే పనిలోకి రండి. లేకపోతే మానే యండి. రాకపోతే నాకు నష్టం ఉండదు అన్న ధోరణిలో ప్రవర్తిస్తే సమ్మెచేసిన వాళ్ళేం చేశారు. మామూలుగా పనిలోకి వచ్చారు. సమ్మెవల్ల సాధించిం దేమిటి? మామూలు జీతం! మామూలు జీవితం! సాదా జీవితం!

ఆ సమ్మెవల్ల వచ్చిన మార్పు ఏమిటి? కారు తగలబడిపోయింది. దేశ ఆర్థికరంగంలో ఓ పదిహేను వేలు తగలబడిపోయాయి! అదయితే ఫరవాలేదు. ఒక సహృదయుడి హృదయంలో కర్కశత్వం ప్రవేశించింది. అంతటితో ముగిసినా తప్పులేదు. మామూలు పరిణామమే అనుకోవచ్చు. ఒక మంచివాడు అన్యాయంగా జైలు పాలయ్యాడు. ఓ దుర్మార్గుడు ఓట్లు సంపాదించు కొని అవకాశం అంది పుచ్చుకొన్నాడు. మరో కుట్ర దారుడు – ప్లేట్లు ఫిరాయించగల సమర్థుడు – చక్కని ఉద్యోగం సంపాదించుకొన్నాడు. ఇంతా చేసింది ఒక సమ్మె!

'మానవత్వంతో మానవత్వం రగుల్కొల్ప డమే మన ఆదర్శం' అని రచయిత అభిప్రాయం.

'వైషమ్యాలు పెంచుకొన్నందువల్ల ఫలితం శూన్యం' (పేజీ 40). హృదయం మంచితనంలో మార్పు తేవాలిగానీ ఇతరమైన ఏ ప్రయత్నమూ మంచిదికాదనే భావం ఆనందరావు వ్యక్తం చేస్తాడు.

ఆనందరావు సామాన్యుడు. మామూలు మనిషి. సాదామనిషి. అతనికి ఉన్న దొక్కటే హృదయం. మనస్సు లేదు. మంచి ఏదనితోస్తే అదే చేస్తాడు. అందుకే అతన్ని పిచ్చివాడంటుంది చెల్లి పద్మ. అందుకే హృదయం అర్పిస్తుంది రేఖ.

మంచితనం, మరి మెరటుగావుంటే, అది పిరికితనంగా బలహీనతగా భావింపబడే అవకాశం వుంది. ఆనందరావు అంతమంచి మనిషి–పైకి చాలా ధైర్యవంతుడుగా కనిపించే వ్యక్తి–ఒక వేళ పిరికి వాడేమో అనే అభిప్రాయాన్ని చివరలో బలపరచే సన్నివేశం ఒకటి వుంది. తనదగ్గర శ్రీనివాసరావు వర్కర్లకు వ్రాసిన హామీపత్రం ఉంది. దాన్ని సంపాదించటం ధైర్యంతో కూడిన పని. ఆ విష యంలో ఆ ధర్మంముందు, మైత్రిని దూరం చేసు కొన్నాడు. మిత్రుణ్ణి శత్రువు చేసుకున్నాడు. చెల్లి విందు జీవితం భగ్నం అయిపోవచ్చునని తెలిసికూడా తెగింపు చేశాడు. అంతవరకు ఆనందరావులో ధైర్యం తక్కువని ఎవరూ అనరు. అగ్నివంటి ధర్మాన్ని ఆనందంతో ఆలింగనం చేసుకొన్నాడు. అయితే పోలీసు అధికారివచ్చి అరెస్టు చేయబోతున్నప్పుడు, ఏ కాగితం లోని విషయం సమ్మె చేస్తున్న అందరికీ వినిపించా లని ఇంత తెగువ చూపించాడో, ఆ కాగితం, అరెస్టు అయినప్పుడు వర్కర్లకు ఇవ్వలేదు. ఇద్దామని ఆలో చించలేదు. ఆ కాగితం చదివి వినిపించి పస్తావని పోలీసు అధికారిని అడగలేదు. మౌనంగా వెళ్ళిపోయాడు. అలా పోవటంవల్ల తను చూపిన ధర్మం ధైర్యం వల్ల ఎందరికో కలిగిన మనస్తాపం పోగొట్టుకొనే అవకాశం వుండటంవల్ల– పిరికితనంతో, ఆ కాగితం మాట ప్రస్తావించకుండా వెళ్ళిపోయాడనిపిస్తుంది. ఆనంద రావును పిరికివాడుగా చూపించటం రచయిత అభి మతం కాకపోతే, అది రచయిత లోపమే!

అందరూ అందలం ఎక్కితే ఎట్లా అన్న ఆనందరావుతో ఎక్కటం చేతకావద్దా అంటాడు దేవేంద్రరావు. నిజంగా అందలం ఎక్కిన ఆనంద రావును చూచి అమితదుఃఖం పొందిన దేవేంద్రరావు, బాధతో ఆనందరావు చాలా గొప్పవాడంటాడు. ఆ ఆనందరావు, అసహజమైన ఈ అందలం తన కక్కరలేదని తప్పుకొంటే, అందరికీ అందలం ఎక్కటం చేతకావద్దూ అనుకోవటం సహజంగా వుంది. మంచిచూచో, చెడ్డచూచో అందరూ అందలం ఎక్కలేరు. ఎంత కవితాసత్యం!

సగం సహజం సగం అసహజంఅయిన పునాది మీద లేచిన ఏ కట్టడంఅయినా శాశ్వతంగా నిలవదు. అటువంటి కట్టడంలో నివసించటం ఆనందరావుకు ఇష్టంలేదు. క్షణికావేగంలో పోలీసుమీద తిరగబడటం

అసహజం. ఉత్సవ విగ్రహంలా తను వూరేగింపబడుతుంటే ఆ దశలో తను విలపటం అసహజం. అందుకే అక్కడ వుండలేదు.

హృదయం సహజమయింది. మంచిగానీ, చెడుగానీ, దానినుంచి పుట్టుకువచ్చే కోర్కెలు అనుభూతులు సహజం. అందుకు హార్దికమయిన పరిణామం కాంక్షించినంతగా మరేది కోరడు ఆనందరావు. గీత వ్రాసిన ఉత్తరంలోని సంగతి కోర్టులో చెప్పివుంటే అతనికి జైలుశిక్ష పడివుండేదికాదు. అయినా ఉత్తరం ప్రస్తావన తెచ్చివుంటే, చంద్రయ్యకు హృదయ పరిణామం తెప్పించలేడు. దుర్మార్గుడయినా చంద్రయ్య ఆ ఉత్తరంలోని విషయం నలుగురుకూ తెలిసేట్టు చేస్తే తర్వాత తనకు ప్రమాదం అనే ఉద్దేశంతో వూరుకొన్నాడనీ, పిరికివాడనీ అనుకొనే అవకాశం లేకపోలేదు. అందుకే ముడిసరుకు అయిన మంచితనం పిరికితనంగా భాసించే అవకాశం వుంది. అయితే ఈ విషయంలో ఆనందరావు మూర్తి దాల్చిన సౌజన్యం. రూపొందిన ఓర్పు! శత్రువును కూడా క్షమించే ఔదార్యం గలవాడు.

తన విధి తను నిర్వహిస్తున్న పోలీసుపై తిరగబడటం మంచితనం అని ఎవరూ అనరు. ఆవేశం. అరెస్టు చేయబోతున్న పోలీసు అధికారికి లొంగిపోవటం గొప్పతనం కాదు. విధికి తలవంచటం. ఆవేశం కల ఆనందరావు, విధిని స్వీకరించటం ఉత్తమత్వం.

ఆనందరావు సమ్మె అసహజంగా ఉందనుకొన్నప్పుడు నిర్భయంగా మాట్లాడగలిగాడు. శ్రీనివాసరావు మాట తప్పుతున్నాడంటే, బాధపడిపోయాడు. ఆనందరావు కొంచెంసేపు సమ్మె చేసేవారికి నాయకుడు. మరి కొంచెం సేపు సమ్మెకు కారణమైన వ్యక్తికి సన్నిహితుడు. ఎక్కడ మంచితనం ఉంటే, ఎక్కడ ధర్మంవుంటే అటు ప్రక్కకు మొగ్గాడు. చివరికి రెంటికీ చెడ రేవడయ్యాడు. ఇరువైపుల నుంచి వచ్చిన వంచన శిరసావహించాడు.

ఆ విధంగా, అతని జీవితం పూర్తిగా నాశనమయిపోతుందనీ, అతని చెల్లి పద్మ జీవితం భగ్నమయిపోతుందనీ పాఠకులు అనుకొంటారు. జీవితంలో అయితే అలాగే జరగాలి. అయితే నవలలో అలా జరగలేదు. ధర్మం జయిస్తుంది. ఆడినమాటను తప్పని సత్యసంధుడు హరిశ్చంద్రుడు పాడయిపోయాడా? కష్టాలేకదా వచ్చింది! అంతే ఆనందరావుకు కష్టాలు మాత్రమే వచ్చాయి. నాశనమయిపోలేదు. అతని ధర్మవర్తనకు ప్రతిఫలం సవ్యంగా వుంటుందనే సూచనతో చేసిన ముగింపు కవితానత్యం !

రచనలో ప్రాథమిక దశలో ఉన్నవాళ్లు పాత్ర చిత్రణ బాగా చేయవచ్చు. (A further proof is in the fact that the beginners succeed carlier with the diction and characters than with the construction of a story— అరిస్టాటిల్). అయితే కథాపథకం నిర్మించుకోవటంలో రచయిత సామర్థ్యం ప్రశంసాపాత్రం. నవల సమగ్ర పరిశీలనానంతరం ఈ విషయం పాఠకులు స్పష్టంగా చూస్తారు. శ్రీనివాస్ స్పిన్నింగ్‌మిల్స్‌లో మేనేజర్ ఉద్యోగం ఖాళీగావుందని ప్రత్యేకంగా చెప్పక సంభాషణలో యదాలాపంగా చెప్పించటం, ముందు ముందు రానున్న గోపాలం పాత్ర పరిచయంచేసే తీరు సమర్థుడయిన రచయితకే సాధ్యం. కథాపథకంలో, కథాకథనంలో, పాత్ర చిత్రణలో సమాజం ప్రతిబింబించే తీరులో వ్రాయటం రచయిత దక్షత పాఠకులు గమనించి ఆనందిస్తారు.

రామ్మూర్తికి ఎంత స్వార్థంవున్నా ఆనందరావుకు అభ్యంతరం లేదు. అతను బాగుపడతానంటే ఎంత సహాయం-తనకు చేతనయితే చేయగలడు. ఇచ్చినమాట దాటకుండా అంత సహాయమూ చేశాడు. అయితే ఆ రామ్మూర్తి పదుగురకు కష్టం కలిగించే విధంగా నడుచుకొంటే అధిక సంఖ్యాకులకు కష్టం కలగకూడదు కాబట్టి అతనికి బాధ కలుగుతుందని తెలిసినా ధర్మం చేయగల సమర్థుడు ఆనందరావు.

రేఖ, పద్మ, గీత మూడు స్త్రీ పాత్రలు. పురుషపాత్ర సృష్టిలో రచయిత చూపిన వైవిధ్యం స్త్రీ పాత్ర సృష్టిలో మృగ్యం. ముగ్గురూ ఒక మూసలో పోతపోసి తీసి వేరువేరు వస్త్రాలలో భద్రపరచిన పాత్రలు ఈ ముగ్గురు మనస్తత్వం ఒకే విధంగా వుంటుంది ఆ ముగ్గురులో రేఖపాత్రసృష్టి వికాల ద్వ్యకృతంతో పాగింది. గీత తన ఆశలు తీరటమే ధ్యేయంగా ఉన్న కోమల హృదయ. తన స్వార్థం అయినా త్యాగం చేయగల సమర్థ.

మూడు పాత్రలు పాఠకుల సానుభూతి సంపాదించుకొంటాయి. రేఖ హృదయం ఆమెకే అస్పష్టంగా వుండి, ఆనందరావు జైలుకు పోయినప్పుడు కాంతిమంతమవుతుంది. గీత కరుణాత్మకంగా గోచరిస్తుంది. ఆ కరుణరససృష్టి, త్యాగలక్షణస్థాపనం పద్మ విషయంలో కథాంతంలో మరింత బాగా కనిపిస్తుంది.

గోపాలరావు యువకుడు. కలవారి బిడ్డ. కొంత ఆవేశం, కొంత ఆభిజాత్యం ఇచ్చే అహంకారం మరింత మానవత్వం ఉన్న పాత్ర.

రామ్మూర్తి తెలివితేటలను గూర్చి పాఠకులు అబ్బురపడినా, అతని ప్రవర్తన తెలుసుకొని అసహ్యపడతారు. ఈ నవలలోని పాత్రలు శ్రీ ఆనందరావు, శ్రీనివాసరావు, రామ్మూర్తి చక్కని పాత్ర సృష్టికి నిదర్శనాలు. మరీ చిన్నపాత్రఅయిన గీత కూడా మరువురాదు. అన్నిపాత్రలు కళ్లలో మెదులుతాయి. మరో ముఖ్యపాత్ర వుంది. అది సమ్మె. ఈ పాత్ర కళ్లలోంచి తొలగిపోదు.

ఈ రచయిత అర్థవంతమయిన భాష ప్రయోగించటం, వాక్యనిర్మాణం పటిష్ఠంగా చేయటంలో మరింత జాగ్రత ప్రదర్శించివుంటే బాగుండేది. వాక్యనిర్మాణం చాలా సడులుగా వుంటుంది. ప్రశంసాపూర్వకంగా చూశాడని చెప్పవలసిన చోట ప్రశంసాపాత్రంగా చూశాడు, వంటి ప్రయోగాలు-పదంయొక్క అర్థం పూర్తిగా ఆలోచించకుండ వ్రాసిన తావులు కొన్ని నవలలో కనిపిస్తాయి అవి సరిదిద్దుకోదగినవి. సమ్మె జరుగుతున్న తావులో జనాన్ని తప్పించుకొంటూ కారుపోతుందిగానీ దూసుకుపోదు. సిద్ధపదబంధాలు ప్రయోగించేటప్పుడు జాగరూకత అవసరం.

వాస్తవానికి చాలా దగ్గరగావున్న ఈ నవలలో కొన్ని పాత్రలు మాట్లాడే మాటలు అసహజంగా ధ్వనిస్తాయి. సంఘటనలలోను రెండుమూడుచోట్ల అసహజంగాఅయిన పరిణామాలు గోచరిస్తాయి. సమ్మె చేస్తున్న ఏ వర్కర్లుకూడా, అంత అకారణంగా, చాలాచోట్ల ఆనందరావును అంతగా గౌరవించక పోవచ్చు. అగౌరవించకపోవచ్చు. కారు తగలబడి పోతున్నప్పుడు, ఎవరైనా వెంటనే చేయగలపని ఫైర్ ఆఫీసుకు కబురు చేయటం. అయితే ఈ నవలలో కారు కాలిపోతుంటే, ఆ కారు సొంతమనిషితో ఉద్యోగం ఇమ్మనే యాచనచేసే ధోరణి, ఆ వ్యక్తి ఉద్యోగం ఇస్తాననటం, అప్పుడే ఉద్యోగంలో చేరినట్లు రెండో వ్యక్తి ప్రవర్తించటం, అప్పుడు ఫైర్ ఆఫీసుకు కబురుచేయటం — విచిత్రంగావుం దీవ్యవహారం అనిపించక తప్పదు.

ఏవో కొన్ని అవాస్తవికమైన లోపాల మాటకేమిగానీ, పటిష్ఠమైన కథగల నవల. తెలుగులో వచ్చిన మంచినవలదగ్గ నవలల కోవలోది. ఎమెస్కో సంస్థ ఇంతవరకు ప్రచురించిన అయిదారు మంచి నవలలో ఈ నవల చేరుతుంది.

## అదృష్టచక్రం

[నవల. రచన: శ్రీ హరికిషన్. ప్రచురణ: యం. శేషాచలం అండ్ కంపెనీ, మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాద్, ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాద్, వెల: రూ. 2-00; పేజీలు-176.

అదృష్టం చక్రం అయితే పైనున్న భాగంలోని పదార్థం క్రిందికి రాక తప్పదు. ఎందుకంటే చక్రం భ్రమించటానికే ఉద్దిష్టం. అయితే నిజ జీవితంలో అదృష్టహీనులు తరతరాలుగా అదృష్టహీనులుగానే వుంటున్నారు. అదృష్టవంతులు వంశపారంపర్యంగా అదృష్టవంతులుగా వుంటున్నారు. ఎక్కడోతప్ప అదృష్టవంతులు దురదృష్టవంతులు కావటం, దురదృష్టవంతులు అదృష్టవంతులు కావటం జరగటం లేదు. ఎక్కడి వాళ్లను అక్కడే వుంచటానికి సమాజం కట్టుదిట్టం చేసింది. వ్యవస్థ బలమైన పునాదులతో వుంది.

ధనవంతుడి పిల్లలు చాలావరకు ధనవంతులుగానే వుంటారు. అలాగే బీదవారి సంతానం ఎక్కడో తప్ప. ఈ ఆర్థికమైన విషవలయం తొలగిపోదు. ధనవంతులు అందరూ అదృష్టవంతులు అవుతారని గానీ, ధనహీనులందరూ దురదృష్టవంతులవుతారని గానీ సమాజం ముఖంచూచి ఎవరూ చెప్పలేదు.

ఇక్కడే ఈ 'అదృష్టచక్రం' పుట్టింది. సమాజస్థఆర్థికవైపరీత్యాలు సృజించే దృష్టితో ప్రారంభమైన నవల ప్రేమ జీవితంలో అదృష్ట

దురదృష్టవంతుల్ని పరిశీలిస్తూ పరిసమాప్తం అవుతుంది. ఈ నవల అందించే సందేశం సర్వులకు ఆర్థిక సమానత్వం కంగారిఅని అనుకొంటుంటే ప్రేమమయజీవితంలో తగిలే ఎదురుదెబ్బలు మనుష్య జీవితం ఎలా మార్చివేస్తాయో, నిష్కల్మష ప్రేమ ఏమిటో త్యాగ మేమిటో చెప్పింది అనిపిస్తుంది.

ఒక మార్గంలో సాగుతుందని తలపోసిన నవల మధ్యలో మరో మార్గంలో పయనిస్తుంది. ఒక మార్గం వ్యక్తం చేయటానికి ఉద్దిష్టమైన పాత్రలు పాత్రగతజీవితంతో, మరో మార్గంలో వెళ్ళిపోతాయి. పాత్రకు ప్రాణం పోయటంవరకే రచయిత పని. ఆ పైన సజీవంగాఉన్న పాత్రలు రచయిత మాట వినవు. ఆ పాత్రలు ఎలా ప్రవర్తిస్తే అలా రచన చేయటమే, ఇక రచయిత చేయగలిగింది. అదృష్టచక్రం నవలా రచయిత శ్రీ హరికిషన్ పాత్ర సృష్టి సజీవంగాచేసి, ఆ పాత్రల స్వేచ్ఛను ఏమాత్రం నిర్బంధించలేదు రచయిత చెప్పినట్లు పాత్రలు నడుచుకోలేదు. పాత్రలు ప్రవర్తించినట్లు నవల రచించబడింది.

'ఈశ్వరరావుగారి'కి సహధర్మచారిణివల్ల కలిగిన సంతానం సత్యవతి. ఉంపుడుగత్తె మంజులకు కలిగిన బిడ్డ నిర్మల. అంతే అంతకుమించి కుడి ఎడమల ఆయనకు సంతానంలేదు.

ఇక్కడే ఆర్థిక అసమానతలు ప్రతిపాదించాలని రచయిత ప్రయత్నం. ఈశ్వరరావుకు కలిగిన ఇద్దరు కుమార్తెలలో ఒకరు ఆస్తికి వారసులు. మరొకరు తన ప్రేమచేసే ధర్మంమీద ఆధారపడి జీవితం దిద్దుకోవలసినవాళ్ళు.

'ఈశ్వరరావుగారు' నిర్వికల్పంగా ఉన్నా, తన ఆస్తిఅంతా సత్యవతికి చెందుతుంది. తను నిర్వికల్పంగా వుంటే నిర్మలకు అన్యాయం జరుగుతుంది. నిర్మల, ఆ పైన, న్యాయంకోసం తాపత్రయపడవలసి వస్తుంది.

'ఈశ్వరరావుగారు' వ్యాపారంలో ఆరితేరిన మనిషి. 'బిజినెస్ యూనివర్సిటీ' కనుక వున్నట్లయితే 'వైస్-ఛాన్సలరు' కాదగిన మనిషి. వైస్ ఛాన్సలరు ఏం కర్మ ప్రో చాన్సలరుగానో, చాన్సలరుగానో అయి వుండవచ్చు. లక్షలు ఆయన చెప్పినట్లు నడుచుకొంటాయి. అవి పిల్లల్ని పెడుతూ వుంటాయి. అయితే ఆ లక్షలే 'ఒక్కసారి పిల్లలులేని గొడ్రాలులానే అవుతాయి'– అదెలా సాధ్యమో! అంత గొప్ప వ్యక్తి ధనాన్ని నిరుపయోగంగా లాభాలు ఆర్జించకుండా వుంచటమా? వీల్లేదు.

ఆరుమైళ్లు దూరంలో ఉన్న కాన్వెంట్ స్కూల్ కు కారులోవెళ్ళే సత్యవతి కారుకు పోటీగా అభిమన్యు దొర్లించుకొంటూ పోయిన ఆటవస్తువు. చక్రం. ఒట్టి చక్రంకాదు. అదృష్ట చక్రం. ఈ చక్రవర్తి సత్యవతి భవిష్యజ్జీవిత చక్రవర్తి అవుతాడని పాఠకులు అనుకోవటంలో తప్పులేదుగానీ, జీవితం, వాంఛలు, వాంఛోపజీవుల తీరుతెన్నులు భిన్నంగా వుండటం విచిత్రంకాదు. వుండకపోదు.

వీధిలో కూర్చుని పాటలు పాడి ధర్మం అడుక్కొని కడుపు కింత తిని, కలవారిలోగిలి ముందర తలదాచుకొని బ్రతుకు నెట్టుకువస్తున్న రామదాసు, కబీరుదాసు పిన్నవారు కన్నవారులేనివారు.

చావుబ్రతుకులమధ్య కొట్టుమిట్టాడుతున్న తల్లిని రక్షించుకొనేందుకు డబ్బులేక, మాతృవిహీనుడయి, రామదాసు ఆదరణ పొందిన అభిమన్యు అదృష్టవంతుడు. కబీరుదాసునూ, అభిమన్యునూ సొంత తమ్ముళ్ల మాదిరిగా చూచుకొనే రామదాసు ఉదాత్తవ్యక్తి.

ధనవంతుడి కుమార్తె చదువుకోసం ఉన్న హంగులు, బీదవాళ్లు చదువుకోసంపడే కష్టాలు, డబ్బులేక లేనివాళ్లుపడే కష్టాలు, ఉండీ, ఉన్నవాళ్లు పొందే వ్యథలు చిత్రిస్తూ రచయిత, ఆర్థిక అవ్యవస్థ మీద విమర్శనాదృష్టితో సాగించిన రచనకు గట్టి పునాది ఇక్కడే వుందని పాఠకులు పోల్చుకొంటారు.

ఈ నవలలోని పాత్రలయిన యువతీ యువకులకు యుక్తవయస్సు వచ్చింతర్వాత నవల మరో పథంలో సాగుతుంది. మొదటిభాగం సమాజగత పరిణామం కాంక్షిస్తుంది. ఒక ఆశయప్రచారంకోసం వ్రాయబడి ఆనందం కలిగిస్తుంది, కానీ చదవటానికి సామాన్యపాఠకులకు అంత ఉత్సాహంగా ఉండకపోవచ్చు. రెండోభాగం సామాన్యపాఠకుడి ఉత్సాహం కలిగిస్తుందికానీ, అటువంటి రచనలకు ఆంధ్ర నవలా సాహిత్యంలో కొదువలేదు.

పాఠకుల సానుభూతిని ఎంత తక్కువగా పొందగలిగితే ఆ పాత్ర అంత ఎక్కువకాలం గుర్తుంటుంది. 'అభిమన్యు' పాత్రపట్ల మొదట సానుభూతి కలుగుతుంది. రాను రాను, ఆ పాత్ర శీల సంపద గూర్చి ఆశ్చర్యం కలుగుతుంది.

రామదాసు సొంతతమ్ముడిచేత తూలనాడబడి, అటువంటి పరిణామం పొందితే బాధ కలుగుతుంది. దుఃఖం వస్తుంది. తమ్ముణ్ణి, తమ్ముడువంటి అభిమన్యును చదివించటానికి తన జీవితం, కిళ్ళీకొట్టులో భద్రపరుచుకొని ఎదుగు బొదుగు లేకుండా, మరొకరి కోసం శ్రమిస్తుంటే సానుభూతి కలుగుతుంది. ఈ సానుభూతి తదనంతరం, చివరలో కలిగిన బాధ, దుఃఖం, ఆ పాత్రను మరిచిపోనీకుండా చేస్తాయి.

సత్యవతి, అమాయిక. అందవలసిందేదీ అనుకూలంగా ఉన్నప్పుడు అందుకోలేని అదృష్టవిహీన. ఆమె ఎక్కవలసిన రెండు రైళ్ళ రెండుసార్లు, చూస్తూ వుండగా ప్లాటుఫారం దాటిపోతే, కంట తడిపెట్టిన ఆమె ఎక్కిన రైలు గమ్యం ఎక్కడో చెప్పకుండా రచయిత వదిలి పెడుతూ చేసిన సూచన పాఠకుల గుండెల్ని చిత్రహింసకు గురిచేస్తుంది. ఇలా ముగిసి పోయిన నవల, పాఠకుల కైవసం చేసుకొని, పుస్తకం మూసింతర్వాతకూడా ఆలోచింప జేస్తుంది.

నిర్మల, 'ఈశ్వరరావుగారి' ఉంపుడు గత్తె మంజుల కూతురుగా పాఠకులు తెలుసుకొన్నప్పుడామె బ్రతుకు ఏమయి పోతుందో అని దిగులు పడుతారు. ఆ పైన, అభిమన్యు శీలసంపద లాగానే, అమె శీల సంపద పట్ల ఆశ్చర్యం కలుగుతుంది. అందుకే వాళ్ళిద్దరూ ఒకటి కాగలిగారేమో ననిపిస్తుంది. వాళ్ళను గూర్చి పాఠకులకు దిగులులేదు. రచయితకు లేదు. ఆ పాత్రల తల్లిదండ్రులకూ ఉండదు. ఎందుకంటే వాళ్ళు బ్రతుకగలరు.

పాఠకుల, దిగులు, దుఃఖం, సానుభూతి విశేషంగా పొందగలపాత్రలు కబీరుదాసు, సుధారాణి. కబీరుదాసు, ఈ నవలాజీవితంలో పొందినన్నిమార్పులు ఏ పాత్రా పొందలేదు. మంచిగానీ, చెడుగానీ, క్షణ క్షణం పెరుగుతున్న, క్షణ క్షణం మారుతున్న, క్షణ క్షణం జీవిస్తున్న పాత్ర కబీరుదాసు. పాటలు పాడుకొంటూ వీధిలో తిరిగి, స్కూలులో చేరి, సత్యవతి అండదండలు అంది పుచ్చుకొని, లొంగిపోయి, విజయంపొంది, 'లా'లో చేరి, సినీమాపాటలు పాడి, సత్యవతి అనురాగంపొందీ దూరమయి, సుధారాణిని పెళ్ళాడి, ఎడమొగంఅయి, కనకవల్లితో జీవిత సంధి ఎక్కువ చేసుకొని కష్టాలుపడి, సంతోషం పొంది, నవ్వి, ఏడ్చి మంచిపనులు చేసి, చెడ్డపనులుచేసి, పశ్చాత్తాపపడి, మళ్ళీ తలెత్తుకొని, అవసరం అయితే గరిక పోచలాగా తలవంచుకొని, కాదంటే కఠిన శిలలాగా నిలబడి, చేస్తున్న దేమిటో తెలియకుండా, చేసిందాని పర్యవసానం చుట్టుముట్టేస్తుంటే తప్పుకోలేక, తప్పకోవాలనిపించక, ఆనందంకోసం జీవితం నుంచి పారిపోయి, దుఃఖంవస్తే కోపపడి, కోపం నాశనంతెస్తే మళ్ళీ దిగులుపడి, క్షమింపబడి, సరిగా బ్రతకాలని తలపోసిన కబీరుదాసు అచ్చమైన మనిషి. మనిషికి ఉండే అన్ని గుణాలు మంచీ చెడ్డా—ఉన్నవాడు. ఈ పాత్ర చిరంజీవి.

సుధారాణి చాలావరకు కబీరుదాసు పాత్రవంటి పాత్ర. అందుకే ఆ రెండు పాత్రలలో అంతపోలిక, అంత సామీప్యం. అంత అనుకూల్యం.

రచయితలు కొందరు, స్త్రీ పాత్రలు మహోత్తమంగా సృష్టింపగలరు. కొందరు, పురుషపాత్రలు జీవితంనుంచి వెలికివచ్చిన సత్యాలులాగా సృష్టింపగలరు. స్త్రీ పురుష పాత్రలు సమగ్రంగా ఒకే స్థాయిలో సృష్టి చేయగల రచయితలు అరుదు. ఒక స్థాయిమించి పాత్ర సృష్టి ఈ రచనలో జరగకపోయినా, స్త్రీ పురుష పాత్ర సృష్టిలో రచయిత అందెవేసిన చేయి.

రైల్వేలో గార్డుగా పనిచేసి రిటైర్ అయిన సుధారాణి తండ్రిపాత్రను రచయిత అంతగా కంటికి కనిపించకుండా చేయటంగూర్చి పాఠకులు బాధపడవచ్చు. ఎందుకంటే సంగీతసరస్వతి, గానకోకిల అయిన సుధారాణిని రైల్వేలో పనిచేసిన తండ్రి ఆమెను అలా ఎలా తయారు చేయగలిగాడా, అని ఆలోచిస్తారు. అందుకు అన్వయం వెదుకుతారు. ఆ పాత్రను రచయిత చూపించలేదు.

'ఈశ్వరరావుగారి'కి ఇంటా ఆడపిల్ల, బైటా ఆడపిల్ల పుట్టారు. కబీరుదాసుకు కలిగిన సంతానం ఆడపిల్ల. ఇటువంటివాళ్ళకు ఆడపిల్లలే పుడుతారు

అనే లోకంలోని మాటనుబట్టి రచయితలోకజ్ఞత పాఠకులు గమనిస్తారు.

మరణం చిత్రించటం, తమ్మాలంగా ఏదో పరిష్కరించినట్లు తలపోయటం తెలుగు రచయితలకు, ప్రాథమికదశలోఉన్నవాళ్లకు సామాన్య మయిపోయింది. మరణం, ఏ సమయంలోనూ, ఎప్పుడూ పరిష్కారం కాదు. మరణం పరిష్కారమార్గంగా, జీవితం ఎదుర్కొమని, జీవించమని చెప్పవలసిన రచయితలు, వ్రాయకూడదని అంగీకరించవచ్చు. ఈ రచయిత చివరిలో చూపిన మరణాలు నవలలో ప్రతిపాదితమైన నిజం ఎదుట నిలబడలేక పారిపోవటానికి చిహ్నాలు. రచయిత పరిష్కారం ధైర్యంగా చేసి వుండవలసింది.

పదునైన వాక్యాలు వ్రాయగల సామర్థ్యం రచయితకుంది. పాత్రచిత్రణలో నేర్పు వుంది. కథాకథనంలో జాగరూకత వుంది. జీవిత పరిశీలన వుంది. అయితే, వ్రాయదలచిన సంగతి పాఠకుల హృదయంలో నిలచిపోగలిగేట్టు చేయగలిగే మెలకువల సంతరించుకోవాలి. సన్నివేశగతమయిన సంఘటనలలో స్పష్టత గమనించాలి. ఒక విషయంలో మరో విషయం చొరబడకుండా చూసుకోవాలి అసహజ అనవసర విషయాలు పరిహరించాలి.

ఒకటో తరగతిలో చేరిన కబీరుదాసు, చేరిన ఆ రోజురాత్రే, చిన్న బెడ్‌లైట్‌ముందు పలకా పుస్తకాలు పెట్టుకొని చదువుకోగలడా ? ఎంత తెలివితేటలున్న కుర్రాడికయినా ఒక్క రోజులో 'అఆ'లు దగ్గర్నుంచి 'కఖ'లు వరకు వస్తాయా ?

రచయిత ఒకపాత్రకు 'గారు' అనే గౌరవం ఇచ్చి, మిగతా పాత్రలను సాదాగా వదిలేయటం బాగుంటుందా ? అభిమన్యు, తను పెళ్ళాడబోయే నిర్మల తల్లిని అగౌరవంగా సంబోధించగలడా ? రచయితకు పాత్రల హోదానుబట్టి గౌరవాగౌరవాలు ఉండకూడదు. అన్నిపాత్రలు తనసృష్టి సమానంగానే ప్రేమించాలి తన పాత్రల్ని రచయిత

ఒకలక్ష్యం వ్యక్తం చేయవలసి వచ్చినప్పుడు కొంతవరకు అసహజత చెప్పవేసి వస్తుందని ఈ నవలలో పాఠకులు గమనిస్తారు. లక్ష్యం కంటే ముఖ్యం రచయితకు సహజత

ఏమయినా ఈ నవల ఒకందుకు కాకపోయినా మరొకందుకయినా చదవదగింది.

## అహం, అనరం

[నవల. రచన: శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావు. ప్రచురణ: యం. శేషాచలం అండ్ కంపెనీ. మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాద్. ప్రతులకు—ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతిరోడ్, సికిందరాబాద్. వెల: రూ. 2.00. పేజీలు 167]

గృహయాజమాన్యం భర్తకుంటే బాగుంటుందా ? భార్యకుంటే బాగుంటుందా ? ఎవరికయినా వుండవచ్చు. సాధారణంగా గృహయజమాని అంటే భర్తే ! కానీ, ఒక్కొక్కప్పుడు భార్య సంపాదనపరురాలయితే, పెద్దమొత్తం ఆస్తికి వారసురాలయితే, గృహ యాజమాన్యం స్వీకరించే పరిస్థితి లేకపోలేదు. భార్యా భర్త లిద్దరూ ముసలివారయిపోయి, పిల్లలు పెద్దవారయి, ఉద్యోగం సద్యోగం చేసేవాళ్ళయి, డబ్బూ దస్కం తెచ్చే వాళ్ళయితే, పిల్లలు—మగసంతానం, మరీ పెద్దకొడుకు ఇంటియజమాని కావటం కద్దు. ఒక్కోపరిస్థితిలో పెళ్ళికాని పెద్దకూతురు ఇల్లు చక్కదిద్దటమూ వుంది.

అయితే నోరున్నవాళ్ళదే రాజ్యం అన్నట్టుగా నోరు పెద్దది చేసుకోగల స్త్రీ భర్త నోరునొక్కి గంగిరెద్దునుచేసి, కొడుకును అదుపాజ్ఞలో ఉంచి, కూతుర్నీ అల్లుళ్ళీ వెంట వేసుకొని, కోడలిని సతాయిస్తూ, ఇంటిపెత్తనంఅంతా నదే, ఈ ఇల్లు అనే మహాసామ్రాజ్యానికి నేనే ముకుటంలేని మహారాణిని అని ప్రకటించుకొని చిద్విలాసంగా పెత్తనం చలాయించ గలగటమూ వుంది.

ఇటువంటిదే ఈ నవలలోని అత్త, పార్వతి. ఆమె నోరు తెరిచి, ఏమయినా అడిగిందంటే, భర్త అంతులేని కంగారుతో కోర్కె గౌరవిస్తాడు. కోడలు ఆమె సాధింపులకు తట్టుకోలేక అవునూ కాదూ అనలేక ఆత్మగౌరవం దెబ్బతింటుంటే కిమ్మనకుండా వుంటుంది. కొడుకుమీద ఆమె ఏకాయెకి దండయాత్ర ప్రారంభించలేదుగానీ, కోడలుమూలంగా కొడుకు స్వాతంత్ర్యం కూడా దెబ్బతింటుంది. ఆమె

ప్రేమతో చూచుకోగలిగింది కూతుర్ని మాత్రమే. తమ్ముళ్లంగా అల్లుణ్ణి.

వెంకటసుబ్బయ్య భార్య పార్వతి. ఆ దంపతుల కొడుకు వాసు. ఉద్యోగి. కోడలు యమున. కూతురు నిర్మల. అల్లుడు జగన్నాథం. లాయరుగా ప్రాక్టీసు ప్రారంభించాడు. వెంకటసుబ్బయ్య ఉద్యోగ విరమణచేసి, విశ్రాంతి తీసుకొందామని నిర్విరామంగా ఆలోచిస్తున్నాడు.

వెంకటసుబ్బయ్య కట్టించిన యిల్లు భార్య పేరిట వుంది. అతని బేంక్ ఎకౌంట్ పుస్తకం పార్వతిదగ్గర భద్రంగావుంది. ఆమె తీయమంటే డబ్బు తీయాలి వేయమంటే వేయాలి. అంతే! ఆఖరుకు అరటిపువ్వు వడలు తినాలని ఆయనకు కలిగినకోర్కె కోడలుతో చెబితే, ఆమె చేసిపెడతానని మాట ఇవ్వటంతో తన అధికారం దెబ్బ తిందని కొన్న అత్త కస్సుబుస్సు మనటంతో నవల ప్రారంభమయింది.

తన ఉనికి కోడలుపిల్లముందు పరాభవింపబడిందని వాపోయాడు వెంకటసుబ్బయ్య. అంతా చేసేది తనే అయినా తనకు అవమానం జరిగినట్లు చింతించకుండా చింతించింది యమున. ఆ మాటే భర్తదగ్గర చెప్పుకొంది. అందువల్లే వాసు ఆ వూరు మంచి బెజవాడకు ఉద్యోగం బదిలీ చేయించుకొన్నాడు.

కొడుకూ కోడలు పొరుగూరు వెళిపోతుంటే బాధపడ్డాడు వెంకటసుబ్బయ్య. సంతోషించింది పార్వతమ్మ.

క్లబ్బులకుపోయి, పేకాటలాడి, తాగుడుకు అలవాటుపడి, ఆలస్యంగా ఇంటికివచ్చి, ఇల్లాలును మభ్యపెట్టి కాలం వెళ్ళబుచ్చుతున్న నేర్పరి జగన్నాథం, భార్యకు ఒక శుభసమయంలో తాను మునిసిపల్ ఎలెక్షన్లలో పోటీ చేయదల్చుకొన్న సంగతి, అందుకు కావలసిన అయిదువేలు సంగతిచెప్పి, అత్త అయితే సర్దుబాటు చేయగలదన్న సూచన చేశాడు.

పార్వతమ్మ అయిదువేలు ఇప్పించటానికి అంగీకరించింది. భర్తను బేంక్‌కుపోయి తీసుకురమ్మని పోరుపెట్టింది. ఒకరోజు ఒకవంక చెప్పి తప్పించుకొన్నాడు. రెండో రోజు మరోవంక పెట్టి బెజవాడ వెళ్ళిపోయాడు. బేంక్‌కు పోతాననిచెప్పి. వెంకటసుబ్బయ్య. దానితో ఆమె పని ఇరకాటంలో పడింది.

ఎలెక్షన్లు దగ్గర పడడంతో, ఏం చేయాలో తోచక, మాట నిలబెట్టుకోవటంకోసం, పరువు దక్కించుకొని దక్కించటంకోసం, తన నగలు అల్లుడికిచ్చింది. అవి అమ్మాడు. వచ్చిన డబ్బుతో జగన్నాథం ఎలెక్షన్ల సంరంభంలో కూరుకుపోయాడు.

ఆ పైన ఏమయిందో ఏమని చెప్పటం! తిరిగి వెంకటసుబ్బయ్య, పార్వతి ఎలా ఒకటై పోయారో ఎలా వివరించటం. నవలాంతంలో గృహ యాజమాన్యం ఎవరు స్వీకరించారో ఎలా తెలపటం — అందుకే నవల చదవాలి!

కథాపథకంలో వాస్తవికత పాఠకుల్ని బాగా ఆకట్టుకొంటుంది. ఈ నవలలోని కథ చాలా ఇళ్ళలో జరుగుతూ వుండే అతిసామాన్యమయిన సంగతి. ఇది వాస్తవంగా లేదు అని, ఏ సంఘటననూ సన్నివేశాన్నీ ఎవరూ అనలేరు. ఇంత వైశాల్యంగల ఇతివృత్తం స్వీకరించి, రచయిత సమర్థవంతంగా రచించిన ఈ నవల జీవితందర్శించటానికి అన్నిఅందాలా తగింది.

అయితే ముఖ్యమైన లోపం, ప్రస్ఫుటంగా గోచరమయ్యే లోపం రచనకు సంబంధించింది. అల్ప విషయం చెప్పటానికి అనవసరంగా పేజీలకొద్దీ తీసుకొంటూ పోవటం, ఒక్కవాక్యంలో చెప్పదగిన విషయాన్ని ఒక పేరాకు పెంచటం, పేరావిషయం పేజీకి పెంచటంవల్ల రచయిత దృష్టి ఏమిటో అర్థం కాదు. నవల అంతటిలో ఈ సాగలాగినధోరణి కనబడుతుంది. ఈ 167 పేజీల నవల సగానికి సగం తగ్గించివుంటే చక్కని రచనఅయి వుండేదేమో. రచయిత నవలారచన పూర్తి అయింతర్వాత సంపాదకుడి పని చేసుకోకపోతే, నవలలో స్వక్రమమయిన పెరుగుదలకు బదులు ఎటుబడితే అటు నవల పెరిగిపోయి వికృతంగా గోచరించే అవకాశం ఎంతైనావుంది. ఈ నవలలోని ప్రతిపేరా సగంచదివి, వదిలేసి, మరో పేరాలో సగం — ఆ విధంగా చదువుకొంటూ పోయినా, ఏ ఇబ్బందీ కల్గదు. మరో సుగుణంకూడా వుంది. విసుగుపుట్టదు. రచయిత పాఠకులకు అన్ని విషయాలు, స్పష్టంగా మరీస్పష్టంగా చెప్పాలని తొందరపడ నక్కరలేదు. సూచనగా చెబితే విపులంగా వ్యాఖ్యానం చేసుకోగల సమర్థులు పాఠకులు కారనుకో నక్కరలేదు.

రచయిత చెప్పినంతవరకు పాత్రలు చేశాయి. పాత్రల పరిధి రచయిత నిర్ణయించి, ఆ నిర్ణీతావధి దాటనీలేదు. ఈ పాత్రలు ఎందుకు సృజింపబడ్డాయో అందుకే జీవించాయి. అంతకుమించి స్వాతంత్ర్యం పొందలేదు. అయితే అవి జీవించిన మేరలో సహజంగా ఉన్నాయి. కళ్లకు కట్టినట్లు కనిపించాయి.

యమున పాత్ర భర్తను మరో వూరు బదిలీ చేయించుకోవటానికి ప్రోత్సాహ కారణమయింది. ఆ పాత్ర ముఖ్యమైనదని అంతే! అంతవరకు ఆ పాత్ర నెరవేర్చింది.

వాసు బదిలీ చేయించుకొని బెజవాడ వెళ్లి పోవటం మాత్రమే చేయాలి. అలాగే చేసిందా పాత్ర.

వృద్ధాప్యంలో డబ్బుతో లంకె పెట్టుకొని, భార్యను బాగుచేయటంకోసం బేంక్‌లో డబ్బు డ్రా చేయకుండా వెంకటసుబ్బయ్య బెజవాడ వెళ్లిపోవాలి. అలాగే వెళ్లాడు.

నిర్మల తల్లిచాటు బిడ్డ, భర్తచాటు భార్య. ఇద్దరికీ మధ్య వంతెన, తల్లిఅనురాగం ఆగమించటానికి, భర్త ఆశలు పరుగెత్తటానికి. ఆ పాత్ర ప్రయోజనమూ తీరింది.

అత్త అభిమానం ఆసరాగా తీసుకొని, ఆమె అహంకారం రెచ్చగొట్టి, ఆమె పట్టుదలను పడిచి పట్టి, ఎలెక్షన్లకోసం, దుర్వ్యసనాలు తీర్చుకోవటం కోసం, ఆమె నగలమ్మి, డబ్బు సంపాదించి తిరగబడటం జగన్నాథం పాత్ర ప్రాముఖ్యం. ఆ ప్రయత్నమూ సమకూడింది.

అయితే, అత్తపాత్ర కించిద్విశాలమయింది. ఆమె భర్తను ప్రేమిస్తుంది. అయితే అతను లొంగి వుండాలి. కూతుర్ని చేరదీస్తుంది. అయితే ఆమె భర్తను వశం చేసుకోవాలి. కోడలును ఒప్పుకొంటుంది. అయితే అన్నింటికీ ఆమె లొంగి వుండాలి. కొడుకంటే ఇష్టమే. అయితే అతను భార్యను తల్లికి పాదాక్రాంతను చేయాలి. అల్లుడన్నా అభిమానమే, అయితే అతను తనను గౌరవంగా చూడాలి. తన కూతురుకు లొంగి వుండాలి

నవల ప్రారంభంలో పార్వతమ్మ గొప్పగర్వం గల స్త్రీ. మధ్యలో దెబ్బతిన్న మనిషి. చివరలో పశ్చాత్తాపపడిన వ్యక్తి. పార్వతి పాత్రలో కనిపించినంత చిత్రవైవిధ్యం, భావతీవ్రత, నవలలో మరే పాత్రలోనూ కనిపించదు. పార్వతి నిండయిన పాత్ర. ఇటువంటి వ్యక్తులు లోకంలో కోకొల్లలు. అందుకే ఈ పాత్ర లోకం పోకడకు సహజ చిత్రీకరణ. సహజమయిన పాత్ర.

రచయిత శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావు ఈ నవలలో కొన్ని ఇతరేతర విషయాలు ప్రస్తావింపక పోలేదు. ఎలెక్షన్లమీద రచయిత అభిప్రాయాలు గుర్తింపదగ్గవి.

'మన దేశపు సాధారణ యెన్నికలలో పోటీ చేస్తున్న కొందరు అభ్యర్థులు డబ్బు వెదజల్లుతూ విజయంసాధిస్తున్నారు, డబ్బు ఖర్చుపెట్టలేని కొందరు నిజమైన ప్రజాసేవకులు చిత్తుగా ఓడిపోతున్నారు'. పేజీ 67.

'ప్రజలకు సౌకర్యాలు కలిగించినా, కలిగించక పోయినా యెవేవో చేస్తామంటూ, ముందుగానే ఆశలు కల్పించాలి. దీన్నే రాజకీయమంటారు. ఎలెక్షన్లంటే యేమిటనుకొన్నావు మరి ?... అవసరమైతే అబద్ధాలు కూడా చెప్పాలి'. పేజీ 90.

సామాన్యమైన స్థాయిలో పఠనయోగ్యంగా రూపొందిన ఈ నవల పాఠకులు కాలక్షేపంకోసం చదవవచ్చు.

## గిరీశం ది గ్రేట్ సెకండ్ స్టెప్

[సంభాషణాత్మక రచన. రచయిత: శ్రీ వడ్లమన్నాటి కుటుంబరావు ప్రచురణ: యం. శేషాచలం అండ్ కంపెనీ, మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాద్. ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతి రోడ్–సికింద్రాబాద్. వెల రూ. 2.00 పేజీలు 184.]

గురజాడ ఆంధ్రభారతికి సమర్పించిన కంఠహారం కన్యాశుల్కం. అందులో మరుపురాని పాత్ర గిరీశం. శ్రీ వడ్లమన్నాటి కుటుంబరావు గిరీశం పాత్ర మరచిపోలేక చేసిన రచనలు గిరీశం ది గ్రేట్ పిసిప్రవేశం, గిరీశం ది గ్రేట్ సెకండ్ స్టెప్.

డామిట్ కథ అడ్డం తిరిగిందనుకొన్న గిరీశం ఆపైన ఏమవుతాడని నాటకం చదివిన అందరూ ప్రశ్నించుకొంటారు. కన్యాశుల్కంలోనే అందుకు సూచనవుంది. బుచ్చమ్మను పెళ్ళాడి చదువు పూర్తి

తీసుకొంటాడా అని. ఆ సూచనే చాలామంది అంగీకరిస్తారు.

అయితే ఈ రచయిత అంగీకరించలేదు. బుచ్చమ్మను లేవదీసుకు వచ్చిన గిరీశం మద్రాసు మకాం వేశాడని, సినిమా రచయితగా మారిపోయాడని, ఆపైన నిర్మాత అయ్యాడని ఈ రచయిత ఊహ. అలాగే మధురవాణి రామప్పంతులు దగ్గరకుచేరి అక్కణ్ణుంచి మద్రాసు ప్రయాణంకట్టి, మద్రాసు చేరి, కాంట్రాక్టు ఏక్ట్రెస్ అయిందని, వెంకటేశం కూడా అక్కడగ్గరకుచేరి అవసరమైన విధంగా రూపొందుతూ వుంటాడని రచయిత వూహ!

ఈ గిరీశం ఆ గిరీశంలాగా యువకుడు గాడు. వయస్సు మళ్ళినవాడు. అనుమానం మనిషి. పాఠకులకు అంతా సంతోషమే కలిగించడు. కొంత జుగుప్స, ఏవగింపు కలిగించేవాడు. ఆంధ్రులు ఆ గిరీశంను ప్రేమించినంతగా ఈ గిరీశంను ప్రేమించలేరు. రామప్పంతులు, లుబ్ధావధాన్లు నీడలు తొంగి చూస్తాయి గిరీశంలో.

ఆ బుచ్చమ్మ అంతటి అమాయకురాలు కాదీ బుచ్చమ్మ. ఆమె అంతగా అభిజాత్యవతిగా కనిపించదు. రాటుదేరిన అమాయకులయిన వేశ్యలు మాట్లాడే తీరులో మాట్లాడుతుంది. ఆ బుచ్చెమ్మపట్ల కలిగే సానుభూతి ఈమెపట్ల కలగదు.

మధురవాణి చలాకీఅయిన మనిషి. వేశ్య అయినా నీతికి కట్టుబడివుండే తరహా వ్యక్తి. అధర్మంలోనూ ధర్మం పరిశీలించగల సమర్థురాలు ఈ మధురవాణి తరహా వేరు. గిరీశం ఆహ్వానంవల్ల మద్రాసు వచ్చింది. సినిమాలో చేరదామని తహతహలాడుతూవుంది. సినిమా అవకాశం వచ్చిందాకా వంటమనిషిలాగా కాలం వెళ్లబుచ్చటానికి వెనుకాడలేదు. గిరీశం వెళ్ళిపొమ్మంటే మద్రాసు వదిలిపోననే ధోరణిలో వుంటుంది. ఆ మధురవాణిని చూచిన కళ్లతో ఈ మధురవాణిని చూస్తే రసజ్ఞులయిన పాఠకులు అమితంగా బాధపడిపోతారు. అసలు మధురవాణి చుట్టు అందరూ తిరుగుతారుగానీ, ఆమె ఎవరి చుట్టూ తిరగదు.

మూర్తి కన్యాశుల్కంలో లేని పాత్ర. ఈ రచనలో ఉన్నాడు. అతను మాట్లాడే తీరు, కన్యాశుల్కంలో గిరీశం మాట్లాడే తీరులో వుంటుంది.

వెంకటేశం కన్యాశుల్కంలో పసివాడు. ఈ రచనలో పెద్దవాడు, కావాలంటే కారు డ్రైవర్. ఇంకా కావాలంటే స్టుడియో అద్దెకు తీసుకోగల పెద్దవాడు. సినీ ప్రపంచంలో ఏ పనికి మనిషి అవసరం అయితే ఆ పనికి తయారయ్యే పాత్ర.

ఈ రచనలో ఉన్న పాత్రలు చాలావరకు కన్యాశుల్కంలోని పాత్రంపేర్లే కలిగి వున్నాయి కానీ, స్వరూప స్వభావాలుమాత్రం ముమ్మూర్తులా ఆ పాత్రలని పుణికి పుచ్చుకోలేదు. అయితే ఆ పాత్రలు లాగా ఈ పాత్రలు గోచరించే అవకాశం వుంది.

పాత్రలు విషయంలోనేకాక రసవిషయంలోనూ కన్యాశుల్కంతో ఈ రచనకు సామ్యం వుంది. ఆ నాటకంలోవలె ఈ రచనలో హాస్యం ప్రధానంగా వుండాలని రచయిత ఆకాంక్ష. అది కొంతవరకు నెరవేరింది.

ఇది 'సుప్రసిద్ధ సినిమా మాపిసి హాస్యవ్యంగ్య రచన' అని ప్రమరణకర్తల అభిప్రాయం. ఇందులో హాస్యమూ, వ్యంగ్యమూ రెండూ ఉన్నాయి. గిరీశం, మూర్తి మాట్లాడే చాలా మాటలు అందుకు నిదర్శనంగా వుంటాయి. చాలా తావుల్లో వాళ్లిద్దరూ పలికే తీరు హాస్యం కలిగించటం బదులు జుగుప్సకలిగిస్తుంది. అసహ్యమయిన అర్థం స్ఫురించి సుకుమారహృదయులైన పాఠకులు ఏవగింపుపొందే స్థితివుంది. మోటుసరసంగా, మోటుహాస్యంగా వుంటాయి చాలా సంభాషణల్లో వాళ్ళ మాటలు. అశ్లీలత బాగా ధ్వనిస్తుంది. ఒక రకం పాఠకులు ఈ రచనపట్ల అమితమైన ఆసక్తి చూపే అవకాశం వుంది. కొన్నిచోట్ల ఎదురయ్యే బాధాకరమైన హాస్యం మాట అటుంచి, సరదాగా నవ్వుకొంటూ చదువుకోవటానికి ఈ రచన ఉత్సాహంగా వుంటుంది.

కన్యాశుల్కం నాటకం కనుక ఈ రచనమూ నాటకంగా వ్రాయాలని రచయిత ప్రయత్నం. సంభాషణలు, మాత్రమే నాటకంగా రూపొందలేవు. నాటకంలో సంభాషణలు అవసరం లేదనటం లేదు. ముఖ్యంగా వుండవలసింది, నాటకీయత. ఈ రచనలో నాటకీయత లోపించింది.

అయితే కించిన్మాత్రంగా నాటకీయత గోచరించే తావు ఒక్కటి లేకపోలేదు. బుచ్చమ్మ సెట్‌మీద ఉన్నప్పుడు ఊరికే కూర్చునివున్న గిరీశం మధురవాణిని చూడాలని టాక్సీలో ఇంటికిపోయి, ఆమెతో సరసాలు ఆడుతున్నప్పుడు, సెట్‌మీద డైలాగ్ పలకలేక

బుచ్చమ్మ అక్కడ మార్పుకోరి, గిరీశంకోసం వెదికితే అక్కడ లేకపోవటంతో డ్రైవర్ను ఇంటిదగ్గర గిరీశం ఉన్నాడేమో తీసుకురమ్మని పంపితే వచ్చేటప్పటికి తట్టి నప్పుడు కొన్నింత నాటకీయత. అప్పుడు మంచంక్రింద దాక్కున్న గిరీశం, కన్యాశుల్కంలో మంచం క్రింద దాక్కున్న సిద్ధాంతిని గుర్తు తెస్తాడు. మధురవాణి గిరీశం ఇక్కడకు రాలేదని చెప్పి పంపించివేస్తుంది. (ఈ మధ్య ఏదో సినిమాలో అటువంటి సన్నివేశంకూడా కనిపించింది). తిరిగి స్టూడియోకి వచ్చిన గిరీశం ఎంతో అసమర్థంగా అబద్ధం ఆడాడు. నిజంగా మూర్తి ఆ పుస్తకం ఏ షాపులో అడిగారో చెప్పండి. పనివాళ్ళ చేతో, వెంకటేశం చేతో తెప్పిస్తాను అని అంటే గిరీశం ఏం చెప్పివుండేవాడు.?

ఒక పావుగంటో అరగంటో నాటిక కొన్ని సన్నివేశాలు తీసి సమర్థులు ప్రదర్శిస్తే ఈ రచన నాటికగా రక్తి కడితే కట్టవచ్చుగాని, రచయిత ప్రధానోద్దేశం ప్రదర్శన కాదు. పాఠకుల పఠనం. ఇది శ్రవ్యకావ్యం కావాలనే రచయిత వాంఛగాని దృశ్యకావ్యం కావాలనికాదు. ప్రయోగానుకూల్యం ఈ రచనలో ప్రతిఫలింప బడలేదు.

భాషనుగూర్చి ఇటువంటి రచనల్లో ఆలోచించటం అనవసరం. అయితే ఇది కన్యాశుల్కం తదనంతర రచనగా తలపోయబడింది కాబట్టి ఆలోచన. రచయితకు వ్యవహార దక్షత ఉన్నంతగా శబ్ద శుద్ధి వుందని ఆశించరాదు. కన్యాశుల్కంలో ఉన్నంత జీవభాష ఈ రచనలో కనిపించదు.

రచయితకు సినిమా 'లైను'లో ఉన్న సర్వ విషయాలు కూలంకషంగా తెలుసునని ఈ రచన చదివిన ఎవరికయినా తెలుస్తుంది. సానుభూతితో విషయ పరిశీలన చేయగల సామర్థ్యం రచయితకుంది.

గాడిదమీద రచయిత 'థీసిస్' పాఠకులు పరిశీలింప దగింది. సినిమాలో నల్లడబ్బు తెల్లడబ్బూ గూర్చి చెప్పి నల్లడబ్బు తెల్లడబ్బు చేయటం ఎలాగో రచయిత చెప్పే సంగతి పాఠకులు ఆసక్తిగా చదువుతారు.

బొగ్గుల డబ్బాలో అడుగున నల్లడబ్బు దాయవచ్చుననీ, ఇంకా ఎన్నోరకాలుగా గుప్తంగా ఉంచవచ్చుననీ చెబుతుంటే పాఠకులు కొంతవరకు ఆశ్చర్య పోతారు.

సినీలోకంలోని మోసాలు, కుళ్ళు అసహ్య విషయాలమీద బాధతో రచయితచేసే వ్యాఖ్యానం ఒకవిధమయిన బాధతోనే పాఠకులు చదువుతారు.

రచన చివరలో పెద్దబాలశిక్షను గూర్చి రచయిత చెప్పిన మాటలు పాఠకుల హృదయంలో నిలిచి పోతాయి. రచన అంతటిలోను రచయిత సరదాగా, హుషారుగా నవ్విస్తూ అక్కడక్కడా కొంచెం బాధ పెడుతూ వ్రాసినా, ఆశ్చర్యంలో బాధలో పాఠకుడి కళ్ళు కింతకాంతి కపింపచే తావు చిట్టచివర వుంది. అది మంచి ముగింపు. రచన అంతటిలో రచయిత హడావుడి పడినా, రచయిత జీవించిన తావు తుట్టతుదకు కనిపిస్తుంది

చుంబన్, మర్దన్ అనేవి ఒకేసారి తీయబోతున్న రెండు సినిమాలని ప్రారంభంలో చెప్పిన రచయిత రానురానూ ఆ విషయం మరిచిపోయినట్లు తోస్తుంది. చుంబన్ తీసింతర్వాతే మర్దన్ తీద్దామను కొంటున్నట్లు చెప్పటం గమ్మత్తుగానే వుంటుంది. బుచ్చమ్మ మూడో సినిమాకు నామకరణం చేసింది. 'బంధన్'.

చుంబన్ మర్దన్ ఆ రెండు పేర్లమీద ఎప్పుడు శ్లేషప్రయోగమయినా అశ్లీలంగానే వినిపించింది. మేకప్‌మేన్‌దగ్గర బుచ్చమ్మ తిప్పలు చూస్తుంటే రచయితకు మేకప్ సంగతిలో ప్రత్యేక పరిచయం ఉందని పాఠకులు తలపోస్తారు.

అశ్లీలతకు చోటీకుండా రచయిత రచన చేయటానికి ప్రయత్నిస్తే మంచిహాస్యరచనలు వెలువడే అవకాశం వుంది. ఈ రచన ఉత్సాహంగా చదువు కొంటూ మరింత మంచిరచనకోసం పాఠకులు ఎదురు చూస్తారు.

—రవి.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu chetty Street, Madras-1.
Editor : S. Sambhu Prasad.